# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 9 సంచిక : 6 హైదరాబాద్ 119 జూన్ 2011 పేజీలు : 68 రు. 15

- ఫోకస్ : పాఠశాల విద్యారంగం సమస్యలూ - సవాళ్లూ
- ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు
- ప్రజాభిప్రాయ సేకరణల తంతు
- సాయిబాబా అసత్య సామ్రాజ్యం
- బోధ్‌ఘాట్ ప్రాజెక్ట్
- ఆర్థికాభివృద్ధి - సామాజిక న్యాయం
- లాడెన్ - నిజానిజాలు

## వీక్షణం విస్తరించడానికి సహకరించండి!
## మీ మిత్రులందరికీ పరిచయం చేయండి!!
## మీ వంతుగా చందాలు చేర్పించండి!!

వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికకు ఎనిమిది సంవత్సరాలుగా మీరు అందిస్తున్న ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు. మీ నిత్యజీవితంలో, కుటుంబ సభ్యులతో, పని స్థలంలో, స్నేహితులతో, భిన్నాభిప్రాయాలున్న వారితో మాట్లాడుతున్న ప్రతి సందర్భంలోనూ వీక్షణంలోని వ్యాసాలు, అభిప్రాయాలు మీకు ఉపయోగపడతూనే ఉన్నాయి. ఈ పత్రిక నిలదొక్కుకుని పది కాలాలపాటు నిలబడాలని మీరు కోరుకుంటున్నారని మాకు తెలుసు. తెలుగు సమాజానికి అవసరమయిన విభిన్న ఆలోచనలను అందించే పత్రికగా వీక్షణం ఇంకా విస్తరించాలని కూడా మీరు కోరుకుంటూ ఉంటారు. కాని, వీక్షణం ఆర్థిక పరిస్థితి సుస్థిరంగా లేదు. వీక్షణంను నిలబెట్టడానికి మీరు తక్షణమే పూనుకుని చేయవలసిన పనులు కొన్ని ఉన్నాయి.

- మీ బంధుమిత్రుల దగ్గర, మీ పనిస్థలంలో, మీరు మాట్లాడే ప్రతిచోటా, సామాజిక రాజకీయ విషయాల చర్చ వచ్చిన ప్రతిచోట ఆ విషయాల మీద వీక్షణం అవగాహన కలిగిస్తుందని ప్రస్తావించండి. వీక్షణం చదవడం ఎంత అవసరమో చెప్పండి.
- మీ చందా చెల్లించడంతోపాటు, మీ మిత్రుల కొరకు కానుకగా చందా చెల్లించండి. వారిని చందా చెల్లించమని కోరండి.
- మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న గ్రంథాలయానికి వీక్షణం వస్తుందో లేదో కనుక్కుని తెప్పించడానికి ప్రయత్నాలు చేయండి.
- మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న విద్యాలయాలలో, కళాశాలలో, ముఖ్యమైన ప్రభుత్వ, ప్రభుత్వేతర కార్యాలయాలలో, స్వచ్ఛంద సంస్థల, యువజన సంస్థల కార్యాలయాలలో వీక్షణం వస్తుందో లేదో కనుక్కుని వారిచేత చందాలు కట్టించండి.
- మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న వీక్షణం శ్రేయోభిలాషులు, విద్యా సంస్థల నిర్వాహకులు, వ్యాపారవేత్తల దగ్గర వీక్షణంకు ప్రకటనలు సేకరించండి.
- మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న పత్రికల ఏజెంటు వీక్షణం తెప్పిస్తున్నారో లేదో కనుక్కుని తెప్పించేలా చూడండి.

### చందా వివరాలు

| | సంస్థలకు/లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | - |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | - |

**వీక్షణం అకౌంట్ నెంబర్ - 013911011002175, ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్**

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**


**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

119

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

జూన్ 2011
సంపుటి : 9
సంచిక : 6



## లోపలి పేజీల్లో...

ఫోకస్ : పాఠశాల విద్యారంగం - సమస్యలూ, సవాళ్లూ





ప్రింటర్స్
డక్కన్ ప్రెస్ /
చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ – 013911011002175
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

వీక్షణం మార్చ్ 2011 సంచికలో 'మహిళా దినోత్సవం – ఒక ఎరుక, హెచ్చరిక' పేరిట కాత్యాయనీ విద్మహే రాసిన వ్యాసంలో వివరమైన సమాచారాన్ని సేకరించి ఇచ్చారు. పోతే ఈ వ్యాసంలో కొన్ని విషయాలు వాస్తవ దూరంగా ఉన్నాయి. అన్ని విషయాలు నేనిక్కడ ప్రస్తావించకపోయినా ఆవిడ విస్మరించిన ముఖ్యమైన విషయాన్ని దృష్టికి తేవాలనుకుంటున్నాను. 1970లలో మహిళా దినోత్సవాన్ని తమదిగా చేసుకుని, హైదరాబాద్ కేంద్రంగా పనిచేసిన మహిళా సంఘాలు, స్వచ్ఛంద సంస్థలకు సంబంధించిన సమాచారాన్ని ఇచ్చారు. అనేక రకాల సంఘాలు, కమ్యూనిస్టు మహిళా సంఘాలను పేర్కొన్నారు. కానీ గత ఇరవై సంవత్సరాలుగా రాష్ట్ర వ్యాపిత సంఘంగా, పునాది వర్గాల మహిళల్లో పనిచేస్తూ వర్గ స్పృహతో శ్రామిక మహిళా దృక్పథంతో పనిచేస్తూ ఉన్న 'స్త్రీ విముక్తి సంఘటన'ను విస్మరించడం ప్రశ్నార్థకంగా మిగిలింది. 'మహిళా ఉద్యమ దేశీయ ప్రాంతీయ' చిత్రాన్ని చిత్రించేటప్పుడు కాత్యాయని పాక్షిక దృష్టినే కలిగి ఉన్నారని అనుకోవచ్చా? ప్రజాస్వామిక వాదులూ, మేధావులూ పరిమిత పరిశీలనతో వ్యవహరించడం వాస్తవ చరిత్రను మరుగు పరచడమే అవుతుంది కదా? కాత్యాయనీ విద్మహే గత ఇరవై సంవత్సరాలుగా మా సంస్థతో సన్నిహిత సంబంధాలలో ఉంటూ మా త్రైమాస పత్రిక 'స్త్రీ సంఘటన'లో అనేక వ్యాసాలు, పుస్తక పరిచయాలు రాస్తూ ఒక సన్నిహిత సంబంధాన్ని కలిగి ఉంటూనే మా సంస్థను ప్రస్తావించకపోవడం ఆశ్చర్యాన్నీ, బాధనూ కలిగిస్తుంది. 1988లో గుంటూరులో 'మనలో సగం' ఫొటో ఎగ్జిబిషన్ ఏర్పాటు చేసినపుడు చైతన్య మహిళా వేదికగా మేం కాత్యాయనిని ఆహ్వానించాం. 1992లో పి.ఒ.డబ్ల్యు. స్త్రీ విముక్తిగా మా రాష్ట్ర మహాసభలు నిర్వహించుకున్నప్పుడు కాత్యాయని ఒక ప్రధాన ఉపన్యాసకులు. 'స్త్రీ సంఘటన'గా మా పత్రిక వెలువడుతున్నప్పటి నుండీ అనేక రచనలందించారు. మా పత్రిక ఎడిటర్ జ్యోతిరాణి స్వయంగా కాత్యాయనికి సన్నిహిత మిత్రులు. ఈ స్థితిలో మా సంస్థను విస్మరించటమన్నది ప్రశ్నార్థకంగా మిగిలింది. జరిగింది పొరపాటు మాత్రమేనని కాత్యాయని భావిస్తే పత్రికా ముఖంగా తెలియపరచగలని ఆశిస్తాను.

**– టి. శ్రీదేవి**

*ప్రధాన కార్యదర్శి, స్త్రీ విముక్తి సంఘటన (ఆం.ప్ర.)*

నేను ఈ మధ్య హైదరాబాద్‌కు వచ్చినప్పుడు కొద్దిమంది మిత్రులు నాతో వీక్షణం గురించి మాట్లాడుతూ వీక్షణంలో సైద్ధాంతికమైన చర్చలు ఉండడం లేదని, అందువల్ల వీక్షణం పెద్దగా చదవడం లేదని అన్నారు. నాకైతే మనదేశంలో సామాజిక కార్యకర్తల్లో సైద్ధాంతిక విషయాలు చర్చించడం, అవగాహన స్థాయి పెంపొందించుకోవడం లోపించాయని అనిపిస్తోంది. నేను వీక్షణంకు వ్యవసాయం, ప్రపంచీకరణ అనే అంశంపై వ్యాసం రాస్తున్నాను. సైద్ధాంతిక విషయాలు చర్చించడం మూలంగా వ్యాసం నిడివి పెద్దగానే కావచ్చు. రష్యన్ విప్లవ చరిత్ర కూడా చదువుతున్నాను. రాబోయే సంచికలలో వీక్షణంకు రాద్దామని అనుకుంటున్నాను.

**– కె. నరేంద్ర మోహన్**

*మెల్‌బోర్న్, ఆస్ట్రేలియా*

వీక్షణంలో అనేక సామాజికాంశాలు చోటు చేసుకుంటున్నాయి. సంపాదకీయంలో సత్యసాయి ఆశ్రమంలో నాటకం 24 ఏప్రిల్ 2011 ముగింపుతో పాటు అనేక అంశాలు పొందుపరిచారు. మీడియా సత్యసాయి బాబా మోసాలను, అనైతిక కార్యకలాపాలను మినహాయించి ట్రస్ట్ అక్రమాలపై మాత్రమే స్పందించింది. ఆమేరకు అభినందనలు. సాయిబాబా ఉరఫ్ సత్యనారాయణ రాజు మహిమలు, అతీంద్రియ శక్తుల పేరుతో మేజిక్ ట్రిక్కుల ద్వారా విభూది, ఉంగరాలు, శివలింగాలు, చిన్న గొలుసులు భక్తులకు అందజేసి ప్రజలను తప్పుతోవ పట్టించారు. ఈ ట్రిక్కులే కోట్లాది మంది భక్తులుగా చేరడానికి పునాది. ట్రస్ట్ 1972లో ఆవిర్భావం, రాజ్యాంగేతర శక్తిగా ఏర్పడడం, చట్టాలను ఉల్లంఘించడం ఇందులో భాగమే. 'ముంచుకొచ్చిన అణు ప్రకంపనలు', 'అణు విద్యుత్ ప్రజల ప్రాణాలతో చెలగాటం' రెండు వ్యాసాలు బాగున్నాయి. దేశానికి అణు విద్యుత్ కర్మాగారాల ప్రమాదం ముంచుకొస్తున్నది. తెలంగాణ జిల్లాలో జరుగుతున్న జోగినీ వ్యవస్థపై సమగ్రమైన వ్యాసం ప్రచురించండి.

**– తుంపాల శ్రీరామమూర్తి**

*గాజువాక, విశాఖపట్నం*

గ్రామీణ ప్రాంతాలలో దళితులపై అగ్రవర్ణాలవారు జరుపుతున్న అత్యాచారాలను, అఘాయిత్యాలను, వాటిని చట్టపరంగా ఎలా ఎదుర్కోవాలి అనే విషయాన్ని గురించి మే 2011 సంచికలో చిమ్మె జాన్ బర్నబాస్ వ్యాసం 'ఎస్.సి., ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టం' చాలా ఆలోచనాత్మకంగా ఉంది. ఇందులో ముఖ్యంగా ఇప్పటికీ దళితులపై అగ్రవర్ణాల వారు జరుపుతున్న దాడులను గురించి చాలా స్పష్టంగా తెలియజేశారు. అంతే కాకుండా వాటిని చట్టప్రకారం ఎలా ఎదుర్కోవాలి అనే విషయాన్ని గురించి గ్రామీణ ప్రాంత ప్రజలకు కూడా అర్థం అయ్యే విధంగా తెలియజేశారు. ఇంకా ముఖ్యంగా దాడి జరిగిన దళితులు న్యాయం కోసం పోలీసు స్టేషనుకు వెళ్లినప్పుడు లేదా ప్రభుత్వ అధికారుల దగ్గరకు వచ్చినప్పుడు వారు తిరిగి దళితులపై అఘాయిత్యానికి పాల్పడ్డ కథనం కొన్ని ప్రాంతాలలో ఉదాహరణాలతో వివరించిన చిమ్మె జాన్ బర్నబాస్‌కి హృదయపూర్వక నమస్కారాలు.

**– పులుగుజ్జు గురువర్మ**

*చిన్న ఓబినేపల్లి, ప్రకాశం*

వీక్షణం ఏప్రిల్ సంచికలో వచ్చిన 'లిబియాపై విదేశీ సైనిక చర్య మానవతేనా?' వ్యాసం బాగుంది. వ్యక్తులు మారినంత మాత్రాన ఏదో మార్పు జరిగినట్లు భ్రమ పడిపోయే వారిలో విప్లవ అభిమానులు కూడా ఉన్నారు గనుక ఈ వ్యాసం తప్పక చదాల్సిన అవసరముందని భావిస్తున్నాను. 'లిబియాపై యుద్ధోన్మాదుల దాడుల నేపథ్యం' వ్యాసంలో ఆధిపత్య తెగల నాయకత్వాన్ని గానీ, లేక మైనారిటీ తెగల నాయకత్వాన్ని గానీ ఏ విధంగా కొనివేస్తారో, కుట్రలు పన్ని ఒక తెగకు వ్యతిరేకంగా మరో తెగను ఎగదోసి, నిప్పు రాజేసి ఎలా వల్లకాడుగా మారుస్తారో అమెరికన్ సామ్రాజ్యవాదుల కుటిల రాజకీయాన్ని సోదాహరణంగా వివరించారు. 'కులతత్వం, మతతత్వం, జాతీయతతాలను తమ ఆధిపత్యం కోసం ఏ విధంగా ఉపయోగించుకుంటారో ఈ వ్యాసం వల్ల అర్థమవుతుంది. 'పీడిత వర్గాల ఐక్యత కావాలి' వ్యాసంలో తెలంగాణ ఉద్యమంలో చోటుచేసుకుంటున్న ధోరణులను బాగా వివరించారు. పోరాటానికి ఐక్యత ఎంత ముఖ్యమో బాగా ఎత్తిచూపారు. 'మానసిక యుద్ధం – భౌతిక విధ్వంసం' వ్యాసంలో ఛత్తీస్‌ఘఢ్ ప్రభుత్వం సృష్టిస్తున్న విధ్వంసాన్ని బాగా వివరించారు. ఈ వ్యాసాన్ని అందరూ

*(మిగతా 57వ పేజీలో...)*

**సవరణ:** ఏప్రిల్ 2011 సంచికలో ఎం. కృష్ణ ఆదిత్య వ్యాసం 'పీడిత వర్గాల పోరాట ఐక్యత'లో పేజీ 31 ఆఖరి పేరాలోని ఎనిమిదవ లైన్‌లో 'అభివృద్ధి నిరోధకమైన ప్రజాపోరాటాలు' అనే వాక్యం బదులు 'అభివృద్ధికరమైన ప్రజాపోరాటాలు' అని చదువుకోవలసిందిగా కోరుతున్నాం. పొరపాటుకు చింతిస్తున్నాం. – సం.

**రచయితలకు సూచన :** తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 23వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. – సం.

# రైతాంగ సమస్యలపై రాజకీయపక్షాల పోరు

ఇటీవలి కాలంలో రాష్ట్ర రాజకీయార్థిక రంగాలలో సాగుతున్న అనేక ఆందోళనాకరమైన పరిణామాలలో ఒకటి ప్రస్తుతం రైతుల సమస్యల మీద జిల్లాలలోనూ, రాష్ట్ర రాజధానిలోనూ, దేశ రాజధానిలోనూ జరుగుతున్నది. నిజంగా తెలుగు సీమలో రైతాంగం అనేక సమస్యలను ఎదుర్కొంటున్నారు. వారి పక్షాన నిలబడి, వారి సమస్యలను ప్రపంచం దృష్టికి తెచ్చి, పరిష్కారాల అన్వేషణలో పాలు పంచుకోవడం ప్రతి ఒక్కరి బాధ్యత. సహజంగానే రాజకీయ పక్షాలకు ఆ బాధ్యత మరింత ఎక్కువగా ఉంటుంది. కాని అధికారంలో ఉండే రాజకీయ పక్షం అసలు ఏ సమస్యలూ లేవని, తన పాలనలో పాలూ తేనే ప్రవహిస్తున్నాయని ప్రచారం చేసుకుంటుంది. అందువల్ల సామాజిక సమస్యలను లేవనెత్తే బాధ్యత ప్రతిపక్షాలకు ఇంకా ఎక్కువ అవుతుంది. కాని ఆ ప్రతిపక్షాలలో రైతుల సమస్యల గురించి ఎన్నడూ పట్టించుకోనివాళ్లు, రైతులకు ఇంకా ఎక్కువ సమస్యలు తెచ్చిపెట్టే రాజకీయార్థిక విధానాలను అమలుచేసిన వాళ్ళు, రైతుల సమస్యలు అంటే తమ ఆర్థిక, సామాజిక వర్గపు సమస్యలు మాత్రమేననుకునే వాళ్లు అందరూ ఇవాళ రైతాంగ సమస్యల మీద పోరాటం చేస్తుంటే, చేస్తామంటుంటే ఆశ్చర్యం కలుగుతున్నది. అయితే ఇలా ఎవరు ఏ ప్రయోజనం కోసం సమస్యలను ముందుకు తెచ్చినా, సమస్య నిజమైనదయితే తప్పకుండా ఆ పోరాటాన్ని సమర్థించవలసిందే. ఆ సమస్యలను లేవనెత్తుతున్నవాళ్ల రాజకీయ స్వార్థ ప్రయోజనాలను ఎత్తిచూపుతూనే సమస్యల న్యాయబద్ధతను గుర్తించవలసిందే. రైతులు తమ సమస్యలపై, ప్రధానంగా వ్యవసాయ మార్కెట్లలో ధాన్యం కొనుగోళ్లలో జరుగుతున్న అవకతవకలపై కొద్ది వారాలుగా జరుపుతున్న ఆందోళనలలోకి రాజకీయ పక్షాలు ప్రవేశించాయి. మార్కెట్ల ముందు, జిల్లాకేంద్రాలలో జరిగిన ప్రదర్శనలకు కొనసాగింపుగా రైతు సంఘాల నాయకులతో కలిసి లోక్‌సత్తా ముఖ్యమంత్రికి వినతి పత్రం ఇచ్చింది. తెలుగుదేశం, ఉభయ కమ్యూనిస్టు పార్టీలు గవర్నర్‌కు వినతి పత్రం ఇచ్చాయి. తెలుగు దేశం ఢిల్లీకి కూడ వెళ్లి కేంద్ర వ్యవసాయ మంత్రిని కలిసి సమస్యలు వివరించింది. వై ఎస్ జగన్ ఓదార్పు యాత్రలో రైతుల సమస్యలపై గంభీరంగా మాట్లాడుతున్నాడు. ప్రస్తుత ఆందోళనలలో ప్రధానమైన సమస్యలు రైతుల దగ్గర ధాన్యం నిలువలు పెరిగిపోతుండడం, మిల్లర్లు తగిన పరిమాణంలో కొనుగోలు చేయకపోవడం, ప్రభుత్వం సరైన మద్దతు ధర ప్రకటించకపోవడం, ధాన్యం ఎగుమతులకు అనుమతులు లేకపోవడం. ఒకవైపు ఈ ఆందోళనలు జరుగుతుండగానే పత్తి విత్తన కంపెనీలు బిటి విత్తనాల ధరలను విపరీతంగా పెంచడానికి ప్రభుత్వం ఆమోదం తెలిపింది. దానితో రైతుల ఆందోళన మరింత తీవ్రమయింది. ఈ మొత్తం వివాదంలో ప్రభుత్వాల వైపు నుంచి విధానపరంగానూ, ఆచరణలోనూ జరిగిన అనేక లోపాలు, వ్యాపారవర్గాల వైపు నుంచి, ముఖ్యంగా రైస్ మిల్లర్ల లాబీ లాభాకాంక్ష వల్ల జరిగిన అక్రమాలు అన్నీ కలిసి రైతులకు సమస్యలు సృష్టించి పెంచి పోషించాయి. దేశంలో ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనే కేంద్ర ప్రభుత్వ సంస్థ ఉండగా, చాల రాష్ట్రాలలో ధాన్యం కొనుగోలును ఈ ఎఫ్ సి ఐ నిర్వహిస్తుండగా, కేంద్ర ప్రభుత్వమే ధాన్యం కొనుగోలు మద్దతు ధరను నిర్ణయిస్తుండగా రాష్ట్రంలో అమలవుతున్న విధానాలు మాత్రం భిన్నంగా ఉన్నాయి. రాష్ట్ర ప్రభుత్వ విధానాల ప్రకారం రైతుల నుంచి ధాన్యాన్ని రైస్ మిల్లర్లు కొంటారు. వారినుంచి నిర్ణీత శాతాన్ని లెవీగా ఎఫ్ సి ఐ సేకరిస్తుంది. రైస్ మిల్లర్ల కొనుగోళ్ల మీద, వారు రైతులకు చెల్లించే ధర మీద ప్రభుత్వానికి గాని, ఎఫ్ సి ఐ కి గాని ఉండవలసినంత నియంత్రణ లేదు. ఈ రైస్ మిల్లర్ల లాబీ రాజకీయ పక్షాలకు ఆర్థిక వనరులను సమకూర్చి, వారిని శాసించగలిగినంత బలమైనది. రైతుల దగ్గర తక్కువకు కొని, స్థానిక, దేశీయ మార్కెట్లలో గాని, ఎగుమతులకు అనుమతులు సంపాదించి విదేశీ మార్కెట్లలో గాని ఎక్కువ ధరకు అమ్మి ఇబ్బడి ముబ్బడిగా లాభాలు సంపాదించి అందులో కొంత భాగాన్ని రాజకీయ పక్షాలకు ముడుపులుగా విదిల్చడం ఈ రైస్ మిల్లర్ల లాబీకి ఆనవాయితీ. ఒకవైపు ఎగుమతులకు అనుమతులు లేకపోవడం, మరొకవైపు అంచనా కన్న ఎక్కువ దిగుబడి రావడంతో రైస్ మిల్లర్ల లాబీ కొనుగోళ్లు తగ్గించింది. తగిన నిలువ సౌకర్యాలు, గోదాములు, గిడ్డంగులు లేవనే కారణాలు చెపుతోంది. అడ్డికి పావుసేరు అడుగుతూ మద్దతు ధరకన్న తక్కువ ఇచ్చి రైతులను మోసగించడానికి ప్రయత్నిస్తోంది. ఇందుకు అవకాశమిస్తున్న ప్రభుత్వం, రాజకీయ నాయకులు, అధికారులు మొదటి నేరస్తులు కాగా, రైస్ మిల్లర్ల లాబీ రెండవ నేరస్తురాలు. ప్రతిపక్ష రాజకీయ పార్టీలకు కూడ రైస్ మిల్లర్ల లాబీతో లాలూచీ ఉంది గనుక, వారు పూర్తిగా ప్రభుత్వం మీదనే చూపుడు వేలు ఎక్కు పెడుతూ, పనిలో పనిగా రైస్ మిల్లర్లకు ఎగుమతి అనుమతులు ఇవ్వాలనే డిమాండ్ కూడ రైతుల డిమాండ్‌గా ముందుకు తెస్తున్నారు. రైతులు సాధించిన దిగుబడిలో అత్యధిక భాగాన్ని తగిన గిట్టుబాటు ధర చెల్లించి కొనవలసిన బాధ్యత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మీద, ఎఫ్ సి ఐ, పౌరసరఫరాల సంస్థ వంటి ప్రభుత్వ రంగ సంస్థల మీద ఉంది. ఈ ఆందోళనలు అలా ఉండగా, జూన్ మొదటి వారంలో వర్షాలు ప్రారంభం కాకముందే ఈ ధాన్య నిలువల కొనుగోలు జరగక పోతే, ఆరు బయట ఉన్న ఆ నిలువలు మురిగిపోయే ప్రమాదం ఉంది. అంతేగాక, తొలకరి తర్వాత రైతాంగానికి మరొక సమస్యల వలయం మొదలవుతుంది. విత్తనాలు, ఎరువులు, ఋణాలు, అతివృష్టి, అనావృష్టి వంటి కొత్త సమస్యలు తలెత్తుతాయి. ప్రభుత్వం ఈ రానున్న సమస్యలను పరిష్కరించడానికి, ముందస్తు ఏర్పాట్లు చేయడానికి సంసిద్ధంగా ఉండే బదులు, తలెత్తిన సమస్యలను పరిష్కరించడానికే మీనమేషాలు లెక్కిస్తూ ఉంది. ధాన్యపు కొనుగోళ్ల గురించి ఆందోళన మొదలయిన చాల రోజులకు ఆ సమస్య పరిష్కారాన్ని పర్యవేక్షించడానికి ప్రభుత్వం అధికారులను నియమించింది. ఆ నియామకాలు కంటి తుడుపు చర్యే తప్ప పరిష్కారానికి ఉపయోగపడేవి కావు. ఈ సమస్య పరిష్కారం కాకపోతే రైతుల దగ్గరికి వెళ్లలేమని మంత్రివర్గ సమావేశంలో కొందరు మంత్రులు అన్నారని, వారిపైన ముఖ్యమంత్రి కళ్లెర్రజేశారని వార్తలు వచ్చాయి. అంటే పాలకుల దగ్గర రైతుల సమస్యలకు పరిష్కారాలూ లేవని, నాన్చివేత విధానాలు తప్ప, వ్యాపార వర్గాలకు, బహుళ జాతిసంస్థలకు మేలు చేకూర్చే విధానాలు తప్ప అన్నదాతను ఆదుకునే విధానాలు లేవని స్పష్టమవుతున్నది. ఇది ఇంకెవరి ప్రభుత్వమయినా కావచ్చు గాని రైతుల ప్రభుత్వం కాదని, కష్టజీవుల ప్రభుత్వం కాదని, వెయ్యిన్నొకటోసారి రుజువు అవుతున్నది. వీ

## ఎన్నికల ఫలితాలు ప్రజల అసంతృప్తి వ్యక్తీకరణ

ఏప్రిల్ లో ప్రారంభమై, మే మొదటి వారం దాకా సాగిన ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు మే 13న వెలువడ్డాయి. అసోంలోనూ, పాండిచ్చేరి లోనూ పాత అధికార పక్షమే తిరిగి అధికారం సంపాదించగా, పశ్చిమ బెంగాల్, తమిళనాడులలో అధికారపక్షం ఘోరంగా ఓడిపోయింది. కేరళలో ప్రతిపక్ష కూటమి అతి స్వల్ప ఆధిక్యతతో ప్రభుత్వం స్థాపించింది. దేశంలో ప్రస్తుతం జరుగుతున్న పార్లమెంటరీ ఎన్నికల ప్రహసనంలో ప్రజాభిప్రాయానికి స్థానమూ లేదు, విలువా లేదు గాని, ఆ చట్రం లోపల కూడ జరగగలిగిన ఒక ప్రక్రియకు ఈ ఫలితాలు అద్దం పడుతున్నాయి. కేరళ, తమిళనాడులలో అధికార స్థానంలోని పాలకపక్షాలను మార్చడం తరచుగా జరిగేదే గాని, ఈ సారి అంచనాలకన్న భిన్నంగా కేరళలో ప్రతిపక్ష వామపక్ష కూటమి స్వల్ప లోటుతోనే అధికారానికి దూరమయింది, తమిళనాడులో అధికారపక్షం చావుదెబ్బ తింది. అన్నీ పాలకవర్గ పార్టీలే, గెలిచినవాళ్లు బుద్ధిమంతులేమీ కారు, ఓడినవాళ్లు అవినీతిపరులూ కారు–ఇద్దరికిద్దరూ ప్రజావ్యతిరేక విధానాలను సంపూర్ణంగా అమలు చేసినవాళ్లే. అలా అమలు చేస్తూనే అవే ప్రజానుకూల విధానాలన్నట్టుగా నమ్మబలికినవాళ్లే. ప్రజలు వాళ్ల మాటలూ విన్నారు, వాళ్ల చేతలూ చూశారు. వాటిమధ్య అంతరం కూడ గమనించారు. కాని ఎన్నికల రాజకీయాలు తప్ప మరొక ప్రత్యామ్నాయం లేనప్పుడు, ఆ ఎన్నికల రాజకీయాలలో అందరూ దొంగలే ఉన్నప్పుడు, ప్రజలకు ఆ దొంగలలో ఒకరిపట్ల వ్యతిరేకత ప్రకటించడానికి తప్ప, అసలు దొంగలు కాని వాళ్లను ఎంపిక చేసుకునే అవకాశమే లేదు. కేరళ, తమిళనాడులలో నిన్నటిదాకా అధికారం చలాయించిన వాళ్ల పట్ల అసంతృప్తి ప్రకటనగానే, ప్రత్యర్థుల గెలుపును చూడాలి గాని, వాళ్లపట్ల ఆమోదంగా కాదు. ఆ అసంతృప్తికి తక్షణ కారణాలూ ఉన్నాయి, దీర్ఘకాలిక కారణాలూ ఉన్నాయి. ఆ కారణాలన్నీ ఇవాళ గెలిచిన ప్రత్యర్థులకు కూడ వర్తిస్తాయి. ఇక పశ్చిమ బెంగాల్ ఎన్నికల ఫలితాలు కూడ ఇటువంటి అసంతృప్తి ప్రకటనే గాని, అక్కడ ఒక ప్రత్యేకత ఉంది. అటు తృణమూల్ కాంగ్రెస్, ఇటు సిపిఐ (ఎం) నాయకత్వం కూడ దాన్ని మార్పు అనీ, ప్రజలలో మార్పు కొరకు ఉన్న కోరిక అనీ విశ్లేషించాయి. ఎన్నికల ద్వారా సామాజిక మార్పు జరుగుతుందా, వామపక్షాలు దిగిపోయి, తృణమూల్ అధికారానికి రావడాన్ని ప్రజలు మార్పుగా గుర్తిస్తున్నారా, అసలది మార్పేనా, లాంటి ప్రశ్నలెన్నో వేయవచ్చు. ప్రజలు కోరుకున్న మార్పును గౌరవిస్తున్నామని సిపిఐ (ఎం) నాయకులు అంటున్నారంటే వారు కూడ దాన్ని మార్పు అనుకుంటున్నారన్న మాట. అధికారంలో వామపక్షాలు ముప్పైనాలుగు సంవత్సరాలు ఉన్నా తమ బతుకుల్లో మౌలికంగా ఏ మార్పూ రాలేదని గుర్తించిన ప్రజలు, పైగా ఆ ప్రభుత్వం ప్రగతిశీల ప్రకటనలతో మోసం చేస్తున్నదని గుర్తించి, ఎవరొచ్చినా ఇంతకన్న చెడేది లేదని, ఎవరు వచ్చినా సరే అని తృణమూల్ కాంగ్రెస్ ను ఆహ్వానించారు. అది మార్పు కోరిక కావచ్చుగాని, నిజం చెప్పాలంటే తృణమూల్ కాంగ్రెస్ పట్ల సానుకూల ప్రకటన కాదు. అది వామపక్షాల పట్ల, ముఖ్యంగా సిపిఐ (ఎం) పట్ల ప్రతికూల ప్రకటన. ప్రజలలో మార్పు కొరకు ఆకాంక్ష, ఎన్నికల రాజకీయాలలో అంతకన్న అవకాశం లేని స్థితి, నిజమైన సామాజిక మార్పు కోసం జరిగే ప్రయత్నాలకూ ఎన్నికల రాజకీయాలకూ ఎంతమాత్రం సంబంధం లేని స్థితి – ఇదీ ఇవాళ భారత సమాజం స్థితి. ఈ స్థితి మారేదాకా అధికారపీఠాల మీద ఒకజెండాను పీకి మరొక జెండాను పెట్టడం తప్ప ప్రజలకు మరొక దిక్కు లేదు. ఏ జెండా మారినా ప్రజల బతుకులలో మార్పు రాదు. మార్చవలసింది జెండాలను కాదనీ, అధికార పీఠాలననీ, వ్యవస్థననీ అరవై సంవత్సరాల పార్లమెంటరీ ప్రజాస్వామిక బూటకపు ఎన్నికల పద్ధతి ప్రజలకు నేర్పింది. ఆ ప్రజలకు విశ్వసనీయమైన ప్రత్యామ్నాయాలను చూపి, సమీకరించి ఆ దిశగా నడపడమే ప్రగతిశీల ప్రజా శక్తుల కర్తవ్యం. వీ

## 'ఉగ్రవాది' ఒసామాను చంపిన మహోగ్రవాది ఒబామా

అమెరికా సైన్యం నియోగించిన సీల్స్ అనే హంతకముఠా పాకిస్తాన్ ప్రభుత్వానికి కూడ తెలియకుండా ఆ దేశంలో చొరబడి అబటాబాద్ లో ఒక భవనం మీద దాడి చేసి అల్ ఖైదా నాయకుడు ఒసామా బిన్ లాడెన్ ను, అతని సహచరులను చంపివేసింది. తాము చేపట్టిన "ఉగ్రవాదం మీద యుద్ధం" అనే పవిత్ర కర్తవ్యంలో విజయం సాధించామని అమెరికా పాలకులు, స్వయంగా అధ్యక్షుడు బారక్ ఒబామా ప్రకటించారు. సామ్రాజ్యవాదం అంటేనే అబద్ధం, దోపిడీ, దాడి, మృత్యువు, హత్య అని మరొకసారి రుజువయింది. కనుక ఈ హత్యాకాండలో ఆశ్చర్యపోవలసిందేమీ లేదు గాని, అంతర్జాతీయ స్థాయి నుంచి తెలుగు దాకా ప్రచార సాధనాలలో ఒసామా ఉగ్రవాదం గురించీ, ఒబామా శాంతి కాముకత గురించీ హోరెత్తుతోంది గనుక ఈ హత్యాకాండ న్యాయాన్యాయాల గురించి, నైతికత గురించి ప్రశ్నించవలసి ఉంది. ఒసామా హత్య మీద తన స్పందనలో నోమ్ ఛామ్ స్కీ రాసిన వాక్యాలు ఇక్కడ గుర్తు చేసుకోవాలి: 'ఇరాకీ కమాండోలు గనుక జార్జి బుష్ ఇంటి మీద దాడి చేసి, ఆయనను చంపేసి, ఆ మృతదేహాన్ని తీసుకువెళ్లి అట్లాంటిక్ మహాసముద్రంలో పారేస్తే మనం ఎట్లా ప్రతిస్పందించి ఉండేవాళ్లమో ఒక్కసారి మనను మనం అడుక్కుందాం' అని ఆయన అమెరికన్ సమాజానికి ఒక సవాల్ విసిరారు. ఒక వ్యక్తి నేరస్తుడని అనుమానం, ప్రచారం ఉన్నంత మాత్రాన శిక్ష విధించగూడదని, అనుమానితుడి వాదన వినిపించుకోవడానికి అన్ని అవకాశాలూ ఇచ్చి, సందేహాలకు తావులేని, చట్టబద్ధమైన విచారణ జరిపిన తర్వాతనే శిక్ష విధించాలని ఆధునిక న్యాయసూత్రాలన్నీ చెపుతాయి. ఒక దేశ సరిహద్దుల లోపల ఆ జాతీయ ప్రభుత్వపు అనుమతి లేకుండా మరొక దేశపు ప్రభుత్వంగాని, వ్యక్తులుగాని అనుమానాస్పద చర్యలు జరపడాన్ని అంతర్జాతీయ న్యాయసూత్రాలన్నీ ఖండిస్తాయి. అటువంటి పని జాతీయ సార్వభౌమాధికారానికి ఉల్లంఘనేనని చెపుతాయి. ఈ రెండు రకాల అక్రమాలకూ అమెరికా పాల్పడింది. ఇవి సాంకేతికమైన అభ్యంతరాలని అనుకున్నా, అసలు ఒసామా చేసిన నేరం ఏమిటి? మరి ఒసామాకు శిక్ష విధించిన అమెరికన్ పాలకుల నేరాల మాటేమిటి? ఒసామా నేరం చేశాడని, న్యూయార్క్ ప్రపంచ వాణిజ్య కేంద్ర భవనాలను కూల్చి, మూడువేలమంది మరణాలకు కారణమైన కుట్ర చేశాడని అనుకున్నా, గత వంద సంవత్సరాలలో అమెరికా పాలకులు తమ ఆర్థిక, వ్యాపార ప్రయోజనాల కోసం ప్రపంచ దేశాల మీద, ప్రజల మీద చేసిన దారుణ మారణ కాండలతో పోలిస్తే ఒసామా నేరం సముద్రంలో కాకిరెట్ట. ఇవాళ తీర్పరి స్థానంలో కూచుని తీర్పును అమలు కూడ చేసిన హంతకుల నేరం వేలరెట్లు పెద్దది. తమ బహుళజాతి సంస్థలకు అవసరమైన ముడిసరుకుల కోసం, వాటి ఉత్పత్తులకు మార్కెట్ల కోసం అమెరికన్ పాలకులు భూగోళాన్నే చెరబట్టారు, వందలాది సమాజాలను ధ్వంసం చేశారు, డజన్లకొద్ది ప్రభుత్వాలను కూలదోశారు. కోట్లాది మంది ప్రజల జీవితాలను కొల్లగొట్టారు. కేవలం ప్రపంచాన్ని బెదిరించడం కోసం హిరోషిమా, నాగసాకిలలో క్షణాలలో రెండున్నర లక్షల ప్రాణాలు బలిగొన్నారు. గత పది సంవత్సరాలలోనే ఇరాక్ లో, ఆఫ్ఘనిస్తాన్ లో పదిహేను లక్షల మందిని చంపేశారు. ఇంత భయానకమైన, బలసంపన్నమైన ఉగ్రవాదాన్ని ప్రపంచం మీద రుద్దుతున్న పాలకులు ఇతరులది ఉగ్రవాదం అనడం, దాని మీద యుద్ధం ప్రకటించడం దుర్మార్గం, క్రూర పరిహాసం. ఎంతమంది వ్యక్తులూ, ఎంత మత ఛాందస మూఢవిశ్వాసమూ, ఎన్ని ఆయుధాలూ కలగలిసినా ఈ ఉగ్రవాదానికి సరిపోలవు. అసలు ఉగ్రవాదాన్ని విస్మరించి, ఆ ఉగ్రవాదానికి చెయ్యి అడ్డం పెట్టడానికి, ఆ ఉగ్రవాది మీద నిస్సహాయ ఆగ్రహంతో రాయి విసరడానికి ప్రయత్నిస్తున్న వారిని ఉగ్రవాదులని అనడం పెద్ద కుట్ర. ఈ కుట్రకు బలి అయిపోతున్న అమాయకత్వం నుంచి ప్రపంచ ప్రజానీకం, ముఖ్యంగా మధ్యతరగతి ఇప్పటికైనా మేల్కొనకపోతే అమెరికా కంటికి ప్రపంచమంతా అబటాబాద్ లే కనిపిస్తాయి. అమెరికన్ దుర్మార్గాలను ప్రశ్నించే ప్రతిఒక్కరూ చంపవలసిన వాళ్లుగానే కనబడతారు. తస్మాత్ జాగ్రత వీ







- **అంకితం** – కథా సంకలనం – గౌరవ సంపాదకురాలు : కొండవీటి సత్యవతి, సంపాదకురాలు : డా. అయ్యగారి సీతారత్నం – భూమిక ప్రచురణ – 250 పేజీలు, 1/8 డెమీ, రు : 100, ప్రతులకు: భూమిక, ఎచ్.ఐ.జి.–2, బి.8, ఫ్లాట్ నెం. 1, వాటర్‌టాంక్ వెనుక, బాగ్‌లింగంపల్లి హైదరాబాద్ – 500 044; ఫోన్ : 040 – 27660173; డా. అయ్యంగారి సీతారత్నం, అసోసియేట్ ప్రొఫెసర్, తెలుగుశాఖ, మిసెస్ ఎ.వి.ఎన్. కళాశాల, విశాఖపట్నం – 1, సెల్ : 9885144879
- **ఒకటే మాట తెలంగాణ** – నినదించిన ఇందూరు కవులు – స్నేహ ప్రచురణలు – 113 పేజీలు, 1/8 డెమీ, రు : 30, ప్రతులకు: అనిశెట్టి శంకర, 104, శ్రీ వెంకటేశ్వర అపార్ట్‌మెంట్, ముబారక్ నగర్, నిజామాబాద్ – 503 003; ఫోన్ : 08462 – 230739; సెల్ : 98666 30739
- **అనేక పదేళ్ల కవిత్వం 2000–2009** – సంపాదకులు: అఫ్సర్, వంశీకృష్ణ – సారంగ బుక్స్ – 373 పేజీలు, 1/8 డెమీ, రు : 199, ప్రతులకు: పాలపిట్ట బుక్స్, ఫ్లాట్ నెం. 3, ఎం.ఐ.జి.–2, బ్లాక్ –6, ఎ.పి.ఎచ్.బి., బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ – 500 044; ఫోన్ : 27678430; సెల్ : 9848787284; ఇ–మెయిల్ : palapittabooks@gmail.com
- **తిలక్ చిత్రాల్లో శ్రీశ్రీ గీతాలు** – శ్రీశ్రీ సాహిత్య నిధి, 32 పేజీలు, 1/8 డెమీ, రు.20
- **శ్రీశ్రీ ఛూమ్యాకాశాలు** – వరవరరావు – శ్రీశ్రీ సాహిత్య నిధి, 80 పేజీలు, 1/8 డెమీ, రు.40

  పై రెండు ప్రతులకు : శ్రీశ్రీ సాహిత్య నిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతినగర్, విజయవాడ – 520004; ఫోన్ : 0866-6640595, ఫ్యాక్స్ : 0866-6697375, సెల్ : 9848504649, 9246277375; ఇ–మెయిల్ : srisri_sahityanidhi@yahoo.com
- **విప్లవ వీరుడు కామ్రేడ్ మాధవన్న** – సి.పి.ఐ. (ఎం.ఎల్.) న్యూ డెమోక్రసీ ప్రచురణ – 90 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు : ప్రజాపంథా, మార్క్స్ భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 500 044; సహచర బుక్ హౌస్, దిశ బుక్ హౌస్, నవోదయ బుక్ హౌస్, మైత్రీ బుక్ స్టాల్, విశాలాంధ్ర అన్ని బ్రాంచీలలో
- **అడవి తల్లి పోరుబిడ్డ గణేశ్** – సి.పి.ఐ. (ఎం.ఎల్.) న్యూ డెమోక్రసీ ప్రచురణ – 104 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : ప్రజాపంథా, మార్క్స్ భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 500 044; సహచర బుక్ హౌస్, దిశ బుక్ హౌస్, నవోదయ బుక్ హౌస్, మైత్రీ బుక్ స్టాల్, విశాలాంధ్ర, ప్రజాశక్తి
- **అంపశయ్య** – కవితలు – అంపశ్రీ – 48 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : జి. అంపయ్య, కృష్ణ (పోస్ట్), మాగనూరు (మం), మహబూబ్‌నగర్ – 509 359; సెల్ : 9396574184
- **భారతీయ కథలు** – డా. నలిమెల భాస్కర్ – రామయ్య విద్యాపీఠం ప్రచురణ – 106 పేజీలు, 1/8 డెమీ, రు.60
- **నడక** ఇన్‌టు ది ఫ్యూచర్ – చుక్కా రామయ్య – స్పృహ సాహితీ సంస్థ ప్రచురణ – 128 పేజీలు, 1/8 డెమీ, రు.65

  పై రెండు ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, ఇ.నెం. 1–8–702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500 044; రాష్ట్రంలోని అన్ని పెద్ద పుస్తకాల షాపుల్లో








## యురేనియం.. కడప ప్రజల్లో ఆందోళన!

వెయ్యికోట్ల పెట్టుబడితో 4,500 టన్నుల సామర్థ్యం గల యురేనియం శుద్ధి ప్లాంటుకు 2006లో అప్పటి ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖర రెడ్డి శంకుస్థాపన చేశారు. యూరేనియం ప్రాజెక్ట్ ఏర్పాటును కడప జిల్లా వేముల మండలంలోని తుమ్మలపల్లె, మబ్బులచింతలపల్లె, భూమయ్యగారిపల్లె, రాచుకుంటపల్లె తదితర గ్రామాల ప్రజలు తీవ్రంగా వ్యతిరేకించారు. 2012 డిసెంబర్ నుంచి ఉత్పత్తి ప్రారంభం కానున్న తరుణంలో ప్రజల ఆందోళన ఎక్కువ అవుతోంది.

## అకాల వర్షం-అపార నష్టం

ఏప్రిల్ 15-21 మధ్య కురిసిన అకాల వర్షాలకు 3.40 లక్షల ఎకరాల్లో వ్యవసాయ, ఉద్యానవన పంటలకు నష్టం వాటిల్లింది. ఈ వర్షాలకు 15 జిల్లాల్లో 2,96,628 ఎకరాల మేర వ్యవసాయ పంటలకు నష్టం వాటిల్లింది. వరి (2,74,233 ఎకరాలు), మొక్కజొన్న (12,813 ఎకరాలు), నువ్వులు (5.297 ఎకరాలు), సజ్జలు (2,198 ఎకరాలు), పొగాకు (1,500 ఎకరాలు), పత్తి, పొద్దుతిరుగుడు పంటలు కాగా మిర్చి (22,670 ఎకరాలు), మామిడి (12,812 ఎకరాలు), పుచ్చ (2,150 ఎకరాలు, అరటి (2,125 ఎకరాలు), కూరగాయలు (1,385 ఎకరాలు), పసుపు (1000 ఎకరాలు) పంటలను రైతులు నష్టపోయారు. ప్రధానంగా పశ్చిమ గోదావరి కృష్ణా, తూర్పుగోదావరి, వరంగల్, కరీంనగర్, నల్గొండ, మెదక్, రంగారెడ్డి జిల్లాల్లో పంట నష్టం వాటిల్లింది.

## ఇంద్రవెల్లి గాయానికి 30 ఏళ్లు

ఇంద్రవెల్లి అమరవీరుల సంస్మరణ సభ ఏప్రిల్ 20న హైదరాబాద్‌లోని బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో 'ఆ గాయానికి 30 ఏళ్లు' పేరిట జరిగింది. ఈ సందర్భంగా గిరిజన ఉద్యమనాయకుడు కొమురం భీం విగ్రహాన్ని ట్యాంక్ బండ్‌పై ప్రతిష్టించాలని పలువురు వక్తలు డిమాండ్ చేశారు. ఈ సభలో ఆంధ్రజ్యోతి సంపాదకులు కె. శ్రీనివాస్, కొమురం భీం చిత్ర దర్శక నిర్మాత అల్లాడి శ్రీధర్, పాత్రధారి భూపాల్ రెడ్డి, కొమురం భీం మనవడు సోనేరావు పాల్గొన్నారు. ఈ సభకు గిరిజన సంఘాల ఐక్య వేదిక ప్రధాన కార్యదర్శి వివేక్ అధ్యక్షత వహించారు.

## ఇంటర్ రెండో సంవత్సర ఫలితాలు

ఇంటర్ రెండో సంవత్సర ఫలితాలు ఏప్రిల్ 28న విడుదల అయ్యాయి. రాష్ట్ర వ్యాప్తంగా 63.27 శాతం మంది ఉత్తీర్ణులయ్యారు. 76 శాతం ఉత్తీర్ణతతో కృష్ణా జిల్లా అగ్రస్థానంలోను, 49 శాతం ఉత్తీర్ణతతో నల్గొండ జిల్లా చివరి స్థానంలో ఉన్నాయి. బాలికల్లో 66.39 శాతం మంది, బాలురలో 60.61 శాతం మంది ఉత్తీర్ణులయ్యారు. ఉత్తీర్ణతలోనూ, మార్కులలోనూ బాలికలే ముందున్నారు.

## తెలంగాణ రాష్ట్ర సమితి దశాబ్ది ఉత్సవాలు!

టి.ఆర్.ఎస్ దశాబ్ది ఉత్సవాలు ఏప్రిల్ 29న మహబూబ్‌నగర్ పట్టణంలోని సాంబశివుడి ప్రాంగణం (స్టేడియం మైదానం) లో జరిగాయి. ఆరవసారి పార్టీ అధ్యక్షుడిగా కె.సి.ఆర్ ఎన్నికయ్యారు. ఈ సందర్భంగా జరిగిన సభలో ఆ పార్టీ అధ్యక్షుడు తెలంగాణలో టి.ఆర్.ఎస్ మినహా ఏ పార్టీ ఉండకుండా చేయాలని పిలుపునిచ్చారు. టి.ఆర్.ఎస్‌ను ఏపార్టీలోనూ విలీనం చేసేది లేదన్నారు.

## అరవిందరావు నియామకం చెల్లదు!

డిజిపిగా అరవిందరావు నియామకం చెల్లదని కేంద్ర పరిపాలన ట్రిబ్యునల్ (క్యాట్) తన తీర్పులో పేర్కొంది. అరవిందరావు నియామకాన్ని సవాల్ చేస్తూ సీనియర్ ఐ.పి.ఎస్ గౌతంకుమార్ దాఖలు చేసిన పిటిషన్‌లో క్యాట్ సభ్యులు భారతి రే, ఆర్. సంతానంలతో కూడిన బెంచ్ ఏప్రిల్ 27న తన తీర్పును వెలువరించింది.

## మురికి కూపాల్లోనే జీవితం

రాష్ట్రంలో ఉన్న 8.49 కోట్ల జనాభాలో 82 లక్షల మంది ఏ సౌకర్యాలు లేని మురికి కూపాల్లో జీవిస్తున్నారు. రాష్ట్ర మొత్తం జనాభాలో 3.1 కోట్ల మంది పట్టణ ప్రాంతాల్లో నివసిస్తుండగా వారిలో 82 లక్షల మంది మురికివాడల్లో దుర్భర జీవితం గడుపుతున్నారు. కేంద్రం నియమించిన ప్రత్యేక కమిటీ ఈ విషయాలను వెల్లడించింది. దేశవ్యాప్తంగా చూస్తే 28 కోట్ల మందికి పైగా మురికివాడల్లో జీవిస్తున్నట్లు తెలుస్తోంది. ఉత్తర్‌ప్రదేశ్‌లో 3.45 కోట్లు, తమిళనాడు 2.75 కోట్లు, పశ్చిమ బెంగాల్ 2.24 కోట్ల మంది మురికివాడల జనాభాతో మొదటి మూడు స్థానాల్లో ఉండగా మన రాష్ట్రానిది నాల్గవ స్థానం.

## ఉప ఎన్నికల ఫలితాలు

కడప లోక్‌సభ స్థానానికి, పులివెందుల అసెంబ్లీ స్థానానికి జరిగిన ఉప ఎన్నికల్లో కడప లోక్‌సభ స్థానానికి వైఎస్ జగన్ మోహన్ రెడ్డి 4,22,790 ఓట్ల మెజారిటీతోనూ, పులివెందుల అసెంబ్లీ స్థానానికి వైఎస్ విజయలక్ష్మి 81,373 ఓట్ల ఆధిక్యతతోనూ గెలిచారు. వై.ఎస్. జగన్మోహన్ రెడ్డి, విజయమ్మ కాంగ్రెస్ పార్టీకీ, తమ ఎం.పి., ఎం.ఎల్.ఎ. పదవులకూ రాజీనామా చేయడంతో ఈ ఉప ఎన్నికలు జరిగాయి. ఈ ఉపఎన్నికల్లో వారు కొత్తగా స్థాపించిన వై.ఎస్.ఆర్. కాంగ్రెస్ పార్టీ తరఫున బరిలోకి దిగారు.

## ఆదివాసుల ధర్మయుద్ధం

విశాఖ ఏజెన్సీలోని దుంబ్రిగూడ, జోడిగూడ గ్రామాల్లోని భూముల్లో 600 కోట్ల విలువ చేసే చైనా క్లే ఖనిజం ఉంది. దీన్ని వెలికి తీయడం కోసం మే 10న ప్రజాభిప్రాయ సేకరణ నోటిఫికేషన్ జారీ చేశారు. తమ సహజ సంపద తమకు దక్కాలని, ప్రభుత్వ నిర్వాహణలో గిరిజన సంఘాలకు ఖనిజాన్ని వెలికితీసే అనుమతులు ఇవ్వాలని వాళ్లు డిమాండ్ చేస్తున్నారు. గిరిజనుల అభిప్రాయాన్ని తెలుసుకునేందుకు సర్రాయి గ్రామానికి ఎంపిపి దన్నేరావు రాకతో కోపోద్రిక్తులైన ప్రజలు ఆయన్ని చుట్టుముట్టారు. చైనా క్లే ఖనిజాన్ని దోచుకునేందుకు మాఫియాకు మద్దతిస్తున్నారంటూ ఎమ్మెల్యే, ఎంపిపిలపై అక్కడి ప్రజలు తిరగబడి, తరిమికొట్టారు. వీ

***ఇటీవల అసోం, పశ్చిమ బెంగాల్, పాండిచ్చేరి, తమిళనాడు, కేరళ రాష్ట్రాలలో జరిగిన అసెంబ్లీ ఎన్నికల ఫలితాలను విశ్లేషిస్తున్నారు* భరణి**

# ఐదు రాష్ట్రాల ఎన్నికల్లో ప్రజా చైతన్యం

ఐదు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికల ఫలితాలు, ఆయా రాష్ట్రాల ప్రజా చైతన్యాన్ని ప్రస్ఫుటంగా ప్రకటించాయి. ఎన్నికల వేళ వెల్లడవుతున్న అవినీతి, అరాచకాలనూ... మరోవైపు ప్రజాధనం దుర్వినియోగమయ్యేలా – ఓ వర్గ ప్రజలను ఆకర్షించేందుకు అలవికాని వాగ్దానాల హోరునూ... అధిగమిస్తూ ప్రజలు వారి తీర్పును ప్రకటించారు. మనమింకా సూక్ష్మంగా పరిశీలిస్తే, తమిళనాడు వంటి రాష్ట్ర ప్రజల మనోభావాలు 'ఎగ్జిట్ పోల్స్'కు సైతం అందలేదు. మిగతా రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు కొన్ని సర్వేల ఫలితాల దరిదాపుల్లోకి వచ్చాయి. ఇక మన రాష్ట్ర ఉప ఎన్నికల ఫలితాలైతే, ఊహించినవే. అనూహ్య మెజారిటీని సాధించి, కడపలో ఎన్నికలు ఎంత ఏకపక్షంగా సాగాయన్న విషయాన్ని చెప్పాయి. ముందుగా తమిళనాడు రాష్ట్ర ఎన్నికల ఫలితాలను పరిశీలిస్తే... ముందస్తు అంచనాల ప్రకారం డి.ఎం.కె. కూటమికే అత్యధిక స్థానాలు రానున్నాయనీ, మరోసారి అన్నా డి.ఎం.కె., డి.ఎం.కె.కు చాలా తీవ్రమైన పోటీ ఇవ్వనుందనీ విన్నాం. తీరా ఫలితాలను చూసేసరికి ప్రజలు అన్నా డి.ఎం.కె.కు అయిదింట నాలుగొంతుల మెజారిటీని కట్టబెట్టారు.

ఇక్కడ ప్రధానంగా కరుణానిధి కుటుంబ పాలనను తీవ్రంగా వ్యతిరేకించిన ధోరణి కనిపిస్తోంది. అలాగే కరుణానిధి కుమార్తె కనిమొళి అవినీతి ఆరోపణలనెదుర్కొంటూ కోర్టుల చుట్టూ తిరిగడం కొంతమేరకు ప్రజా వ్యతిరేకతకు కారణంగా కనిపిస్తోంది. దాన్ని కప్పి పుచ్చుకునేందుకు ఆయన అడ్డగోలు పథకాలు ఎన్ని ప్రకటించినా ఓటర్లు లెక్క చేయక పోవడాన్ని ప్రజా చైతన్యంగానే భావించాలి. ప్రత్యామ్నాయంగా ఎన్నుకున్న అన్నా డి.ఎం.కె. నేత జయలలితను నిజాయితీ నేతగా గుర్తించినట్టా అంటే అదీ కాదు. మొత్తం కుటుంబ వ్యక్తుల పాలవుతున్న రాజకీయాలకు అడ్డుకట్ట వేయడమే ప్రజాభీష్టంగా అర్థం అవుతుంది. ఎందుకంటే వాగ్దానాల జడివానను జయలలిత కూడా కురిపించారు కాబట్టి. గతంలో జయలలితది కూడా అవినీతి చరిత్రే కనుక.

ఇక పశ్చిమ బెంగాల్ రాష్ట్ర ఎన్నికల ఫలితాలను సమీక్షించుకుంటే.. దేశవ్యాప్త వామపక్ష పార్టీలు, ఉద్యమాలు ఆత్మ విమర్శ చేసుకోవాల్సి ఉంది. భూసంస్కరణలను పటిష్టంగా అమలు చేయడంతో పాటు, మూడంచెల పంచాయితీరాజ్ వ్యవస్థకు ఆచరణ రూపమిచ్చి 1977 నుంచి అధికార పథంలో ఉంటూ వచ్చింది. కమ్యూనిస్టు పాలనను ఆచరణరీత్యా ప్రజలకు చవిచూపగలిగింది.

ఎప్పుడైతే పారిశ్రామికీకరణ దిశగా అభివృద్ధికై, ఆర్థిక సంస్కరణల మోజులో పడి, తమ మూల సిద్ధాంతాలకు, ప్రజా హితానికి తిలోదకాలు ఇవ్వడం జరిగిందో, ఆనాటి నుంచే తిరోగమనం మొదలైంది. పంచాయితీ వంటి లోకల్ బాడీ ఎన్నికల ఫలితాల నాడైనా చిత్తశుద్ధితో ఆత్మవిమర్శ చేసుకోలేక పోవడం అధికార దురహంకారమే. తృణమూల్ కాంగ్రెస్ నేత దీర్ఘకాలిక వ్యూహంగా లాల్‌ఘడ్, సింగూర్, నందిగ్రామ్ ఉద్యమాలను బలపరుస్తూ, వాటిని 'మా, మాటి, మానుష్' నినాదాలుగా మార్చి ప్రజా మద్దతును పొందగలిగారు. ఈ 'పరివర్తన' హోరులో పశ్చిమ బెంగాల్ మాజీ ముఖ్యమంత్రి బుద్ధదేవ్ భట్టాచార్యతో సహా మరో ఏడుగురు మంత్రులు ఓడిపోవడం గమనార్హం. వీరిలో వ్యవసాయం, పరిశ్రమలు, ఆర్థికం వంటి కీలక శాఖ నేతలూ ఉన్నారు. ఎందుకంటే ఈ కీలక రంగాల్లోనే వారు ప్రపంచీకరణకు వక్రభాష్యాలు చెప్పింది. ప్రజా వ్యతిరేక విధానాలకు పాల్పడింది. భూస్వామ్య వర్గాలను తలదన్నేలా, ఈ విధానాలను వ్యతిరేకిస్తున్న విప్లవ శక్తులపట్ల ప్రవర్తించిన ధోరణిని పీడిత ప్రజలు గుర్తెరిగారు. తృణమూల్ కూటమి భాగస్వామిగా కాంగ్రెస్ చెప్పుకుంటున్నప్పటికీ 'కాంగ్రెస్' పాత్ర పశ్చిమ బెంగాల్ ఎన్నికల్లో పరిమితమే. మమతా బెనర్జీ ఎంత భిన్నంగా వ్యవహరించి, ప్రజాహితంగా పాలన సాగించగలరన్నది రేపటి ప్రశ్న అయినప్పటికీ, ఆమె నిరాడంబరతతో కూడిన ఇమేజ్ ప్రజల్ని ఆకట్టుకుంది. కమ్యూనిస్టు నేతల కన్నా నిరాడంబరంగా ఆమె వ్యహరించారు. ప్రత్యామ్నాయాన్ని ఎన్నుకోవడంలో పశ్చిమ బెంగాల్ ప్రజలు కృతకృత్యులయ్యారనే చెప్పుకోవాలి.

కేరళ రాష్ట్రంలో కాంగ్రెస్ కూటమి విజయం సాధించినా, విజయఫలం భాగస్వామ్య పార్టీలకే వర్తిస్తుంది. ఎందుకంటే కాంగ్రెస్ పార్టీ గెలుచుకున్నది కేవలం 38 స్థానాలు కావడమే. పైగా గత మూడు దశాబ్దాలుగా కేరళ ప్రజలు అధికార – ప్రతిపక్ష పార్టీల కూటములకు 'ఆల్టర్నేటివని' అధికారాన్ని ఇవ్వడం ఆనవాయితీగా చూస్తున్నాం. ఈ విజయం సుమారుగా ఆశించిందే. వామపక్ష ప్రజాస్వామ్య కూటమి (ఎల్.డి.ఎఫ్.) ముందు ప్రకటించిన తీరును నేత అచ్యుతనందన్‌కు సీటివ్వకుంటే మరింత అప్రతిష్టను మూటకట్టుకునేది. చివర్లో సరైన నిర్ణయం తీసుకుందనే చెప్పాలి. ఎందుకంటే అచ్యుతానందన్ సహచరులు 10–11 మంది గెలవడం ప్రజామోదాన్ని తెలియజేస్తుంది. అందుకే ఐక్య ప్రజాస్వామ్య కూటమికి గట్టిపోటీ ఇవ్వగలిగింది. మొత్తం 140 స్థానాల్లో ఎల్.డి.ఎఫ్. 68 స్థానాలను గెల్చుకుంది. ప్రతిపక్షంలో ప్రధాన

పక్షంగా సి.పి.ఎం. 45 స్థానాలను గెల్చుకోవడం ఒకవంతయితే, భారతీయ జనతా పార్టీని అసెంబ్లీలో అడుగు పెట్టనీయకుండా ఆమడ దూరంలో ఉంచడం మరోవంతు. అలాగని కేరళ ప్రజానీకం సెక్యులర్ లక్ష్యంగా ఓటేసారా అంటే అదీ కన్పించదు. ముస్లింలీగ్, మణి కాంగ్రెస్ వంటి పార్టీలకు పట్టం కట్టారు. ఏది ఏమైనా బహుముఖ పార్టీ వ్యవస్థతో, బై-పార్టీ విధాన తీరున బలమైన ప్రతిపక్షాన్నిస్తూ – కాంగ్రెస్ కూటమికి అధికార పగ్గాలందివ్వడం ఓటర్ల విజ్ఞతే. గతసారి ఎన్నికల్లో ఎల్.డి.ఎఫ్.కు అధికారాన్ని ఇచ్చినా, ఈసారికంటే సుమారు రెట్టింపు స్థాయిలో కాంగ్రెస్‌ను గెలిపించారు. అంటే కాంగ్రెస్‌ను తిరస్కరిస్తూనే, ప్రతిపక్ష భాగస్వామ్యాన్ని గెలిపించారన్న మాట.

ఇక, అస్సాం రాష్ట్రం విషయానికొస్తే... కాంగ్రెస్ పార్టీ మూడోసారి అధికారంలోకి రాగలిగింది. ముఖ్యమంత్రి తరుణ్ గొగోయ్ కృషి ప్రజాహిత విధానాల మూలంగానే కాంగ్రెస్ నెగ్గుకు రాగలిగింది. ప్రధాన ప్రతిపక్షంగా నిలవాల్సిన ఎ.జి.పి. (అస్సోం గణ పరిషత్) స్వయం కృతపరాధాల వల్ల గట్టిపోటీనివ్వలేక పోయింది. ఎ.జి.పి. అవినీతి ఆరోపణలు అభిప్రాయ బేధాలు, చీలికలు, విలీనాలు... వీటితోపాటు సతమతమవుతూ ప్రజా సమస్యలను పట్టించుకోలేదన్న ఆరోపణలు ఉన్నాయి. ఇందుకు ప్రతిగా ఆల్ ఇండియా యునైటెడ్ డెమొక్రటిక్ ఫ్రంట్ (ఎ.ఐ.ఎం.డి.ఎఫ్.) పేరున ఎ.జి.పి. అలక్ష్యం చేసిన వలసవాదులు రాజకీయ శక్తిగా అవతరించి ఎ.జి.పి ప్రాభవాన్ని మరింతగా నిలువరించగలిగారు. గతం కంటే ఎ.ఐ.ఎం.డి.ఎఫ్. మరింతగా ప్రజామోదాన్ని పొందగలిగితే, ఎ.జి.పి. ఆ మేరకు నిరాదరణకు చేరువైన వైనం కన్పిస్తుంది.

కాంగ్రెస్‌కు మద్దత్తునిస్తూ బోడో ల్యాండ్ పీపుల్స్ ఫ్రంట్ (బి.పి.ఎఫ్.) సైతం గణనీయ ప్రభావాన్నే చూపింది. బహుముఖ రాజకీయ పార్టీల మధ్య స్థానిక సమస్యలు, వలసవాదుల సమస్య, ఉల్ఫావాదం, బోడోల్యాండ్ సమస్యల ప్రాముఖ్యతల మధ్య గొగోయ్ వ్యక్తిగత నిబద్ధత కాంగ్రెస్‌కు అధికారాన్ని అందించాయని చెప్పొచ్చు. ఓటర్ల నిష్పక్ష ధోరణికి ఎ.జి.పి. నేత ప్రఫుల్ కుమార్ మహంతకు ఓటమినివ్వడం 'అవినీతి'ని తీవ్రంగా వ్యతిరేకించిన ధోరణే.

పుదుచ్చేరిలో కాంగ్రెస్‌కు చుక్కెదురయింది. ఉనికిలోకి వచ్చిన కొత్త పార్టీ ఎన్.ఆర్. కాంగ్రెస్, ఎ.ఐ.డి.ఎం.కె. తో కలిసి మూడింట రెండు మెజారిటీని సాధించింది. రెండేళ్ల క్రితం కాంగ్రెస్ నుంచి బైటపడ్డ ఎన్. రంగస్వామిక సరిగ్గా ఎన్నికలకు మూడు నెలల ముందు ఎన్.ఆర్. కాంగ్రెస్ అన్న పార్టీని స్థాపించి, అధికారాన్ని చేజిక్కించుకున్నారు. విద్యార్థి దశ నుంచే రాజకీయల్లో ఉన్న రంగస్వామి అట్టహాసాలకు పోకుండా నిరాడంబరుడిగా ప్రజల్లో గుర్తింపు పొందారు. రాజ్యాధికారాన్ని వారసత్వపు హక్కుగా పరిగణింపజేస్తున్న ఈ రోజుల్లో 'బ్రహ్మచారి'గా ప్రజాసేవకే తాను అంకితమన్న భావనను ప్రజల్లో కలిగించగలిగారు. గతంలో కాంగ్రెస్ పక్షాన ముఖ్యమంత్రిని అలంకరించినప్పటికీ ఆచరణలో అవినీతి జాడ్యాలకు దూరంగానే ఉన్నారు. సెక్యూరిటీ వంటి అట్టహాసాలు లేకుండా మోటారు సైకిల్‌పై ప్రచారం చేస్తూ, సామాన్యుల్ని కలగలుస్తూ విజయం సాధించారు. అంతిమంగా 'నిజాయితీ'దే తుది గెలుపని ప్రజలు నిరూపించారు.

చివరగా మన రాష్ట్రంలో కడప జిల్లా ఉప ఎన్నికలు. విజయం వై.ఎస్.ఆర్. కుటుంబ సభ్యులదే అని అంచనా వేసినప్పటికీ, సాధించిన మెజారిటీ అనూహ్యంగా ఉంది. అంతవరకూ వింటున్న ప్రచార పోకడలు, ధన బలం ప్రమేయాన్ని వక్కాణిస్తుండగా, సాధించిన మెజారిటీ జనబల ప్రయోగాన్ని నిరూపించింది. ఓటింగ్ సరళిని రికార్డు చేసేందుకు ఏర్పాటు చేసిన సి.సి. కెమేరాలు పనిచేయకపోవడం, విద్యుత్ నిలిపివేత ఏకపక్ష ఎన్నికల ధోరణిని బలపర్చేలా ఉన్నాయి. అధికార, ప్రతిపక్షాలు అవినీతిపై ఎన్ని కథనాలు వినిపించినప్పటికీ, మీలో అవినీతికి పాల్పడంది ఎవరో తేల్చి చెప్పండనేలా ఓటరు వ్యవహరించాడు. సానుభూతి కీలకమైంది. మొదట్నుంచీ మన రాష్ట్ర వైఖరి మిగతా అన్నింటికంటే భిన్నవే. పుదుచ్చేరిలో అనుభవమే ఇక్కడా పునరావృతమైనా అక్కడ వ్యక్తిగత ప్రాభవం విజయం సాధిస్తే, ఇక్కడ ధన బలానికి సానుభూతి జోడయింది. అంతే తేడా.

మొత్తంగా సమీక్షించుకుంటే పాలకపక్ష, ప్రతిపక్ష రాజకీయ ఎత్తుగడలను ఓటరు నిశితంగా పరిశీలిస్తూనే ఉన్నాడు. అనేకానేక ఉద్యమాల్లో ప్రజలు కదంతొక్కుతున్నారు. మొన్న విశాఖ ఏజెన్సీలో భూస్వాధీనం కోసం వచ్చిన ప్రజా ప్రతినిధులను ఆదివాసీలు వెంటబడి తరిమారు. సోంపేటలోను ఏ రాజకీయ పార్టీ అండలేకుండానే సామాన్యులు ప్రభుత్వ యత్నాన్ని నిలువరించారు. అటు నొయిడాలోనూ ఇదే ధోరణి. నిన్నటికి నిన్న గంగవరం పోర్టు ప్రజాభిప్రాయ సేకరణలోనూ ప్రజలు వెల్లువలా కదిలి ప్రభుత్వ దూకుడును నిలువరించారు. ప్రజల్లో చైతన్యం లేదనడం పలాయనవాదమే. గతకాలపు నిబద్ధత, అంకితభావం నేటి ఉద్యమ నేతలకు కొరవడినందునే ఇంకొంత కాలం పాలక పార్టీలు మనగలుగుతాయి. ప్రజా చైతన్యానిదే అంతిమ విజయం.

*(రచయిత పాత్రికేయులు)*

వీ

ప్రజలు నమ్మినంత కాలం బాబాల గారడీలు, పాలక వర్గాల నాటకాలు సాగుతూనే ఉంటాయని అంటున్నారు

**జి. లచ్చయ్య**

# సాయిబాబా - సమాధానం లేని ప్రశ్నలు

అవి ఎమర్జెన్సీ రోజులు. హైదరాబాద్‌లో 'శివం' సత్యసాయి ట్రస్ట్ ద్వారా రూపుదిద్దుకున్నది. అంతకుముందు నుంచే సాయిబాబా మహిమలు ప్రాచుర్యం పొందుతున్నాయి. ఆయన మహిమలను మొట్టమొదట సవాలు చేసింది డా. టి.ఎ. కొవూర్. కేరళలో పుట్టిన కోవూర్ శ్రీలంకలో స్థిరపడి, శ్రీలంక హేతువాద సంస్థను స్థాపించాడు. కోవూర్ స్ఫూర్తితో ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి అభ్యుదయ భావాలు గల విద్యార్థులు సాయిబాబా వస్తుందని తెలిసి శివం వైపు కదిలారు. ఇప్పటి ఎన్.సి.సి. గేటు దగ్గరనే విద్యార్థులందరినీ సాయి సేవాదళ సిబ్బంది పోలీసుల సహకారంతో ఆపివేసారు. 'సాయిబాబా మహిమల్ని మేం కళ్లారా చూస్తామని' కోరితే, అది కుదరనిపని అని వారు అడ్డగించారు. ఆ విధంగా సాయి మహిమలపై పత్రికలలో చర్చలు మొదలయ్యాయి.

సాయిబాబా మహిమలు బూటకమని, ఆయన సృష్టించే వస్తువులన్నీ ముందే తయారైనవనీ, శూన్యం నుంచి ఏది సృష్టించడం సాధ్యం కాదనీ, అలాగే ఏ వస్తువు వినాశకరం చెందదని, ద్రవ్య నిత్యత్వ నియమ సూత్రాన్ని (లా ఆఫ్ కన్సర్వేషన్ ఆఫ్ మాస్) అనుసరించి సృష్టి కార్యక్రమం ఆధారపడి ఉందని కోవూర్ ప్రస్తావిస్తూ వాటిని తాను కూడా చేసి చూపించగలనని, తాను పుట్టపర్తికి వస్తానని సాయిబాబాకు (ఆయన అనుచరగణానికి) తెలిపితే, కోవూర్‌ను కలవడం ఇష్టంలేని సాయిబాబా, పుట్టపర్తిని వదిలి బెంగళూరులోని తన వైట్ ఫీల్డ్‌కు వెళ్లిపోయాడు. ఆ తర్వాత ఇదే సవాల్‌ను డా. అబ్రహం కోవూర్ అనేక మార్లు విసిరినా సాయిబాబా నుంచి సమాధానం లేదు. 18, సెప్టెంబర్ 1978న కోవూర్ మరణించారు.

ఆ తర్వాత బెంగళూర్ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ ఎచ్. నర్సింహయ్య కోవూర్ లాగానే సవాలు విసిరారు. పైగా ఆయన ఒక కమిటీని కూడా ఏర్పాటు చేసి, తన మహిమల్ని నియత్రించిన పద్ధతుల్లో అందరి ముందర ప్రదర్శించాలని డిమాండ్ చేసినా ఫలితం లేకుండా పోయింది. ఈయన 31 జనవరి 2005లో చనిపోయారు. తర్వాత తమిళనాడుకు చెందిన బసవ ప్రేమానంద సాయిబాబాను ఛాలెంజ్ చేస్తూ, శాస్త్రీయ పద్ధతులకు లోబడి ఏ బాబా అయినా తన మహిమల్ని నిరూపిస్తే లక్ష రూపాయలు బహుమతిగా ఇస్తానని ప్రకటించాడు. ఈ డబ్బు ఇప్పటికీ అలాగే ఉంది. పైగా బాబా సృష్టించి ఇచ్చే బంగారు గొలుసులు, నెక్లెస్‌లు గోల్డు కంట్రోల్ యాక్ట్‌కు విరుద్ధమని భావించి, ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో సెక్షన్ 11 ప్రకారం సాయిబాబాపై చట్టపరమైన చర్యలు తీసుకోవాలని పిటిషన్ వేసాడు. ఆధ్యాత్మిక ఆలోచనలు చట్టపరిధిలోకి రావని కోర్టు భావించి ప్రేమానంద పిటిషన్‌ను హైకోర్టు తిరస్కరించింది. ప్రేమానంద కూడా 4 అక్టోబర్ 2009లో మరణించారు. ఈ విధంగా సాయిబాబాను ఛాలెంజ్ చేసిన వారిలో అమెరికన్ హేతువాద సంఘ అధ్యక్షులు రాంజీ, భారతదేశ ప్రఖ్యాత మెజిషియన్లు అయిన కె.లాల్, పి.సి. సర్కార్ (జూనియర్) ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ నుంచి హేతువాది ఎన్. ఇన్నయ్య, జనవిజ్ఞాన వేదికలతో పాటుగా, ఇండియన్ రాడికల్ హ్యూమనిస్ట్ అసోసియేషన్, ఫెడరేషన్ ఆఫ్ ఎథిస్ట్ రేషనలిస్ట్ హ్యూమనిస్ట్ అసోసియేషన్ (ఎఫ్.ఎ.ఆర్.ఎ.) లాంటి సంస్థలు సాయిబాబాను దాదాపు గత నాలుగు దశాబ్దాల కాలంగా ప్రశ్నిస్తూనే ఉన్నాయి.

వీరడిగిన కొన్ని ముఖ్యమైన ప్రశ్నలు – రెండు రూపాయల నోట్ల కట్ట నుంచి (కొత్తవి. ఆ రోజుల్లో రెండు రూపాయల నోటు బాగా చెలామణిలో ఉండేది) సాయిబాబా అందరి సమక్షంలో ఒక నోటును తీసి (చూడకుండా) దాని నెంబర్ చెప్పాలి. దీన్నే నాటి ఉస్మానియా విద్యార్థులు చాలెంజ్ చేశారు. వీరు వేసిన మరో ప్రశ్న – సాయిబాబా సృష్టించి ఇచ్చే భగవద్గీత పుస్తకాల్లో అచ్చుతప్పు లెందుకుంటాయని, అలాగే ప్రచురణ సంస్థ పేరెందుకుంటుందని! వీటికి సమాధానం చెపితే కె.లాల్ తన ప్రదర్శనకు సంబంధించిన యావదాస్తిని (ఆరోజుల్లో యాభై లక్షలకు పైగా) సాయి ట్రస్ట్‌కు దానం చేసి జీవితాంతం సాయిబాబా శిష్యునిగా ఉంటానని ప్రకటించాడు. 'ఇలాంటి పనికిమాలిన వారికి సమాధానం చెప్పడం అవసరం లేదని' భావించిన సాయిట్రస్ట్ వారు సాయిబాబానే మౌన ముద్ర వేయించారు.

సాయిబాబా వెలుగులోకి వస్తున్న 1963 ప్రాంతంలోనే ప్రధానంగా వినిపించిన పేరు డా. సూరి భగవంతం. ఈయన ఉస్మానియా విశ్వవిద్యాలయంలో భౌతిక శాస్త్ర అధిపతిగా ఉంటూ కొంతకాలం వైస్ ఛాన్సలర్‌గా కూడా ఉన్నారు. ఈయనే సాయిబాబాను తీర్చిదిద్దిన వ్యక్తి అని అందరు అనుకునే వారు. సాయిబాబాకు గారడీ విద్యలు నేర్పింది కూడా సూరి భగవంతమేనని, ఆయన చుట్టూ ఓ కోటరీని తయారు చేసి నాటకాలడించి భక్తునిగా చలామణి అయ్యాడు.

ఈ విధంగా సమాజంలో పేరు ప్రఖ్యాతులున్న వారందరూ తమ తమ ఆస్తుల్ని పెంచుకోవడానికి, తమ తప్పుడు విధానాలను

కప్పిపుచ్చుకోవడానికి, సాయిబాబా భక్తులుగా మారడం జరిగింది. దీనికి తోడు వీరంతా సాయిబాబా మహిమల్ని ప్రచారం చేయడం పరిపాటైయింది. సాయిబాబా స్పర్శతోనే జబ్బులు నయమవుతాయని, ఆయన విభూతి రాసుకుంటే పోలియో (కొందరికి మాత్రమే) లాంటి మహమ్మారి మాయమైందనే కథనాలు ప్రచారంలోకి వచ్చాయి. ఇందులో సునీల్ గవాస్కర్ లాంటి క్రికెటర్స్ నుంచి, గీతారెడ్డి లాంటి రాజకీయ నాయకుల దాకా ఉన్నారు. అయితే వీరంతా ఇతర వైద్య పద్ధతులను వాడుకుంటూనే సాయిబాబా విభూతిని రుద్దుకోవడం జరిగిందనేది కాదనలేని సత్యం.

ఈ సందర్భంగా ఒక సంఘటన చెపుతూ ఉంటారు. 1980 ప్రాంతంలో సాయిబాబా ప్రయాణిస్తున్న కారులో పెట్రోలు అయిపోతే, నీరు తెప్పించి, అందులో సాయిబాబా వేలును పెట్టగా, నీరంతా పెట్రోలుగా మారిందనే కథనాలు ప్రచారమయ్యాయి. ఇదే నిజమైతే, మన నీటి వనరులను పెట్రోలు వనరులుగా ఎందుకు మార్చుకోరాదో అనే ప్రశ్నను సాయిబాబాకు వేయడం జరిగింది. అన్నింటికిలాగా దీనికీ సాయిబాబా నుంచి సమాధానం లేదు. ఈ సందర్భంగా గద్దర్ ఓ పాటను కూడా రాయడం జరిగింది.

### కరుణానిధే సాయి భక్తుడైతే!

మద్రాస్ నడిబొడ్డున రామాయణాన్ని తగిలేసి బ్రాహ్మణ భావజాలాన్ని ధిక్కరించిన మహనీయుడు పెరియార్ రామస్వామి. ఈయన శిష్యునిగా చెప్పుకొని, హేతువాదిగా చెలామణి అవుతున్న తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి ఎం. కరుణానిధి సాయిబాబాకు అనుగుణంగా మారడం ఓ రాజకీయమే. నీటి కటకటతో తల్లడిల్లే చెన్నై నగరానికి ఎన్.టి. రామారావు తర్వాత కృష్ణానది నీటిని ఖండలేరు – పూండి కాలువ ద్వారా సాయిబాబా అందించడంతో కరుణానిధి భక్తునిగా మారినట్లు చెప్పుకుంటారు. హేతువాద దృక్పథం ఉన్న కరుణానిధి లాంటి వారే ఈ విధంగా బాబాల చుట్టూ తిరిగితే, రాజకీయ లబ్ధి పొందేవారు దేశాధ్యక్షులైనా, ప్రధానమంత్రులైనా, ముఖ్యమంత్రులైనా సాయిబాబా కాళ్ల దగ్గర కూర్చోవాల్సిందే. దేశ సార్వభౌమత్వాన్ని ఆయన పాదాల చెంత పెట్టడంలో ఆశ్చర్య పడాల్సిందేమీ లేదు.

### సత్యమ్మ విగ్రహాన్ని నమ్ముకున్న సాయి భక్తులు

మొన్నటిదాకా సాయిబాబాను నమ్ముకున్న భక్తులు, సాయిబాబానే అనారోగ్యం పాలై ఆసుపత్రిలో చేరితే, దిక్కుతోచని భక్తజనం చివరికి యాభై ఏండ్ల క్రితం సాయిబాబా ప్రతిష్టించిన సత్యమ్మ విగ్రహాన్ని ఆరాధించడం మొదలు పెట్టారు. సాయిబాబా ప్రతిష్టించిన పాలరాతి విగ్రహం రోడ్డు వెడల్పు కార్యక్రమంలో కుడిచేయి విరిగిపోగా, దగ్గరలోని బుక్కపట్నం చెరువులో నిమజ్జనం చేశారు. దాంతో సాయిబాబా అనారోగ్యం పాలయ్యాడని, తిరిగి పాత విగ్రహాన్ని ప్రతిష్టించాలని భావించిన పుట్టపర్తి వాసులు, చెరువులో నిమజ్జనం చేసిన పాలరాతి విగ్రహాన్ని వెతికి తెచ్చి తిరిగి ప్రతిష్టించారు. ఈ విధంగా ప్రతిష్టించడంతోటే, అప్పటిదాకా కదలని సాయిబాబా శరీరంలో కదలికలు మొదలయ్యాయని భక్తులు పాపం భావించారు. కాని అప్పటికే సాయిబాబా చనిపోయి ఉంటాడనే విషయం వీరికి తెలియదు. ఇదంతా సాయి మహిమ అనడం కన్నా సాయి ట్రస్ట్ మహిమ అంటే బాగుంటుంది.

### జననం – మరణం – పునఃర్జననం

సాయిబాబా జననం గురించి, మరణం గురించి, తిరిగి జన్మించే కథల గురించి ఇప్పుడు బహుళ ప్రచారంలోకి వచ్చాయి. జన్మించిన 14వ ఏటనే తానే షిరిడి సాయిబాబా అవతారమని చెప్పి విభూతిని, ప్రసాదాన్ని, ఉంగరాలను సృష్టించి చూపాడని కథనాలు. అయితే ఇక్కడ గమనించాల్సిన అంశాలు చాలా ఉన్నాయి. పుట్టపర్తి సాయిబాబాలాగా షిరిడిసాయి బాబా బతికుండగా ఆస్తుల్ని పోగు చేసుకోలేదు. తాను దైవాంశ సంభూతినిగా ఎప్పుడూ చెప్పుకున్నట్లు లేదు. తాను మహిమ చూపింది అంతకన్నా లేదు. తన నిరాడంబరతతో, మృదు స్వభావంతో జనాన్ని ఆకట్టుకున్నట్లు కథనాలు. ఆయన నిర్యాణం తర్వాతనే షిరిడిలో ఆస్తులు పోగు చేయడం మొదలయ్యాయి. ఇక షిరిడి సాయిబాబా మరణానికి, సాయిబాబా జన్మ తేదికి ఎలాంటి సంబంధం లేదు.

షిరిడి సాయిబాబా పుట్టింది పార్థి అనే గ్రామంలో. సాయిబాబా పుట్టింది గొల్లపల్లి గ్రామంలో. గొల్లపల్లిని పుట్టపర్తిగా మార్చింది సాయిబాబా అనుయాయులే. అలాగే పుట్టబోయే ప్రేమసాయి గ్రామం కూడా కర్ణాటకలోని కావేరి నది ఒడ్డున, శ్రీరంగం పట్టణం దగ్గరలోని గుణపర్థిగా పేర్కొనడం కూడా ఒక ప్రణాళికనే. ఎందుకంటే పార్థి, పుట్టపర్తి, గుణపర్థి మూడు కూడా చివర ఒకే శబ్దాన్ని కలిగి ఉన్నాయి. ఇది కావాలని చేసిందని, చేస్తున్నదని అర్థమవుతోంది. ఇక సాయిబాబా 96 సంవత్సరాలు బతుకుతాడని ప్రకటించుకొని 85వ ఏటనే తనువు చాలించాడు. సాయిబాబా లెక్క ప్రకారమే ఇంకా పదకొండు సంవత్సరాలు బతకాలి. అంటే మూడవ అవతారమైన ప్రేమసాయి మరో పదకొండు సంవత్సరాల తర్వాతనే పుట్టాలి. కాని ఆయన వచ్చే సంవత్సరమే జన్మించబోతున్నాడు. అంటే మరో సాయిబాబాను, సాయిబాబా కోటరీ సిద్ధం చేయబోతున్నదన్న మాట. లేదా సంసిద్ధత మొదలై ఉండాలి. ఈ మధ్యన శాంభవి అనే అమ్మాయిని మహిమాన్వితు రాలుగా గుర్తించి 'అమ్మ'గా మార్చబోతే, మానవహక్కుల వేదిక అడ్డుకున్న విషయం తెలిసిందే. ఇలాంటి సంఘటనలు నేపాల్‌లోనూ, భూటాన్‌లోనూ, టిబెట్‌లోనూ జరుగుతూనే ఉన్నాయి.

ఒక వ్యక్తి మరణించిన తర్వాత (తను చనిపోయేది తనకే తెలియదు) కొంతకాలానికి మరో అవతారం ఎలా ఎత్తుతాడు? అంతవరకు ఈ చనిపోయిన వ్యక్తి ఎక్కడుంటాడు? దీనికి అనేక రకాల ట్రిక్కుల్ని వీరు చూపడానికి ప్రయత్నిస్తారు. నమ్మే సమాజం ఉన్నప్పుడు నమ్మించడం చాలా సులభం కాబట్టి, ఈ నమ్మకాలు ఇలాగే కొనసాగుతూ ఉంటాయి.

### సాయిబాబా – దేనికి అతీతం?

సాయిబాబాకు దివ్యశక్తులున్నాయని, ఆయన్ని నమ్ముకుంటే ఆయురారోగ్య, ఐశ్వర్యాలు సిద్ధిస్తాయని భావించే జనం దేశంలోనే కాదు, వివిధ దేశాల్లో కూడా ఉండడం గమనార్హం. వీరిలో సాధారణ జనం నుంచి, సినిమా, క్రికెట్, రాజకీయ వ్యక్తులు ఉన్నారు. ఒకరిని చూసి మరొకరు, ఇంకా చెప్పాలంటే సాయిబాబా మహిమల్ని విదేశీయులే నమ్ముతున్నప్పుడు, మనమెంత అని గుడ్డిగా అనుకరించే భక్తజనంకు సాయిబాబా వెనకగల లోతు, అంతర్యాల వ్యూహాలు తెలియవు.

తెలుసుకునే అవకాశాన్ని ఆయన అనుచరగణం ఎప్పుడూ ఇవ్వలేదు. చివరికి ఆయన చావుకూడా వివాదాస్పదంగానే ముగిసింది.

వీటన్నింటిని నిగ్గుతేల్చి నిజానిజాల్ని ప్రజలకు తెలపాల్సిన బాధ్యతగల ప్రభుత్వం, మొత్తం రాజ్యాంగాన్నే సాయిబాబా పాదాలచెంత పెట్టింది. నెహ్రూ లాంటి వారు తప్ప, మిగతా భారత పాలకులంతా సాయిబాబాకు విధేయులుగా ఉండడానికే ప్రయత్నించారు. భారతదేశ మొదటిపౌరుడు, పౌరురాలని చెప్పుకునే దేశాధ్యక్షులు, పుట్టపర్తిని సందర్శించడం (ఒకరిద్దరు తప్ప) ఆనవాయితీగా మారడం కాదు - సాయిబాబా ఉన్నత ఆసనం పక్కన కూర్చోవడం, మొత్తంగా భారత ప్రజల్ని అవమానించడమే.

ఇకపోతే, ఈ సందర్భంగా గమనించాల్సిన అంశాలున్నాయి. 1963లోనే (37వ ఏట) సాయిబాబాకు గుండెపోటు వచ్చింది. ఆ తర్వాత మరో నాలుగుసార్లు కూడా గురికావడం జరిగింది. 2005లో ఆయన సాధారణ మానవులు అనారోగ్యం పాలైనట్లే అనారోగ్యానికి గురయ్యారు. 2006లో ఆయనకు తుంటు ఎముక విరగడం, శస్త్ర చికిత్స జరగడం, వీల్‌చైర్లో, కారులో కూర్చొనే భక్తులకు దర్శనం ఇవ్వడం జరిగింది. 2002 ప్రాంతంలో కూడా ఆయన బాత్‌రూంలో జారిపడడంతో కాలు విరిగిందని ప్రచారం జరగడమే కాదు, చాలాకాలం దాకా, ఇటు పుట్టపర్తిలోగాని, అటు బెంగళూరులోని వైట్‌ఫీల్డ్‌లో గాని ఎవరికి దర్శనమీయలేదు. ఇక మొన్నటి అనారోగ్య పరిస్థితి గురించి అందరికీ తెలిసిందే. ఇక జీవిత కాలమంతా ఆయన ఒక విధమైన దగ్గుతో బాధపడేవాడు. ఇది బయటకు రాకుండా ఆయన చాలా జాగ్రత్తలు తీసుకునేవాడు.

ఆయనను సాయిబాబాగా మార్చడానికి శిక్షణ ఇచ్చిన కాలంలో బలవంతంగా గొంతులోనుంచి లింగాలను తీయించేవారని, దానితో ఆయన గొంతుకూడా దెబ్బతినడమే కాకుండా, మెడ ముందు భాగం పెద్ద పెద్ద ముడతలుగా మారిందనేది మరో కథనం. ఏది ఏమైనా, సాయిబాబా స్వయంగా ఎదిగిన వ్యక్తి కాదనీ, ఎదిగించిన వ్యక్తనీ, సర్కస్ రింగ్ మాస్టర్లు సాయి ట్రస్టులో కొందరుండగా బయట పడనివారు అనేక మందని చాలాకాలంగా అనుమానాలున్నాయి. చివరికి ఆయన కట్టించిన సూపర్ స్పెషాలిటీ హాస్పిటలే వాస్తు దోషంతో ఉందనే వాదన దాకా ఆయన బంధువర్గం వచ్చిందంటే, సాయిబాబా శక్తులకు ఉన్న ప్రాధాన్యాత ఏంటో అర్థం చేసుకోవచ్చు.

## సాయిబాబా ఎందుకు ఏడ్చాడు?

సాయిబాబా 85వ జన్మదినోత్సవ సందర్భంగా వెండిరథంలో ఊరేగుతుండగా కంటతడిపెట్టుకుంటున్న దృశ్యాల్ని టివిలు స్పష్టంగానే చూపాయి. సాయిబాబాను చూస్తేనే పరవశించే భక్తజనాలకు ఆయనెందుకు ఏడ్చాడో తెలియదు. బహుశా ఆ విధంగా ఆలోచించే శక్తి భక్తులకు లేదు. దాదాపు గత సంవత్సర కాలంగా సాయిబాబా ఏదో ఒత్తిడిలకు లోనైనట్లు స్పష్టమవుతోంది. పైగా హాస్పిటల్‌లో చేర్చడానికి ముందు నుంచే సాయిబాబాకు స్టెరాయిడ్స్‌ను ఇచ్చేవారని వదంతి. ఆయన తిండి తిప్పల గురించి బహిర్గత పర్చాలనే వాదన కూడా ఈ సందర్భంగా రావడం జరిగింది. ఈ విషయాన్ని ఆయన భక్తుడు, మాజీ టిటిడి చైర్మన్ డి.కె. ఆదికేశవులే చెప్పారు. కె. భాస్కర రెడ్డి అనే అడ్వకేటు పెనుకొండలో కేసు కూడా వేశారు. దళిత జనసభ అయితే రాష్ట్ర మానవ హక్కుల కమిషన్‌కు ఫిర్యాదు కూడా చేసింది. అయినా అటు సాయి ట్రస్ట్‌లో గానీ, ఇటు రాష్ట్ర ప్రభుత్వంలో గానీ ఇసుమంతైనా చలనం కలుగలేదు.

## లెక్క తేలని ఆస్తులు

వివిధ దేశాలలో దాదాపు 13,000 సంస్థల్ని కలిగి, విద్యా, వైద్య రంగాల్లో సేవలందిస్తున్నట్లు చెపుతున్న సాయిబాబా ట్రస్ట్‌పై ఆదినుంచి ఆరోపణలున్నాయి. వివిధ దేశాల నుంచి కోట్లాది డాలర్లు సాయిబాబా ట్రస్ట్‌కు అందుతూ ఉంటాయి. అమెరికాకు చెందిన హార్డ్‌రాక్ కేఫ్ ఫౌండర్ ఇసాక్ టిగ్రెట్ బర్టన్ దాచుకున్న సంపాదన నుంచి 108 మిలియన్ డాలర్లను సాయిబాబా ఫౌండేషన్‌కు ఇవ్వగా, పుట్టపర్తిలో సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ నిర్మాణం జరిగింది. అలాగే గోల్డ్ అనే మరో అమెరికన్ ఆరు వందల కోట్ల రూపాయల్ని, ఒక ఇటాలియన్ మూడు వందల కోట్ల రూపాయల్ని, మరో ఎన్.ఆర్.ఐ. యాభై కోట్ల రూపాయల్ని, ఒక ఇండోనేషియన్ యాభై కోట్ల రూపాయల్ని డొనేషన్‌గా ఇచ్చారు. ఇవన్నీ అచ్చుకెక్కిన లెక్కలు కావచ్చు. కాని అచ్చు కెక్కని లెక్కలకు అంతులేదు. సాయిబాబా ట్రస్ట్‌కు ఇచ్చే డబ్బుకు ఆదాయపు పన్ను మినహాయింపు ఉండడంతో అడ్డగోలుగా అక్రమార్జితులు కోట్లాది రూపాయల్ని చందాలుగా ఇచ్చి సమాజంలో పెద్ద మనుషులుగా చెలామణీ కావడం జరుగుతోంది. బ్యాంకు బ్యాలెన్సు దాదాపు ఒక లక్షా యాభై వేల కోట్ల రూపాయలున్నట్లు, స్థిరాస్తులు దాదాపుగా 40-50 లక్షల కోట్ల రూపాయల వరకు ఉండవచ్చని అంచనా. ఒక వ్యక్తి కేంద్రంగా, ఒక విశ్వాసంపై ఇంత డబ్బు పోగు పడుతుంటే, ప్రభుత్వం ప్రేక్షక పాత్ర వహించడం ప్రభుత్వ బలహీనత కాదు. ప్రభుత్వ దోపిడీ మనస్తత్వమే.

సాయిబాబాకు వచ్చిన డబ్బు సాయిబాబా వాడుకోవడం లేదు కదా అవి, ప్రజల సేవకే ఖర్చు చేస్తున్నాడని వాదించేవారు కోకొల్లలు. ఒక వ్యక్తి ఇంత శక్తిమంతుడుగా ఎదిగి ఇన్ని ప్రజా సంక్షేమ కార్యక్రమాలు చేస్తుంటే, పెద్ద యంత్రాంగం కలిగి ఉండి, పాలనా వ్యవస్థ కలిగి ఉండి, ప్రభుత్వం ఎందుకు చేయడం లేదనేది ఆలోచించాల్సిన ప్రశ్న! అలాంటప్పుడు ఈ ఎన్నికలెందుకు, ఈ పార్లమెంటులెందుకు, ఈ పాలకులెందుకు అనే ప్రశ్నలు వేసుకోవాల్సిందే. మొత్తం దేశాన్ని సాయిబాబా ట్రస్టుకో, లేదా ఇప్పటికే ఉండి, వివిధ నేరాలతో పత్రికలకెక్కుతున్న ఇతర బాబాలకో కట్టబెడితే సరిపోదా.

## నిజంగా ప్రశాంతి నిలయంలో ప్రశాంతత ఉందా?

సాయిబాబా వెనక ఒక పెద్ద ముఠా ఉందని, వారు గుడుపుఠాని చేస్తున్నారని భావించిన కొందరు భక్తులు, ఈ విషయాన్ని బాబాకే స్వయంగా తెలియజేయాలని జూన్ 6, 1993న సాయిబాబా శయన మందిరంలోకి ప్రవేశిస్తే నిర్దాక్షిణ్యంగా ఆరుగురిని సాయిబాబా అనుచరులు కాల్చి చంపారు. ఇందులో ఇద్దరు సాయిబాబా అనుచరులు కూడా ఉండడం గమనార్హం. ఈ కేసు ఇప్పటికీ చిక్కుముడిగానే

ఉండిపోయింది. ప్రభుత్వం కనీసం విచారణను చేపట్టలేకపోయింది. ఇదే సందర్భంగా ప్రశాంతి నిలయంలో పిల్లలపై ఆకృత్యాలు జరుగుతున్నట్లు వార్తలు కూడా వచ్చాయి. వీటిని కూడా ఎవరు పట్టించుకోలేదు.

**సాయిబాబా – సెంటిమెంటు**

అన్ని మతాలను సమానంగా చూడాలని కోరే సాయిబాబాకు హిందూ మత సాంప్రదాయాలపై ఎక్కువ నమ్మకం. దాదాపు ఆయనకు బి.ఎం.డబ్ల్యు., రోల్స్‌రాయ్, టోయాటో కార్ల నుంచి మొదలుకొని అన్ని రకాల కంపెనీల కార్లు బహుమతిగా వచ్చాయి. అన్నింటి నెంబర్లు 9999 గా ఉండడం గమనార్హం. భజనలు, కీర్తనలు అన్నీ కూడా హిందూ మత సాంప్రదాయాల ప్రకారమే జరిగేవి. చివరికి ఆయన నిర్యాణాన్ని హిందూమత సాంప్రదాయం ప్రకారం, దశ దానాలతో, క్రతువులతో చేయడం గమనించాలి. పోతే ఇతర మతస్తులు ప్రార్థనలు చేసి ఉంటారు. ఒక అతీత వ్యక్తి అయినప్పుడు, సాధారణ, సాంప్రదాయ పద్ధతులకు ఆయన్ని ఎందుకు బలిచేసారనేది కూడా ఆలోచించాల్సిన అంశం.

**భారతదేశం – బాబాల మయం**

ఏ దేశంలో లేనంతమంది బాబాలు భారతదేశంలో అవతారం ఎత్తడం లౌకిక వ్యవస్థకే ప్రశ్నార్థకంగా మారుతుంది. సత్యసాయి బాబాతో సహా దాదాపు అందరు బాబాలు ఏదో వివాదాల్లో కూరుకొని పోవడం చూస్తూనే ఉన్నాం. రజనీష్, కల్కి, చంద్రస్వామి, ధీరేంద్ర బ్రహ్మచారి, బాలసాయి, నిన్నమొన్నటి నిత్యానంద స్వామి లీలలు అందరికీ తెలిసినవే. దాదాపు వీరందరికీ రాజకీయ అండదండలతో, మాఫియాలతో సంబంధం ఉన్నట్లు అనేక సందర్భాలలో బయటకు పొక్కిన సందర్భాలున్నాయి.

ఈ మధ్యన ఎలక్ట్రానిక్ మీడియాలో బహుళ ప్రచారం పొందుతున్న రాందేవ్, ఆశారాం బాబాల ఆస్తులు కూడా కోట్లలోకి చేరుకుంటున్నాయి. నేరుగా రాందేవ్‌బాబా రాజకీయ పార్టీనే పెట్టాలనే ఆలోచనలో ఉన్నాడంటే ఆయన పవరెంతో ఆలోచించవచ్చు.

వక్రభాష్యం చెపుతూనే ఉంటారు. చదువుకున్నామని విర్రవీగే బ్యూరోక్రాట్లు, న్యాయకోవిదులమని భావించే అన్యాయకోర్టులు, అనారోగ్య డాక్టర్లు, అనాలోచిత విద్యావేత్తలు, దేశాన్నమ్ముకునే రాజకీయ (అ) నాయకులు వీరి చుట్టూ తిరుగుతూ, జపం చేస్తూ ప్రజాస్వామ్యాన్ని భ్రష్టు పట్టిస్తూనే ఉంటారు. ఇలా భ్రష్టు పట్టే జనం ఉన్నంత కాలం ఇలా బాబాలు పుట్టుకొస్తూనే ఉంటారు. ఈ కోవలోనే త్వరలోనే కర్ణాటకలోని మాండ్యా జిల్లాలో కావేరి నది తీరాన మరో బాబాను చూడబోతామన్న మాట!

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

*సామ్రాజ్యవాద దేశాలకు సింహస్వప్నంగా పరిణమించిన ఒసామా బిన్ లాడెన్ జీవితం, జీహాద్‌ల నేపథ్యం వివరిస్తున్నారు* **పి. ప్రసాద్**

# లాడెన్‌పై సామ్రాజ్యవాదుల నిందా ప్రచారాలు

అమెరికా సామ్రాజ్యవాదులు ఎట్టకేలకు ఒసామా బిన్ లాడెన్‌ను హతం చేశారు. కానీ అది వారికి ఘన విజయాన్ని అందించలేక పోయింది. పైగా పెను విషాదాన్నే మిగిల్చింది. లాడెన్‌ను తాము చంపినా, ఆయన నిర్మించిన అల్‌ఖైదా ప్రమాదం ఎప్పటివలెనే ఉందని అమెరికా అధికారికంగానే ప్రకటించింది. అమెరికన్ మేధావులు మరో ముందడుగు వేశారు. చరిత్రలో మున్నెన్నడూ లేనంతగా బలంగా యాభై దేశాలకు పైగా అల్‌ఖైదా విస్తరించిందన్నారు. ట్విన్ టవర్స్ కూల్చివేత నాటికంటే అది అనేక రెట్లు బలపడిందన్నారు. లాడెన్‌నూ 'ఇస్లాం ఉగ్రవాదాన్నీ' అంతం చేసే పేరిట అమెరికా పదేండ్ల క్రితం 'నిరంతర యుద్ధం' ప్రారంభించింది. ఆనాటితో పోల్చితే అమెరికా బలహీనపడితే ఇస్లాం తీవ్రవాదం మరింత బలపడినట్లు వారు వ్యాఖ్యానించారు. ప్రపంచ ప్రగతిశీల మేధావులను సైతం నివ్వెరపరుస్తున్న పరిణామాలివి.

లాడెన్‌తో పుట్టి, ఆయన మీదే ఇస్లాం తీవ్రవాదం ఆధార పడిందనుకున్న ప్రపంచ ప్రజల ప్రబల భావన (వరల్డ్ వైడ్ ఎస్టాబ్లిష్డ్ పబ్లిక్ ఒపినీయన్) తప్పని నేడు రుజువైంది. ఆయన మరణం వల్ల ఎలాంటి మౌలిక నష్టం జరగనంత ఉన్నత స్థాయికి 'ఇస్లాం తీవ్రవాదం' ఎదిగింది.

లాడెన్ భౌతిక కాయాన్ని ఏ ఒక్క ఇస్లాం దేశ భూభాగంలో ఖననం చేసినా కోట్లాదిమంది ప్రపంచ ముస్లింలకి అది ఆధునిక మక్కా అవుతుందని అమెరికా అంచనా వేసింది. అందుకే సముద్రంలో విసిరి పారేసింది. లాడెన్ అమరత్వం కూడా దురాక్రమణ శక్తులకు ఇంకా ఒక సజీవ భౌతిక, రాజకీయ ప్రమాదంగా కొనసాగే పరిస్థితులున్నాయని అర్థమవుతోంది. తాను మరణించినప్పటికీ, లాడెన్ భావజాలం (లాడెనిజం అంటున్నారు) ఎందుకంత ప్రబలశక్తిగా ఉంది? లాడెన్ మరణం ఈ ప్రశ్నను ప్రపంచం ముందుంచింది. తాను భౌతికంగా మరణిస్తూనే, ప్రపంచ రాజకీయ విశ్లేషకులందరి ఎదుట లాడెన్ సూటి ప్రశ్నను వదిలాడు. వీటికి సరైన సమాధానాలు చెప్పాల్సిన అగ్ని పరీక్షకు వారిని గురిచేశాడు.

ట్విన్ టవర్స్ కూల్చివేత తర్వాత ఏడాది తిరక్కముందే ఇస్లాం తీవ్రవాదం అంతమవుతుందని అంతర్జాతీయ రాజకీయ విశ్లేషకులు ఆనాడు అంచనా వేశారు. అది మఖలో పుట్టి, పుబ్బలో చచ్చే పుట్టకొక్కు వంటిదని వారు వ్యాఖ్యానించారు. దానిని ఇస్లాం దేశాల సామాన్య ప్రజలు ఆదరించరని కొందరు ప్రగతిశీల మేధావులు జోస్యం చెప్పారు. అది ఉగ్రవాదం మినహా, నిర్మాణయుతమైన ప్రజాప్రతిఘటన కాదని ఇంకొందరు సోషలిస్టు మేధావులు విశ్లేషించారు. ప్రపంచ కార్మిక వర్గ విప్లవాన్ని బలహీన పరచడంలో సామ్రాజ్యవాదానికి అదొక ఆయుధంగా ఉపయోగపడుతుందని కొందరు మార్క్సిస్టు పరిశోధకులు తేల్చి చెప్పారు. కానీ లాడెన్ మరణించి, ఈ వాదనలన్నింటినీ పునరాలోచనకీ, పునః సమీక్షకీ గురిచేశాడు.

పదేండ్ల పాటు దారుణ దురాక్రమణల పర్వం సాగించినా, లక్షల సైన్యాలతో మానవ మారణహోమం సాగించినా, ట్రిలియన్ల కొద్దీ డాలర్లను ఖర్చు చేసినా, మిలియన్ల జనాభాని కాందిశీకులను చేసినా, లక్షలాది మందిని నరమేధంలో చంపినా, వేల మందిని గ్వాంటినామా, అబూ గ్రెహెబ్ వంటి చిత్రహింస శిబిరాలలో అమానుషంగా హింసించినా, వందల మందిని ఉరికంబాలెక్కించినా... ఇస్లాం దేశాల్లో సాయుధ పోరాటాలు ఆగడం లేదు. ఆనాడు పుట్టకొక్కు పుట్టుకగా విశ్లేషించబడ్డ ఇస్లాం తీవ్రవాదమే ఒక అగ్రరాజ్యాన్ని (సోవియట్ యూనియన్) ఇరవై ఏండ్ల క్రితం కుప్పకూల్చింది. ఇప్పుడు మరో అగ్రరాజ్యాన్ని (అమెరికా) ఏకంగా ఆర్థిక సంక్షోభానికి గురి చేసింది. ఎవరు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా నేడు ఇస్లాం తీవ్రవాదం అంతర్జాతీయంగా ఓ రాజకీయ ప్రభావిత శక్తి. ముఖ్యంగా ఇస్లాం దేశాలలో అదొక తిరుగులేని నిర్ణయాత్మక సాయుధ రాజకీయ శక్తి. సకల దురాక్రమణల ఆధిపత్య శక్తులకి అదో విద్యుద్ఘాతం వంటిది. రాజకీయంగా ఇస్లాం తీవ్రవాదంతో విభేదించే శక్తులు సైతం గుర్తించి తీరాల్సిన సజీవ భౌతిక సత్యమిది.

కాకతాళీయంగానైనా ముస్లిం దేశాల నేలతల్లి గర్భంలోనే ప్రపంచ సహజ వనరులు సాపేక్షికంగా అధిక శాతం ఉన్నాయి. మొత్తం ప్రపంచ జనాభాలో ముస్లింలు 15 శాతం మందే ఉండొచ్చు. కానీ ప్రపంచ సహజ వనరుల్లో అక్కడే సగం ఉన్నాయి. ముఖ్యంగా చమురు, సహజ వాయువు వనరులు ముస్లిం దేశాలలోనే అత్యధికంగా ఉన్నాయి. ఈ సహజ వనరులే ముస్లిం దేశాలకి రాజకీయ శాపంగా మారాయి. ఇజ్రాయిల్ పుట్టుక, పాలస్తీనా విధ్వంసం, నాలుగు సార్లు అరబ్ - ఇజ్రాయిల్‌ల యుద్ధాలూ, అఫ్ఘన్, ఇరాక్‌ల దురాక్రమణలూ, సైనిక జోక్యాలూ, కీలుబొమ్మ ప్రభుత్వాల స్థాపనలూ, జాతి విద్వేషాలూ, మారణహోమాలూ... ఇవీ నేడు ముస్లిం దేశాల ప్రజలకి సోకాల్డ్ నాగరిక ప్రపంచమిచ్చిన కానుకలు. ఈ సుదీర్ఘ అణచివేతలు, వనరుల లూటీ, బానిసత్వం, అవమానాలు, అమానుషాల నుంచి పుట్టి పెరిగిన ప్రబల రాజకీయ శక్తే ఇస్లాం తీవ్రవాదం.

ముస్లిం దేశాల ప్రజలు మూర్ఖులనీ, ఛాందసవాదులనీ, ప్రగతి నిరోధకులనీ ప్రపంచ ప్రజలను నేడు అమెరికా మీడియా అపోహలకి గురిచేయగలిగింది. దురదృష్టవశాత్తూ కొన్ని ప్రగతిశీల ప్రజాతంత్ర, విప్లవ శక్తులు కూడా ఈ మీడియా ఫోబియాకు ఏదో మేరకు ప్రభావిత మయ్యాయి. కమ్యూనిజానికీ, సోషలిజానికీ, లౌకికవాదానికీ, జనతా ప్రజాస్వామ్యానికీ, ఆధునిక నాగరికతకీ, సామాజిక మార్పుకూ ముస్లింలు సాంప్రదాయ వ్యతిరేకులన్న ఓ నిర్ధారణ చేసిన వాళ్లు కూడా ఉన్నారు. కానీ ఇది పచ్చి అబద్ధమని గత చరిత్ర నిరూపించింది.

యూరప్ ఖండం అవతల కమ్యూనిస్టు పార్టీ విస్తరించిన తొలి రాజ్యాల జాబితాలో ఇస్లాం దేశాలు ముందు వరసలో ఉన్నాయి. చైనా, ఇండియాలతో పాటు ఇస్లాం దేశాలలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం జరిగింది. ఇరాన్, ఇరాక్, సిరియా, ఈజిప్ట్, లెబనాన్, కుర్దిస్తాన్, ఇండోనేషియాలలో కమ్యూనిస్టు విప్లవోద్యమాలు వేగంగా, విస్తృతంగా వేళ్లూనుకున్నాయి. ఇస్లాం ప్రజలు నిండు హృదయంతో ఎర్రజెండాను ముద్దాడిన గత ఘనచరిత్రను విస్మరించరాదు. అలాంటి ఉజ్వల చరిత్రగల ఇస్లాం మాగాణాలలో నేడు ఇస్లాం తీవ్రవాదం ఎందుకు వేళ్లూనుకుంది?

ప్రపథమ ప్రపంచ సోషలిస్టు విప్లవ కేంద్రం (సోవియట్ యూనియన్) 1956 తర్వాత ఇస్లాం దేశాల ప్రజలకు తీరని అపచారం చేసింది. వారు బాగా భంగపడ్డారు. తర్వాత అక్కడ కమ్యూనిస్టు పార్టీలు ఒకింత పునర్నిర్మాణం కావడంలో, మలి ప్రపంచ సోషలిస్టు విప్లవ కేంద్రం (జన చైనా) సహకరించింది. కానీ 1980 తర్వాత అది కూడా ద్రోహం చేసింది. పైగా 1979 డిసెంబర్‌లో సోవియట్ సైన్యాలు ఎర్ర జెండాలు ధరించిన సైనిక శకటాలతో అఫ్ఘనిస్తాన్‌ను దురాక్రమించాయి. ఇవన్నీ ఇస్లామిక్ దేశాల పీడిత ప్రజలకు కమ్యూనిజం పట్ల విముఖత కలిగించాయి. ఈ చారిత్రక రాజకీయ నేపథ్యంలో 'కమ్యూనిజం' స్థానంలో 'కమ్యూనలిజం' ఇస్లాం దేశాలలో సాయుధ ప్రతిఘటనా శక్తిగా ముందుకొచ్చింది.

సమకాలీన ప్రపంచంలో ఇస్లాం తీవ్రవాద పాత్ర గురించి మార్క్సిస్ట్ మహోపాధ్యాయుల బోధనల వెలుగులో గతి తార్కికంగా విశ్లేషించాల్సి ఉంది. అది మరో ప్రత్యేక వ్యాసంలో ప్రయత్నించుకుందాం. కానీ ఇటీవల ఇస్లామిక్ తీవ్రవాదం మీద సామ్రాజ్యవాద మీడియా సాగించిన నిందా ప్రచారానికి లాడెన్ కేంద్ర బిందువయ్యాడు. లాడెన్ రాజకీయ పాత్రను ఆయా రాజకీయ సంస్థలు తమ తమ దృక్కోణాలలో విమర్శించుకోవడం తప్పు కాదు. కానీ అలాంటి విమర్శలు గానీ, సమీక్షలు గానీ, పరిశోధనలు గానీ వాస్తవాల మీద ఆధారపడాలి. లాడెన్ చుట్టూ అల్లుకున్న అబద్ధాల మాటున దాగిన వాస్తవాలను చరిత్ర నుంచి వెలికితీసి బహిర్గతపరచడమే ఈ వ్యాస లక్ష్యం. ఇందులోని తొమ్మిది అంశాలు ఒక్కొక్క అధ్యాయంగా ఒక్కొక్క గ్రంథం రాయగలిగిన చరిత్ర ఉంది. కానీ అనేక పరిమితులు, పాఠకుల పఠనా సౌలభ్యాలను దృష్టిలో ఉంచుకొని అతి సంక్షిప్తంగా ఈ వ్యాసాన్ని అందిస్తున్నాను. తెలుగు సీమలో లాడెన్ రాజకీయ పాత్రను వాస్తవిక దృష్టితో ఒక కొత్త కోణంలో ఆవిష్కరించే చిన్న ప్రయత్నమిది.

## లాడెన్‌ను రాజకీయాలలోకి తెచ్చింది అమెరికాయేనా?

ఒసామా బిన్ లాడెన్‌ను తొలుత రాజకీయాలలోకి అమెరికాయే తెచ్చిందన్న ప్రచారం వాస్తవం కాదు. లాడెన్ ముజాహిదీన్‌గా అఫ్ఘనిస్తాన్‌లో అడుగు పెట్టడమే అతని తొలి రాజకీయ ప్రవేశంగా జరిగే ప్రచారం సత్యదూరం. 'అమెరికా కోసం – అమెరికా చేత, అమెరికా యొక్క' సృష్టే (ప్రొడక్ట్) లాడెన్‌గా నేడు అంతర్జాతీయ మీడియా ప్రచారం సాగిస్తున్నది. నిజానికి అఫ్ఘన్ ముజాహిదీన్‌గా మారడానికి ఆరేండ్ల ముందే లాడెన్ రాజకీయ రంగప్రవేశం చేశాడు. తన 16వ ఏట కళాశాల జీవితంలో ప్రవేశించడమే రాజకీయ ప్రవేశం జరిగింది. అది కూడా అమెరికా వ్యతిరేక రాజకీయాలే లాడెన్‌ను ఆకర్షించడం గమనార్హం. అంతే తప్ప అమెరికాయే రాజకీయ ఓనమాలు దిద్దినట్లు చెప్పడం వక్రీకరణే.

1973 అక్టోబర్‌లో పదిహేడు రోజులు జరిగిన నాల్గవ అరబ్ – ఇజ్రాయల్ యుద్ధం అరబ్ యువతరాన్ని రోడ్డెక్కించింది. ఆరు రోజులు జరిగిన మూడవ యుద్ధం (1967)లో అరబ్బులకి మిగిలించిన విషాదకరమైన ఓటమి, అవమాన భారాన్ని నాల్గవ యుద్ధం తొలగించలేదు. పైగా మరో పెద్ద అవమానాన్నే మిగిలించింది. ఈ కుంగుబాటు స్థితే అరబ్ దేశాల యువతరాన్ని, ముఖ్యంగా విద్యార్థి లోకాన్ని తీవ్రవాదం వైపు నడిపించింది. అలా తొలుత లాడెన్ రాజకీయాలలోకి వచ్చాడు.

1979 ఫిబ్రవరిలో ఇరాన్ ఇస్లామిక్ విప్లవం మధ్య ప్రాచ్యంలో అమెరికా ఆధిపత్యాన్ని సవాలు చేసింది. దానిని అరబ్బులపై పర్షియన్ల ఆధిపత్యానికి పునాది రాయిగా అమెరికా అరబ్బుల్లో విద్వేష భావాన్ని రెచ్చగొట్ట జూసింది. కాని ఖొమైనీ ప్రభుత్వం సాయుధ పాలస్తీనియన్ సంస్థ నేత యాసర్ అరాఫత్‌ను తొలిసారిగా అధికారికంగా తన దేశానికి ఆహ్వానించి, ఘనంగా గౌరవించింది. ఇరాన్ పర్షియన్ దేశం కాగా, పాలస్తీనియన్లు అరబ్బులు కావడం గమనార్హం. ఇరాన్ ఇస్లామిక్ విప్లవాన్ని పర్షియన్ జాతి దురహంకార ఉద్యమంగా చిత్రించాలన్న అమెరికా పాచిక పారలేదు. అరబ్బు దేశాల పాలకులైన షేకులు, అమీర్లు అమెరికాను అనుసరిస్తే, అరబ్ యువతరం ఇరాన్ ఇస్లామిక్ విప్లవాన్ని స్ఫూర్తిగా తీసుకుంది. ఈ కోవలోనే లాడెన్ రాజకీయాలలో ఎదిగాడు.

1979 మార్చ్‌లో క్యాంప్ డేవిడ్ ఒప్పందం జరిగింది. తమ గత ఓటములకు ఇజ్రాయల్‌పై ప్రతీకారం తీర్చుకోవాలన్న అరబ్ యువతరం దీన్ని విద్రోహ ఒప్పందంగా నిరసించారు. అమెరికా, ఇజ్రాయల్, ఈజిప్ట్‌ల మీద అరబ్ ప్రపంచం నిప్పులు కక్కింది. అందులో లాడెన్ కూడా ప్రభావితుడే.

సెంటో కూటమి నుంచి 1979 మార్చ్‌లో ఇరాన్ తొలుత వైదొలిగింది. తర్వాత కొద్ది నెలలకే టర్కీ, పాకిస్తాన్‌లు కూడా వైదొలిగాయి. 1979 సెప్టెంబర్‌లో సెంటో కూటమిని అమెరికా రద్దు చేసుకోక తప్పలేదు. ఇది అమెరికాకి చావుదెబ్బ. ఈ చర్యపట్ల అరబ్ యువతరం సంబరాలు చేసుకున్నది. అందులో లాడెన్ ఒకడు.

పై రాజకీయ పరిణామాలన్నీ అమెరికా పెత్తనాన్ని వ్యతిరేకించే దిశలో సాగినవే. వీటన్నింటిలో లాడెన్ క్రియాశీలంగా పాల్గొన్నాడు. ఇవన్నీ అల్‌ఖైదాను స్థాపించి అమెరికాపై జిహాద్ ప్రకటించిన తర్వాత లాడెన్ గురించి అమెరికా, సౌదీ అరేబియాలు తవ్వితీసి ప్రకటించిన సత్యాలే. ముజాహిద్దీన్‌గా అఫ్ఘనిస్తాన్ వెళ్లకముందే లాడెన్‌కు ఉగ్రవాద నేపథ్య చరిత్ర ఉందనీ, విద్యార్థి జీవితం నుంచే మొండితనంతో రహస్య

కార్యకలాపాలలో పాల్గొనేవాడనీ స్వయంగా సి.ఐ.ఎ. నే వెల్లడించింది. అందుకే లాడెన్‌ను రాజకీయాలలోకి అమెరికా తేలేదనీ, అమెరికా వ్యతిరేక విధానాలే తెచ్చాయనీ అర్థమవుతోంది.

**సి.ఐ.ఎ. ఆధ్వర్యంలో ముజాహిదీన్ శిబిరాలను లాడెన్ నిర్వహించాడా?**

సోవియట్ యూనియన్ దురాక్రమణకి వ్యతిరేకంగా అఫ్ఘనిస్తాన్ వెళ్లిన అరబ్ ముజాహిదీన్‌లకు లాడెన్ నాయకుడన్న ప్రచారం ప్రపంచ వ్యాప్తంగా జరిగింది. నిజానికి 1988 వరకూ లాడెన్ పేరు ప్రపంచానికి తెలియదు. అమెరికాను ప్రతిఘటించడానికి లాడెన్ సిద్ధపడ్డాక సోవియట్ యూనియన్ ప్రభుత్వం, దాన్ని అనుసరిస్తున్న వివిధ దేశాల సోషలిస్ట్ డెమొక్రటిక్ పార్టీలు (ఇండియాలో సిపిఐ, సిపిఎం వంటివి) తొలుత ఈ తరహా ప్రచారాన్ని సాగించాయి. ఏకధ్రువ అగ్రరాజ్యంగా అవతరించిన అమెరికా కూడా ఈ తరహా ప్రచారమే తనకి లాభిస్తుందని గుర్తించింది. అత్యధిక సహజ సంపదలు గల ముస్లిం దేశాల యువతకి లాడెన్ హీరోగా మారుతున్న పరిణామాన్ని అమెరికా పసిగట్టింది. ఒకప్పుడు తన ఏజెంటేనని ఉద్దేశ్యపూర్వకంగా అన్యాపదేశంగా ప్రచారం చేయించింది. తద్వారా లాడెన్ విశ్వసనీయతను యువతలో దెబ్బతీయ జూసింది. పరస్పరం యుద్ధాలు చేసుకున్న రెండు అగ్రరాజ్యాలూ లాడెన్ పట్ల ఒకే రకం ప్రచార బాణీని అందుకోవడం గమనార్హం. లాడెన్ మొన్న సోవియట్ దురాక్రమణపై పోరాడాడు. నిన్న అమెరికా దురాక్రమణపై పోరాడాడు. ఈ రెండు అగ్రరాజ్యాలు ఒకే గొంతుతో నేడు లాడెన్ మీద నిందా ప్రచారం సాగిస్తున్నాయి.

అఫ్ఘనిస్తాన్‌ను సోవియట్ యూనియన్ 1979 డిసెంబర్ చివరలో లక్ష సైన్యంతో దురాక్రమించింది. అమెరికా అనుకూల అరబ్ దేశాల ప్రభుత్వాలు అమెరికా వత్తాసుతో అరబ్ యువకులను 'జిహాద్'కు సిద్ధం చేశాయి. తొలి అరబ్ బృందాలన్నీ ప్రభుత్వాల ద్వారా వెళ్లాయి. వారితో లాడెన్ వెళ్లలేదు. సుమారు రెండేండ్లు గడిచిన తర్వాతే వెళ్లాడు. అఫ్ఘనిస్తాన్‌కు సరిహద్దున గల పాకిస్తాన్ భూ భాగంలోని ముజాహిదీన్ శిబిరాలలో లాడెన్‌ను ఉంచాలని ఐ.ఎస్.ఐ. అధికార్లు ప్రయత్నించారు. వారి మాట వినకుండా సరిహద్దు దాటి గెరిల్లా పోరాట ప్రాంతానికి వెళ్లాడు.

అరబ్ దేశాల నుంచి వచ్చిన గెరిల్లాలతో ప్రత్యేక సమన్వయం కొనసాగించాడు. లాడెన్ సౌదీ అరేబియాలో సంపన్న వంశానికి చెందిన ఉన్నత విద్యాధికుడు (సివిల్ ఇంజనీర్). అందువల్ల అత్యధిక అరబ్ గెరిల్లాలు లాడెన్‌ను అనుసరించారు. ఆనాడు ముజాహిదీన్‌కు నాయకత్వం వహిస్తున్న అఫ్ఘన్ నేతలు హెక్మత్యార్, రబ్బానీలతో పాటు సి.ఐ.ఎ., ఐ.ఎస్.ఐ.లకు కూడా లాడెన్ తలనొప్పిగా మారాడు. కీలుబొమ్మ అరబ్ ప్రభుత్వాలు పంపించిన అరబ్ గెరిల్లాలలో సగం మందిని లాడెన్ సమీకరించుకున్నాడు. (వారితోనే ఆల్ ఖైదాను తదనంతర కాలంలో స్థాపించడం గమనార్హం.)

అమెరికా, పాకిస్తాన్‌లకి వకాల్తాదారుగా, సి.ఐ.ఎ., ఐ.ఎస్.ఐ.ల ఏజెంట్‌గా అఫ్ఘనిస్తాన్ ముజాహిదీన్లకు ఆనాడు లాడెన్ సర్వసేనానిగా వ్యవహరించాడని సాగుతున్న ప్రచారం నిజం కాదు. అలా ఏజెంట్లుగా వ్యవహరించిన రబ్బానీ, దోస్తుమ్, మక్సూద్ తదితర నేతలందరూ చరిత్ర కాలగర్భంలో కలిసిపోయారు. చరిత్ర చెబుతున్న ఇలాంటి నగ్న సత్యాలను వక్రీకరించడంలో మొన్న సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదుల ప్రయోజనాలున్నాయి. నిన్న ఏకధృవ అగ్రరాజ్యమైన అమెరికా ప్రయోజనాలున్నాయి. వీరికి తోడు నేడు యూరప్, చైనా దేశాల ప్రయోజనాలు కూడా ఉన్నాయి. మూడో ప్రపంచ దేశాల ప్రజల్లో లాడెన్ విశ్వసనీయతను దెబ్బతీసే కుట్రలున్నాయి.

**అమెరికాతో శత్రుత్వానికి ఇస్లాం ఛాందసవాదం కారణమా?**

ఇస్లాం మత పిచ్చి తలకెక్కిన కారణంగానే అమెరికాతో లాడెన్ శత్రుత్వాన్ని కొని తెచ్చుకున్నాడట! ఈ ప్రచారాన్ని అమెరికా మీడియా భారీ స్థాయిలో సాగించింది. కొరివితో తల గోక్కున్న అరాచక, దుందుడుకు వాదిగా కూడా ఈ ప్రచారం సాగింది. నిజానికి 1979లో అఫ్ఘన్ దురాక్రమణ తర్వాత ఇస్లాం దేశాలలో అమెరికా మీడియా రెచ్చగొట్టినంత మతోన్మాదాన్ని ప్రపంచంలో మరెవ్వరూ చేపట్టలేదు. సౌదీ, పాక్ ప్రభుత్వాలు పోషించినంత ఇస్లామీ మత ఛాందస వాదాన్ని మరెవ్వరూ పోషించలేరు. అమెరికాను లాడెన్ వ్యతిరేకించడానికి అఫ్ఘనిస్తాన్ భూమాత గర్భంలోనే తగిన కారణాలు దాగి ఉన్నాయి. అక్కడ అమెరికా సాగించిన అనేక కుట్రలున్నాయి. వాటిని కప్పి పెట్టుకునేందుకే పచ్చి మత ఛాందసవాద అంశాన్ని ఒక బూచిగా చిత్రించ జూసింది. ప్రపంచ లౌకిక, ప్రజాతంత్ర, ప్రగతిశీల మేధావి వర్గాలను అపోహలకు గురిచేయ జూసింది. తద్వారా అఫ్ఘనిస్తాన్‌లో తన ఆధిపత్యాన్ని ప్రతిఘటిస్తున్న మిలిటెంట్ శక్తులను ఒంటరిపాలు చేయాలి. ప్రపంచ ప్రగతిశీల మేధో వర్గాల నుంచి సంఘీభావ అందదండలు అందకుండా చేసే పథకమిది. ఇందులో అమెరికా కొంత మేరకు విజయం సాధించింది.

అఫ్ఘన్ ప్రజల సమరశీల గెరిల్లా పోరాటం వల్ల ఆనాటి సోవియట్ సోషల్ సామ్రాజ్యవాద శక్తులు అఫ్ఘనిస్తాన్‌లో చావు దెబ్బతిన్నాయి. వేలాది మంది సోకాల్డ్ ఎర్రసైనికులు కుక్కచావు చచ్చారు. చచ్చిన శవాలను తీసుకెళ్లలేక వదిలేసింది. వాటిని హిందూకుష్ పర్వతాలలో గద్దలు, రాబందులు భక్షించాయి. తుదకు సోవియట్ యూనియన్ ప్రభుత్వం తన సైన్యాల ఉపసంహరణకు తీర్మానించింది. అయితే అది తన ఆఖరి మనుగడకై అమెరికాతో తెరచాటు దౌత్యానికి దిగింది. యూరప్ పెద్దలు మధ్యవర్తిత్వం నెరిపారు. అమెరికా, సోవియట్ యూనియన్ల మధ్య 1988లో 'సైన్యాల క్రమానుగత ఉపసంహరణ' (ఆర్డర్లీ రిట్రీట్మెంట్) కు ఒక రహస్య ఒప్పందం కుదిరింది. దీనికనుగుణంగా సోవియట్ యూనియన్, అమెరికా, అఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్‌ల మధ్య యు.ఎన్.ఒ. ఆధ్వర్యంలో మరో లీగల్ ఒప్పందం కుదిరింది. సోవియట్ యూనియన్ కీలుబొమ్మ నజీబుల్లా ప్రభుత్వం స్థానంలో, అమెరికా కీలుబొమ్మ రబ్బానీ ప్రభుత్వం ఒక క్రమ పరిణామంలో ఏర్పడడానికి ఈ ఒప్పందం అవకాశమిస్తుంది. ఈ అధికార మార్పిడి ఒప్పందాన్ని అఫ్ఘన్ ముజాహిదీన్ లలోని యువత వ్యతిరేకించింది. ఈ రెబెల్స్ పక్షాన స్ఫూర్తి దాతగా, మార్గదర్శకునిగా నిలిచిన వాడే లాడెన్. ఇది రాజకీయ కారణంతో ఏర్పడిన శతృత్వం మాత్రమే. మత ఛాందసవాదం కారణమని ఆరోపించడం అవాస్తవమే.

(ఇంకా వుంది)

*(రచయిత ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్ యూనియన్స్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి)*

వీ

*పాలకులు సామ్రాజ్యవాద కంపెనీల ప్రయోజనాలను నెరవేర్చే క్రమంలో జరుగుతున్న విధ్వంసాన్ని బోధ్‌ఘాట్ ప్రాజెక్ట్ ఉదాహరణగా వివరిస్తున్నారు* **బి.డి. దమయంతి**

# బస్తర్‌ను ముంచెత్తనున్న బోధ్‌ఘాట్ ప్రాజెక్ట్

**చు**ట్టూ ఎటు తిరిగి చూసినా పచ్చపచ్చని కొండలు. ఆ పచ్చదనం కంటికెంత ఇంపుగా ఉందనీ. ఆ పచ్చదనాన్ని చూసేనేమో ఆకాశంలోంచి మేఘమాలికలు దిగివచ్చి ఆ కొండల మీద కేరింతలు కొడుతున్నాయి. ఆ కొండల పాదాల వద్ద తొలకరి వర్షాలకు తడిసిన భూమిని దున్నుతూ స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ. వాళ్ల అదలింపుల ధ్వని ఆ సుందర దృశ్యానికి సహజమైన నేపథ్య సంగీతంలా ఉంది. దున్నుతున్న వాళ్లు అప్పుడప్పుడూ పశువుల మీద నుండీ, నాగలి కర్రు మీద నుండి చూపులు తిప్పి, దున్నడంతో పువ్వులా విచ్చుకున్న ఆ మట్టినీ, ఆ కొండలనూ కంటినిండా చూసుకుంటున్నారు. అవును మరి, ఆ మట్టి వాళ్లకు అన్నం కదా. ఆ కొండలు వాళ్లకు అండ కదా. ఆ కొండలు కూడా దున్నుతున్న ఆ మనుషులకేసి ఆత్మీయంగా చూస్తున్నాయేమో అనిపించింది. ఆ మట్టి కూడా దున్నుతున్న ఆ మనుషుల పాదాలను ఆర్తిగా ముద్దాడుతున్నట్లనిపించింది. ఎందుకో మరి? "బోధ్‌ఘాట్ ప్రాజెక్ట్ కడితే ఈ కొండలన్నీ మునిగిపోతాయి తెల్సా?" అన్నాడు నా పక్కనే ఉన్న ఒక కామ్రేడ్.

ఒక్కసారిగా నా కళ్ల ముందటి సుందర దృశ్యం కకావికలమైంది. ఈ కొండలు మునిగిపోతాయా? ఈ కొండలు మునిగిపోతే ఈ కొండల పాదాల వద్దనున్న ఈ మట్టి ఏమైపోతుంది? ఈ మట్టితో పెనవేసుకుపోయిన ఈ నాగలి ఏమైపోతుంది? నాగలిని సగర్వంగా మెడలపై మోస్తూ మట్టిని అన్నంగా మార్చుతున్న ఈ పశువులు ఏమైపోతాయి? పశువుల అదలింపుల నేపథ్య సంగీతాలేమైపోతాయి? ఈ మట్టి పరిమళాల పచ్చదనాల సుందర దృశ్యం ఏమవుతుంది? ఈ పచ్చదనాన్ని చూసి, పచ్చదనం తెచ్చే శీతల పవనాలను చూసి కేరింతలు కొట్టే ఈ మేఘమాలికలు ఏమయిపోతాయి? అన్నింటికంటే ఈ కొండల అండనూ, అన్నం పెట్టే మట్టినీ, పశువుల్నీ, నాగల్నీ పచ్చదనాన్నీ కోల్పోయి ఈ మనుషులు ఏమైపోతారు? ఈ కొండల్నీ, మట్టినీ, పచ్చదనాన్నీ, వీటన్నింటితో పెనవేసుకున్న ఈ మనుషుల జీవితాలను కబళిస్తోన్న బోధ్‌ఘాట్ గురించి తెల్సుకోవాలనిపించింది.

దండకారణ్యంలోని ఇంద్రావతి నదిమీద ప్రభుత్వం తలపెట్టిన జల విద్యుత్ ప్రాజెక్ట్ ఇది. 500 మెగావాట్ల విద్యుత్‌ను ఉత్పత్తి చేసే లక్ష్యంతో 1971లో మొదలైందీ పథకం. ఈ ప్రాజెక్ట్‌కు 209 కోట్ల ఖర్చు అవుతుందని 1979లో ప్లానింగ్ కమిషన్ అంచనా వేసింది. అదే సంవత్సరం పర్యావరణ మంత్రిత్వశాఖ ఈ ప్రాజెక్ట్‌కు అనుమతి నిచ్చింది. ఆరు సంవత్సరాల్లో దీని నిర్మాణం పూర్తి కావాల్సి వుండే. అయితే డబ్బు కేటాయించక పోవడం వల్ల ఈ ప్రాజెక్ట్ నిర్మాణం ఆగిపోయిందని చెప్తున్నారు.

ఈ ప్రాజెక్ట్ నిర్మాణానికి రుణ సహాయం చేయాల్సిందిగా 1983లో భారత ప్రభుత్వం సవరించిన అంచనాలతో ప్రపంచబ్యాంకు ముందు జోలె పట్టింది. ఫలితంగా 1984లో ప్రపంచబ్యాంకు 30 కోట్ల అమెరికన్ డాలర్ల అప్పు ఇవ్వడానికి అంగీకరించింది.

అయితే 1980లో ఆమోదం పొందిన వన సంరక్షణ చట్టం ప్రకారం ఈ ప్రాజెక్ట్ నిర్మాణాన్ని కొనసాగించాలంటే మళ్లీ ఒకసారి పర్యావరణ, అటవీ మంత్రిత్వ శాఖల అనుమతి పొందడం అనివార్యమైంది. ప్రభుత్వం వీటి అనుమతుల కోసం ప్రయత్నిస్తుండగానే ఈ ప్రాజెక్ట్‌కు వ్యతిరేకంగా ఆందోళనలు మొదలయ్యాయి. బోధ్‌ఘాట్ సంఘర్ష్ సమితి పేరుతో ప్రజా ఉద్యమం నడిచింది. ప్రభుత్వం పోలీసు బలగాల్ని ప్రయోగించింది. ఈ ఉద్యమానికి ముందుండి నాయకత్వం వహిస్తున్న హర్రాకోడేర్ గ్రామస్తుడైన రాంసింగ్ కశ్యప్‌ను పోలీసులు తీవ్రంగా కొట్టడంతో గాయపడి కొద్ది రోజుల తర్వాత కన్నుమూశాడు. ప్రజలు ఈ డ్యాంను అడ్డుకోవడం కోసం ఎన్నో చోట్ల ఊరేగింపులు తీశారు. అప్పటి రాజధాని భోపాల్ సహా ఎక్కడెక్కడికో తిరిగి ఎందరికో అర్జీలిచ్చారు. సామాజిక శాస్త్రవేత్తలూ, పర్యావరణవాదులూ, ప్రజాస్వామికవాదులూ ఈ ఉద్యమానికి గట్టి మద్దతునిచ్చారు. ఫలితంగా 1994లో ప్రభుత్వం ఈ ప్రాజెక్ట్ నుండి వెనక్కి తగ్గక తప్పలేదు.

అయితే ప్రస్తుతం 36 వేల కోట్ల రూపాయల అంచనా వ్యయంతో ఈ ప్రాజెక్ట్ నిర్మాణానికి ప్రభుత్వం తీవ్రంగా ప్రయత్నిస్తోంది. 2010 చివర్లో జిందల్ కంపెనీకి చెందిన ఐదుగురు సభ్యుల టీం ప్రతిపాదిత ప్రాజెక్ట్ సైట్‌ను పర్యవేక్షించి పోవడంతో ప్రభుత్వం ఈ డ్యాం నిర్మాణాన్ని ప్రైవేట్ కంపెనీకి కాంట్రాక్టుకు ఇవ్వబోతున్నదనే వార్తలు కూడ వచ్చాయి. అయితే ఈ ప్రాంత ప్రజలూ, పర్యావరణవాదులూ, ప్రజాస్వామిక వాదులూ ఈ ప్రాజెక్ట్‌ను వ్యతిరేకిస్తూ ఉద్యమిస్తున్నారు. సి.పి.ఐ. (మావోయిస్టు) కూడా ఈ ప్రాజెక్టుకు వ్యతిరేకంగా ప్రజా ఉద్యమాలను చేపడుతోంది.

### ఈ ప్రాజెక్ట్ పట్ల ఎందుకీ వ్యతిరేకత?

ఈ ప్రాజెక్ట్ వల్ల ఇంద్రావతి నదికి ఇరువైపులా ఉన్న ఆదివాసీల, ఇతర అటవీవాసుల జీవితాలు తీవ్రంగా ప్రభావితం కానున్నాయి. ఆ తీవ్రత ఎంత అంటే ఇప్పుడే మన ఊహకు అందనంత అని చెప్పుకోవాల్సి ఉంటుంది.

బస్తర్, బీజాపూర్, దంతెవాడ, నారాయణపూర్ జిల్లాల సరిహద్దు ప్రాంతంలో నిర్మించతలపెట్టిన ఈ ప్రాజెక్ట్ వల్ల లోహండిగూడ బ్లాక్‌లోని 15 గ్రామ పంచాయితీలు, కొండగాం బ్లాక్‌లోని 10 గ్రామ పంచాయితీలు, బీజాపూర్ బ్లాక్‌లోని 6 పంచాయితీలు, నారాయణపూర్ బ్లాక్‌లోని ఒక గ్రామ పంచాయితీ ప్రభావితం అవుతాయి. సాధారణంగా ఆదివాసీ ప్రాంతాల్లో ఒక్కో గ్రామ పంచాయితీ కింద 5-6 గ్రామాల దాకా ఉంటాయి. తక్షణం ఈ మూడు జిల్లాలకు చెందిన కనీసం 50 గ్రామాలు - కుదురు, హర్రాకొడేర్, కుడియనార్, బింత, కాక్‌నార్, మంగ్‌నార్, బేజా, బోదిలి, ఎరుపుండ్, కోసల్‌నార్, పీచికొడేర్, అమిలీపదర్, కోడేనార్, ధర్మబేడా, చందేలా, మహిమ, పాలం, పూస్‌పాల్, కోయెం, నెవుర్‌నార్, బెంగళూరు, భాట్‌పాల్, ఓల్‌నార్, ధుమర్‌ధర్, చివుర్‌బాయి, రాయగొంది, సతస్‌పూర్, కోరేకోట్, కోర్లి, కార్లకోట, బోదిలి, తుమిర్‌వాల్, రాకాసిమెట్ట, బోదిలి, కిల్లెం, పుంగార్‌పాల్, ముండిపదర్, కోర్మేల్, మాట్వాల్, రతెంగ, ఖడ్‌పడి, అద్వాల్, ఈటమెట్ట, ఘోటియ, టేడుం, పూస్‌పాల్ (మలేబాయి) తదితర గ్రామాలు మునిగిపోతాయి. క్రమంగా దాదాపు వంద గ్రామాలు మటుమాయం అవుతాయి. దాదాపు 70 వేల జనాభా ఈ ప్రాజెక్టుతో ప్రభావితం అవుతుంది. 13,750 హెక్టార్ల వ్యవసాయ భూమి ముంపుకు గురవుతుంది. 9,309 హెక్టార్ల విస్తీర్ణంలో అడవి కూడా మునిగిపోతుందని ప్రభుత్వమే చెబుతున్నది. బస్తర్ నయాగరాగా చెప్పుకోదగిన "చిత్రకోట్ జలపాతం" క్రమంగా ముంపుకు గురై మాయమైపోతుంది.

నిజానికి ప్రభుత్వం ఈ ఒక్క ప్రాజెక్ట్‌తోనే సరిపెట్టదల్చుకోలేదు. ఈ ప్రాజెక్ట్ ఒక పెద్ద వినాశనానికి నాంది వంటిది. దీని నిర్మాణం పూర్తయ్యాక దీనికి అనుబంధంగా మరెన్నో రిజర్వాయర్లను ప్రభుత్వం నిర్మించతలపెట్టింది. కుట్రు-1, కుట్రు-2, నుంగూర్-1, నుంగూర్-2, భోపాలపట్నం, ఇచ్చంపల్లి రిజర్వాయర్లు నిర్మించాలనే ప్రతిపాదనలు ఇప్పటికే ఉన్నాయి. ఇవన్నీ వాస్తవ రూపం ధరిస్తే గనుక ఐదు జిల్లాలుగా విభజితమై ఉన్న బస్తర్‌లోని ఒక పెద్ద భాగం మునిగిపోతుంది. మొత్తం అవిభాజిత బస్తర్ వైశాల్యంలో దాదాపు సగభాగంలో నివసించే ప్రజలు తమ అస్తిత్వాన్ని కోల్పోతారు. ప్రజలు తమ భూముల్ని, జీవనోపాధినీ కోల్పోయి పెద్ద ఎత్తున నిర్వాసితులు అవడం అనేది ఒక తీవ్రమైన సమస్య అయితే దీనికి తోడు మరెన్నో సమస్యలు ముందుకు వస్తాయి. పెద్ద ఎత్తున అడవులూ, కొండలూ మటుమాయం కావడం అనేది వర్షపాతాన్ని తీవ్రంగా ప్రభావితం చేస్తుంది. అంతేకాదు వైవిధ్యభరితమైన జంతుజాలం, పక్షులూ, విలువైన వృక్షసంపద, ఔషధ మూలికలూ అంతరించిపోతాయి. ఇదంతా పర్యావరణ సమతుల్యాన్ని దెబ్బతీసి తీవ్రమైన వినాశనానికి దారితీస్తుంది. ఆదివాసీ సంస్కృతికి కూడా తీవ్ర విఘాతం కలుగుతుంది.

## ప్రభుత్వం ఎందుకు ఈ ప్రాజెక్టు నిర్మాణానికి తలపెట్టినట్టు?

అది చెప్పుకుంటున్న ఉద్దేశ్యమైతే ఛత్తీస్‌గఢ్ ప్రజలకు విద్యుత్‌నూ, సాగునీరునూ అందించడం.

ప్రభుత్వం చెప్పే మాటల్లోని నిజానిజాలను తెల్సుకోవాలంటే ఛత్తీస్‌గఢ్ విద్యుత్ ఉత్పత్తి స్థితిగతులను తెల్సుకోవాలి. ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడక ముందు మధ్యప్రదేశ్‌లో భాగంగా ఉన్నప్పుడే ఛత్తీస్‌గఢ్ నుండి 36 శాతం విద్యుత్ ఉత్పత్తి అయ్యేది. అయితే ఛత్తీస్‌గఢ్ విద్యుత్ వినియోగం 24 శాతం ఉండింది. రమణ్‌సింగ్ తన ప్రభుత్వం సాధించిన గొప్పలుగా చెప్పుకునే వాటిలో భాగంగా విద్యుచ్ఛక్తి విషయంలో ఛత్తీస్‌గఢ్ రాష్ట్ర అవసరాలకు మించి ఉత్పత్తి చేస్తున్నదని ఎన్నోసార్లు మాట్లాడాడు. అంటే ఇక్కడ అదనపు ఉత్పాదకత ఉన్నట్టే. ఇక్కడ ఉత్పత్తి అవుతున్న విద్యుత్ ఇతర ప్రాంతాలకు ఎగుమతి అవుతున్నట్టే. ఈ లెక్కన అంటే ప్రజలకు విద్యుత్‌ను అందించడం అనేది ఉత్త అబద్ధం అన్నమాట. నిజంగా ప్రభుత్వానికి చిత్తశుద్ధి వుంటే ఇక్కడ ఉత్పత్తి అవుతున్న విద్యుత్‌ను ముందుగా ఇక్కడి ప్రజల వినియోగంలోకి తేవాలి. మరి బస్తర్‌లో ఒక పెద్ద భాగాన్ని ముంచేసి తయారు చేయబోయే విద్యుత్తు ఎవరి కోసం? అంటే ఇక్కడి సంపదల్ని దోచుకోవడానికి ఉవ్విళ్లూరుతున్న మైనింగ్ కంపెనీలకు, ఇతర కార్పొరేట్ సంస్థలకు మాత్రమేనని అర్థం చేసుకోవడానికి మరీ కష్టపడనవసరం లేదు. ఇక సాగునీరు అందించడం సంగతేంటి? జాంజ్‌గీర్-చాంపా జిల్లాలో 900 ఎకరాల సాగుభూమికి నీటినందిస్తున్న రోగ్‌దా డ్యాంను పూడ్చేసి ప్రైవేట్ కంపెనీకి అమ్మెయ్యడానికి సిద్ధపడ్డ రమణ్‌సింగ్ ప్రభుత్వం సాగునీరు అందించడం కోసమే బోధ్‌ఘాట్ డ్యాం కడతానని అంటే నమ్మేదెవరు? వంద గ్రామాలను ముంచి ప్రజలకు భూములే లేకుండా చేసి వాళ్లను తరిమేసి ఏ ప్రజలకు, ఎవరి భూములకు వీళ్లు సాగునీరును అందిస్తారు? నిజానికి ప్రజలకు సాగునీరును అందించాలనే మంచి బుద్ధే ప్రభుత్వానికి ఉంటే ఇంత భారీ ప్రాజెక్ట్ అవసరమే లేదు. గ్రామాలనూ, భూములనూ ముంచకుండానే చిన్న చిన్న ప్రాజెక్ట్‌ల ద్వారా ఆ పని చేయవచ్చు. మొత్తం బస్తర్‌నంతా సస్యశ్యామలం చేయొచ్చు.

ప్రజా ప్రయోజనం కోసమంటూ ప్రభుత్వం చెప్తున్నది నిజమేనా అని ఇంతగా తర్కించుకోవాల్సిన అవసరం మనకు ఎంత మాత్రమూ లేదు. ఎందుకంటే ప్రజా ప్రయోజనం అనే మాట పాలకవర్గాల డిక్షనరీలో అసలెన్నడూ ఉండదు కనుక.

మరి ఇంత వినాశనానికి తలపడుతూ కూడా ఈ ప్రాజెక్ట్ నిర్మాణానికి ఎందుకోసం పూనుకుంటున్నట్టు అంటే దళారీ నిరంకుశ బూర్జువాల, బహుళజాతి కంపెనీల ప్రయోజనాలను నెరవేర్చడానికి మాత్రమే. చాలా కాలంగా నిర్మాణ పనులు నిలిచిపోయిన ఈ ప్రాజెక్టుకు మళ్లీ ప్రయత్నాల్ని వేగిరపరుస్తున్న సమయం, బస్తర్ ప్రాంతంలో టాటా, ఎస్.ఆర్. తదితర కంపెనీలతో రమణ్‌సింగ్ ప్రభుత్వం స్టీల్‌ప్లాంట్ల స్థాపనకు ఎంఒయులు కుదుర్చుకున్న సమయం, వివాదాస్పద 'సల్వాజుడుం' మొదలైన సమయం ఒకటే కావడం కాకతాళీయమేమీ కాదు.

లోహండిగూడకు బోధ్‌ఘాట్ దగ్గరే ఉంటుంది. ఇక్కడే టాటా స్టీల్ కంపెనీ 10 వేల కోట్ల రూపాయల ఖర్చుతో స్టీల్ ప్లాంట్ నిర్మాణం కోసం జూన్ 2005లో రమణ్ ప్రభుత్వంతో ఒక రహస్య ఎంఒయు చేసుకుంది. 'రహస్య' ఒప్పందం ఎందుకంటే ఈ ఒప్పందంలో ఏముందో ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం రాష్ట్ర విధానసభలో కూడా వెల్లడించ నిరాకరించింది కాబట్టి. రమణ్‌సింగ్ ఆఖరుకు తన స్వంత పార్టీకి చెందిన అప్పటి ఎం.ఎల్.ఎ.లకు కూడా ఈ ఒప్పందంలోని షరతుల్ని వెల్లడించడానికి సిద్ధపడలేదు. సమాచార హక్కు ప్రకారం వేసిన ఒక రిట్‌కు కూడా ప్రజాస్వామ్యంగా ఎన్నికయినట్టు చెప్పుకునే రమణ్‌సింగ్ ప్రభుత్వం స్పందించలేదు. ఆఖరుకు శంకర్ మేధే అనే వ్యక్తి వేసిన ఒక ప్రజా ప్రయోజన వ్యాజ్యంపై కోర్టు ఆదేశంతో ప్రభుత్వం తప్పనిసరై డాక్యుమెంట్లను కోర్టుకు సమర్పించింది. ఈ ఎంఒయులో ఇతర

విషయాలతో పాటు టాటా కంపెనీకి రానున్న 50 ఏళ్ల పాటు సరఫరా చేయబోయే నీటి గురించి వివరంగా ఉంది.

కనుక లోహండిగూడలో ప్రతిపాదిత టాటా స్టీల్‌ప్లాంట్‌కు అవసరమైన విద్యుత్, నీటి అవసరాలను తీర్చడం ఈ ప్రాజెక్ట్ అసలు లక్ష్యం. ఒక్క టాటాకే కాదు, మరెన్నో కంపెనీల దాహాన్ని తీర్చే సామర్థ్యం ఈ ప్రాజెక్టుకు ఉంది. దంతెవాడకు సమీపంలో భాంసీ అనే గ్రామం వద్ద 6 వేల కోట్ల రూపాయల ఖర్చుతో నిర్మించతలపెట్టిన ఎస్.ఆర్. స్టీల్ ప్లాంటుకు కూడా ఈ ప్రాంతం దగ్గరే. దీనికీ విద్యుత్తూ, నీళ్లూ అవసరమే. కేశ్‌కల్ పర్వతాల్లోని కువ్వెమారి, బుధియారీమాడ్ ప్రాంతాల్లో బాక్సైట్ గనుల్ని తెరచి, అల్యూమినియం శుద్ధి కేంద్రాలకు అనుమతివ్వాలన్నా కూడా పెద్ద ఎత్తున విద్యుత్, నీళ్ల ఏర్పాటు చేసి పెట్టడం అవసరం. ఈ ప్రాంతంపై వేదాంత కంపెనీ ప్రత్యేకించి కన్నేసి ఉంది. అంతేకాదు మరిన్ని పెట్టుబడులను ఆకర్షించాలంటే కూడా ఇక్కడ మౌలిక సదుపాయాలు కల్పించడం అవసరం. అంటే ఇప్పుడు నిర్మించడానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్న కంపెనీలకూ, భవిష్యత్తులో రాబోయే కంపెనీలకూ, గనులకూ మౌలిక సదుపాయాలను కల్పించడానికి తప్ప బోధ్‌ఘాట్ ప్రాజెక్ట్ మరెందుకూ కాదు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ ప్రాజెక్టు ద్వారా జరిగే భారీ వినాశనం మరెన్నో చోట్లలో జరగబోయే మరింత భారీ వినాశనానికి తెర తీస్తుంది.

రెండుసార్లు విరమించుకుని కూడా నేడు మళ్లీ ఈ ప్రాజెక్ట్‌ను ముందుకు తెస్తున్నారంటే భారత పాలకులు నూతన ఆర్థిక విధానాలను రోజు రోజుకూ మరింతగా బరితెగింపుగా అమలు చేస్తున్నారనేది స్పష్టంగా అర్థమవుతుంది. అందుకే గతంలో వెనుకాముందాడిన పథకాలను కూడా నేడు దూకుడుగా అమలు చెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు. ముఖ్యంగా 2005 నుంచి ఛత్తీస్‌గఢ్ పాలకులు అనేక బహుళజాతుల కంపెనీలతో వందలాది ఎంఒయులను చేసుకున్న తర్వాత పరిస్థితి మరింతగా విషమించింది. గతంలో అనుమతులు లభించని ప్రాజెక్టులకు ఇప్పుడు అనుమతులు లభించడాన్ని కూడా ఈ నేపథ్యంలోనే అర్థం చేసుకోవాలి.

దళారీ నిరంకుశ బూర్జువా వర్గాలకూ, బహుళజాతి కంపెనీలకు అనేక ప్రయోజనాలను చేకూర్చగలిగే ఈ ప్రాజెక్ట్‌ను అడ్డుకుంటున్న శక్తి పోరాటం ఒక్కటే. ఈ ప్రాజెక్టునే కాదు, లోహండిగూడలో 10 గ్రామాల ప్రజల్ని నిలువ నీడ లేకుండా చేసే టాటా స్టీల్ కంపెనీని, భాంసీ దగ్గర 4 గ్రామాలను లేకుండా చేసే ఎస్.ఆర్. స్టీల్ ప్లాంటునూ అడ్డుకుంటున్నది, ఇంకా కువ్వెమారి, బుధియారీమాడ్, రావ్‌ఘాట్, చార్‌గాం, పల్లామాడ్, ఆమ్‌దాయ్‌మెట్ట, సూర్జాగఢ్ తదితర చోట్లలో ప్రజల్ని పెద్ద ఎత్తున నిర్వాసితుల్ని చేసి పర్యావరణాన్ని భారీగా వినాశనం చేసే ప్రాజెక్టుల్ని అడ్డుకుంటున్నది దండకారణ్య ప్రజల పోరాటమే. ప్రజలూ, ప్రజాస్వామికవాదులతో పాటు ఇరవైయేళ్ల నుంచి ఈ ప్రాంతంలో పని చేస్తున్న మావోయిస్ట్ పార్టీ బోధ్‌ఘాట్ వినాశనానికి వ్యతిరేకంగా పోరాడుతోంది, ఉద్యమాలను నిర్మిస్తోంది. ఈ ఉమ్మడి పోరాటం మాత్రమే ఈ ప్రాజెక్ట్‌కు ఆటంకంగా ఉంది. అందుకే ఈ పోరాటాలను అణచడానికే సామ్రాజ్యవాదుల, బహుళజాతి కంపెనీల, నిరంకుశ బూర్జువాల కనుసన్నల్లో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఈ ప్రాంతంలో నిర్బంధాన్ని రోజు రోజుకూ తీవ్రతరం చేస్తున్నాయి. గతంలో సల్వాజుడుం పేరుతో సాగించిన నిర్బంధానికి పరాకాష్టగా నేడు గ్రీన్‌హంట్‌ను ప్రయోగిస్తున్నాయి.

'బోధ్‌ఘాట్ బచావో జన్ వికాస్ మంచ్' అనే సంస్థ బోధ్‌ఘాట్ ప్రాజెక్టు నిర్మాణాన్ని వ్యతిరేకిస్తున్నది. కుదుర్ గ్రామానికి చెందిన ఈ సంస్థ అధ్యక్షుడు పదమ్‌సింగ్ కశ్యప్‌ను పోలీసులు అరెస్టు చేసి తప్పుడు కేసుల్లో ఇరికించారు. ఇంకా ఈ ఉద్యమ కార్యకర్తల్ని ఎందరి పైననో మావోయిస్టులుగా ముద్ర వేసి పోలీసులు జైలుపాలు చేశారు. చందేలా అనే గ్రామంలో ప్రజలు నిర్మించుకున్న బోధ్‌ఘాట్ అమరుల స్తూపాన్ని పోలీసులు కూలగొట్టించారు. గ్రామాల నుండి ప్రజల్ని పిలిపించి, అరెస్టు చేసి బోధ్‌ఘాట్ ప్రాజెక్టుకు వ్యతిరేకంగా పోరాడితే సహించేది లేదని పోలీసు అధికారులు బాహాటంగానే బెదిరిస్తున్నారు. ప్రభుత్వం ఇచ్చే నష్టపరిహారాన్ని స్వీకరించి గ్రామాల్ని, భూముల్ని వదిలేయడానికి సిద్ధం కావాలని హెచ్చరిస్తున్నారు. వినకుంటే బలవంతంగా తరిమేస్తామని చెబుతున్నారు. 'ఆపరేషన్ గ్రీన్‌హంట్'లో భాగంగా ఇక్కడికి చేరిన పారామిలిటరీ బలగాల్ని ఈ ప్రాంతంలోకి తరలిస్తున్నారు. కార్పెట్ సెక్యూరిటీ పద్ధతిలో ప్రతి 5-7 కిలోమీటర్లకు ఒకటి చొప్పున పోలీసు/ పారామిలిటరీ క్యాంపుల్ని ఏర్పాటు చేసి ఈ మొత్తం ప్రాంతాన్నంతా ఖాకీమయం చేసే ప్రక్రియ ప్రారంభించారు. రానున్న రోజుల్లో మరింత తీవ్రస్థాయిలో నిర్బంధాన్ని అమలు చెయ్యడానికి అన్ని సన్నాహాలూ పూర్తయ్యాయి. ఈ ప్రాంత ప్రజలు మాత్రం 'ప్రాణాలు పోయినా సరే గానీ బోధ్‌ఘాట్ డ్యాంను కట్టనివ్వం' అని నినదిస్తున్నారు. తమ న్యాయమైన పోరాటానికి అండదండగా నిలవాలని, తమపై సాగుతున్న గ్రీన్‌హంట్ దాడిని వ్యతిరేకించాలని దేశ ప్రజల్ని, ప్రజాస్వామికవాదుల్ని కోరుతున్నారు.

నేడు గ్రీన్‌హంట్‌ను వ్యతిరేకించడమంటే ప్రభుత్వాలు మావోయిస్ట్ పార్టీపై ప్రయోగిస్తోన్న అణచివేతను వ్యతిరేకించడం మాత్రమే కాదు. లేదా ఇక్కడి ఆదివాసీ ప్రజలపై జరుగుతున్న హింసను వ్యతిరేకించడం మాత్రమే కాదు. గ్రీన్‌హంట్‌ను వ్యతిరేకించడమంటే దేశాన్ని కొల్లగొడుతున్న విదేశీ, స్వదేశీ దోపిడీ శక్తులన్నింటినీ వ్యతిరేకించడం, యథేచ్ఛగా సాగుతున్న వనరుల దోపిడీని అడ్డుకోవడం. దేశ ప్రాకృతిక, పర్యావరణ, సాంస్కృతిక, సామాజిక వినాశనాన్ని అడ్డుకోవడం. ఒక్క మాటలో చెప్పాలంటే మనలని మనం కాపాడుకోవడం.

ఇప్పుడర్థమయింది నాకు ఈ కొండలు ఆ మనుషులను ఎందుకంత ఆత్మీయంగా చూస్తున్నాయో. ఈ మట్టి ఆ మనుషుల పాదాలను ఎందుకంత ఆర్తిగా ముద్దాడుతున్నదో.

నేను ఈ కొండలు ఆ మనుషులకు అండనుకున్నాను. నిజమే అందులో సందేహమేం లేదు. ఆ కొండలు లేకపోతే ఆ మనుషులు లేరు. కానీ ఆ మనుషులు లేకుంటే, ఆ మనుషులు చేస్తోన్న పోరాటం లేకుంటే ఆ కొండలు కూడా లేవు, ఇక మీదట ఉండవు. అందుకే ఆ మనుషులంటే ఆ కొండలకంత ఆత్మీయత. ఆ కొండలకు మనుషులూ, ఆ మనుషులకు కొండలూ పరస్పరం అండా దండా. వాటిని కాపాడుతూ వాళ్లూ, వాళ్లను కాపాడుతూ అవి.

ఆ మట్టి కూడా అంతే. ఆ మట్టి లేకుంటే వాళ్లకు అన్నం లేదు. ఆ మనుషులు లేకుంటే ఆ మట్టికి ఇక ఉనికే ఉండదు. ఆ పాదాలు మోపడానికి ఆ మట్టి కావాలి. ఆ మట్టి ఉనికి నిలబడాలంటే ఆ పాదాలు మడమ తిప్పకుండా దృఢంగా ఆ మట్టిపై నిలబడాలి. సల్వాజుడుంలనూ, గ్రీన్‌హంట్‌లనూ ఎదిరిస్తూ....

*(రచయిత విప్లవోద్యమ కార్యకర్త)* వీ

*ప్రాజెక్ట్‌ల అమలు కోసం ఇటీవల జరిగిన కొన్ని ప్రజాభిప్రాయ సేకరణలు నేపథ్యంగా పాలకుల దళారీ స్వభావాన్ని వివరిస్తున్నారు* **ఎన్. వేణుగోపాల్**

# ప్రజాభిప్రాయ సేకరణా? సంహరణా?

ప్రభుత్వం గాని, ప్రభుత్వ అనుమతితో ప్రైవేటు సంస్థలు, వ్యక్తులు గాని ఎక్కడైనా 'అభివృద్ధి పథకాలు' చేపట్టేటప్పుడు ఆ పథకాలు ఏ ప్రాంత ప్రజల జీవితంపై, ఉపాధిపై, వనరులపై, పర్యావరణంపై ప్రభావం వేసే అవకాశం ఉందో ఆ ప్రజల అభిప్రాయాలు సేకరించి, ఆ అభిప్రాయాలకు అనుగుణంగా పథకాలలో మార్పులు, చేర్పులు చేయాలని ప్రజాసంక్షేమ చట్టాలు చెపుతాయి. నిర్దిష్టంగా అటవీ (సంరక్షణ) చట్టం (1980), పర్యావరణ (పరిరక్షణ) చట్టం (1986), షెడ్యూల్డ్ ప్రాంతాల పంచాయత్ విస్తరణ చట్టం (1996) వంటి చట్టాలు, కేంద్ర ప్రభుత్వ పర్యావరణ, అటవీ మంత్రిత్వ శాఖ వేరువేరు సమయాలలో జారీ చేసిన ఉత్తర్వులు ప్రతి పథకానికీ పర్యావరణ ప్రభావ మదింపు అవసరమని నిర్దేశించాయి. ఆ మదింపులో ప్రజాభిప్రాయ సేకరణ అనే ప్రక్రియ తప్పనిసరిగా ఉండాలని 1997 నుంచీ నిర్దేశిస్తున్నారు. ఆ ప్రజాభిప్రాయ సేకరణ ఎలా జరపాలో ఆ చట్టాలు, వేర్వేరు ప్రభుత్వ ఉత్తర్వులు స్పష్టంగా, నిర్దిష్టంగా నిర్దేశించాయి.

ఏదైనా పథకం గురించి ప్రభుత్వంగాని, ప్రైవేటు పెట్టుబడిదారులు గాని ఆలోచించి, ఆ పథకానికి తగిన స్థలం ఎంపిక చేసుకోగానే, ఆ పథకం వల్ల ఆ స్థలంలోని ప్రజలపై, పర్యావరణంపై పడే ప్రభావం గురించి మదింపు నివేదికను తయారు చేయాలి. లేదా చేయించాలి. ఆ నివేదికతో ఆ రాష్ట్ర కాలుష్య నియంత్రణ మండలికి దరఖాస్తు చేసి వారి దగ్గరినుంచి అనుమతి సంపాదించాలి. అప్పుడు రాష్ట్ర ప్రభుత్వ కాలుష్య నియంత్రణ మండలి ఆ పథకం అమలయ్యే ప్రాంతంలో ప్రజాభిప్రాయ సేకరణ నిర్వహించాలి. ఆ సమావేశాన్ని స్థానిక జిల్లా కలెక్టర్ గాని, కలెక్టర్ ప్రతినిధి గాని నిర్వహించాలి. రాష్ట్ర కాలుష్య నియంత్రణ మండలి ప్రతినిధి, రాష్ట్ర ప్రభుత్వంలో పర్యావరణానికి బాధ్యత వహించే అధికారి, స్థానిక సంస్థల ప్రతినిధులు, ప్రజా ప్రతినిధులు, స్థానిక ప్రజలు, పర్యావరణ బృందాలు ఈ ప్రజాభిప్రాయ సేకరణలో పాల్గొనాలి. ప్రభుత్వ ఆధ్వర్యంలోని పర్యావరణ పరిశీలనా కమిటీ ఈ ప్రజాభిప్రాయ సేకరణ నివేదిక ఆధారంగానే ఆ పథకాన్ని అనుమతించవచ్చునా, నిరాకరించవలసి ఉంటుందా, మార్పులు సూచించవలసి ఉంటుందా నిర్ణయిస్తుంది, అంటే చట్ట ప్రకారం ప్రజాభిప్రాయ సేకరణ నివేదిక మీద నిర్ణయం జరిగేదాకా ఒక పథకం పని మొదలు కావడానికే వీలు లేదు.

కాని దేశంలో ఇంతవరకూ జరిగిన వందలాది ప్రజాభిప్రాయ సేకరణలలో ఒక్కటైనా నిజంగా ప్రజాభిప్రాయాన్ని సేకరించడానికి జరగలేదు. పెట్టుబడిదారులు, 'అభివృద్ధి పథకాల' మదుపుదార్లు, బహుళజాతి సంస్థలు, అధికారులు, ప్రభుత్వాలు కోరుకున్న ఫలితాలు రాబట్టడానికి తూతూ మంత్రంగానే ఈ ప్రజాభిప్రాయ సేకరణలను జరుపుతున్నారు. ప్రజాభిప్రాయ సేకరణలను నిబంధనల ప్రకారంగాని, ప్రజానుకూలంగా గాని జరపడం లేదు. నిజంగా ఆ పథకం వల్ల నష్టపోయే ప్రాంతాలకు దూరంగా సమావేశాలు నిర్వహించడం, ఆ పథకంవల్ల లాభపడే పెట్టుబడిదారులకు అనుకూలమైనచోట నిర్వహించడం, వ్యతిరేకంగా మాట్లాడతారనుకున్నవాళ్లను రాకుండా చేయడం, అనుకూలంగా మాట్లాడే దళారులను, దొంగ సాక్షులను తయారు చేసి పెట్టుకోవడం, సమావేశ స్థలంలో విపరీతంగా పోలీసులను మోహరించి ప్రజలను భయపెట్టడం, వ్యతిరేకంగా మాట్లాడేవారికి, పథకం వల్ల జరిగే నష్టాలను వివరించేవారికి తగినంత సమయం ఇవ్వకపోవడం, వారిని బెదిరించడం, వారు స్థానికులు కాదని, ఆ రంగంలో నిపుణులు కాదనీ అభ్యంతరాలు చెప్పడం, చిట్టచివరికి వ్యతిరేకాభిప్రాయాలన్నిటినీ అణచివేసి ప్రజాభిప్రాయ సేకరణలో అనుకూల అభిప్రాయాలే వచ్చాయని నివేదికలు తయారు చేయడం ఆనవాయితీ అయింది. అంతకన్న ఘోరంగా ప్రజాభిప్రాయ సేకరణ జరపడానికి కొన్ని సంవత్సరాల ముందుగానో, నెలల ముందుగానో ఆ పథకాల పనులు ప్రారంభమై పోతున్నాయి. తవ్వకాలు, నిర్మాణాలు, కాంట్రాక్టర్లకు చెల్లింపులు, అవసరమైన సామగ్రి సేకరణ జరిగిపోతున్నాయి. అలా వందల కోట్ల రూపాయలు ఖర్చయిన తర్వాత ప్రజాభిప్రాయ సేకరణ జరపడం అంటే అది కేవలం నామమాత్రమే తప్ప చట్టబద్ధం కాదు.

ప్రజాభిప్రాయ సేకరణ పేరిట ప్రభుత్వాలు, పాలకులు ఎన్ని ఘోరాలు జరుపుతున్నారో, ప్రజాభిప్రాయాన్ని సంహరించడానికి, ప్రజాభిప్రాయాన్ని వినిపించేవారిని అణచివేయడానికి, ప్రజాభిప్రాయం అనేదాన్ని మసిపూసి మారేడుకాయ చేయడానికి ఎలా ప్రయత్నిస్తున్నారో తెలుసుకోవడానికి ఈ నెలలో రాష్ట్రంలో జరిగిన మూడు ప్రజాభిప్రాయ సేకరణ సమావేశాలు ఉదాహరణగా నిలుస్తాయి.

వీటిలో మొదటిది డా. బి ఆర్ అంబేద్కర్ ప్రాణహిత – చేవెళ్ల సుజల స్రవంతి ఎత్తిపోతల పథకం అనే రు. 40 వేల కోట్ల పథకానికి సంబంధించినది. ఈ పథకం ఆదిలాబాద్ జిల్లా లోని తుమ్మిడిహట్టి నుంచి రంగారెడ్డి జిల్లా చేవెళ్ల వరకూ ప్రతిపాదిస్తున్న 340 కి.మీ. కాలువలకు, సొరంగాలకు, గొలుసు జలాశయాలకు సంబంధించినది.

తెలంగాణలో ఏడు జిల్లాల ద్వారా సాగే ఈ పథకం లక్షలాది మంది ప్రజలను ప్రభావితం చేస్తుంది. భూములనుంచి, ఉపాధి నుంచి నిర్వాసితులను చేస్తుంది. దాదాపు ఒక లక్ష ఎకరాల భూమి ముంపుకు గురవుతుంది.

అయినా ఎటువంటి ప్రజాభిప్రాయ సేకరణ జరగకుండానే, అప్పటి ముఖ్యమంత్రి రాజశేఖర రెడ్డి సరిగ్గా ఎన్నికల ముందు నవంబర్ 2008లో ఈ పథకానికి చేవెళ్లలో శంకుస్థాపన చేశాడు. నాలుగేళ్లలో ఈ పథకం పూర్తవుతుందన్నాడు. అప్పుడే బడ్జెట్ కేటాయింపులు, టెండర్లు, కాంట్రాక్టర్లకు చెల్లింపులు మొదలయ్యాయి. ఈ ప్రాజెక్టు నమూనా తయారీ కోసం కన్సల్టెంట్లకు రు. 1100 కోట్లు ఇవ్వాలని నిర్ణయించారని, చిన్నమెత్తు పని కూడ జరగకముందే రు. 600 కోట్లు ఇచ్చేశారని, స్వయంగా శాసనసభలో ప్రజా పద్దుల కమిటీ ఎత్తిచూపి తప్పుపట్టింది. ఈ దొంగల దోపిడీ ప్రారంభమైన రెండున్నర సంవత్సరాల తర్వాత ప్రజాభిప్రాయ సేకరణ తతంగం మొదలయింది. ఆదిలాబాద్, నిజామాబాద్, కరీంనగర్, మెదక్, నల్లగొండ, వరంగల్, రంగారెడ్డి జిల్లాలలో ఏప్రిల్ 19 నుంచి మే 10 వరకూ ప్రజాభిప్రాయ సేకరణలు జరపాలని రాష్ట్రప్రభుత్వ కాలుష్య నియంత్రణ మండలి నిర్ణయించింది. అందులో భాగంగా ఏప్రిల్ 30న కరీంనగర్ జిల్లా ఇల్లంతకుంట ప్రాథమిక ఆరోగ్య కేంద్రం సమీపంలో బహిరంగ మైదానంలో ఈ సమావేశం జరిగింది.

ఈ ప్రాణహిత - చేవెళ్ల ఎత్తిపోతల పథకం ఆర్భాటంగా ప్రారంభమై, కంట్రాక్టర్ల, రాజకీయ నాయకుల జేబులు నింపడానికే సాగుతున్నది గాని దానివల్ల ప్రజలకు ఒరగబోయేదేమీ లేదనే విమర్శలు మొదటినుంచీ ఉన్నాయి. ఎక్కడినుంచి ఎన్ని నీళ్లు ఎత్తిపోస్తామంటున్నారో అక్కడ అన్ని నీళ్లు లేవు. ఉన్నా వాటిని ఎత్తిపోయడానికి అవసరమయ్యే విద్యుచ్ఛక్తి లేదు. కొత్త విద్యుత్ కేంద్రాలు ఏర్పాటు చేసినా, నీళ్లు తీసుకునే చోటినుంచి చేర్చవలసిన చోటికి ఉన్న అంతరం వల్ల అది సులభంగా సాధ్యమయ్యే పని కాదు. ఈ దారిలో కాలువల వల్ల, సొరంగాలవల్ల, కొత్త జలాశయాల వల్ల (అవి నిండకపోయినా) ప్రజలు కోల్పోయిన భూమి, నిర్వాసిత సమస్య, పునరావాస సమస్య తీర్చడానికి ప్రభుత్వం దగ్గర ఎటువంటి ఆలోచనా లేదు. అవన్నీ తర్వాత, ఇప్పుడైతే కాంట్రాక్టర్లకు డబ్బులు అందించవచ్చునని, వాటిలోంచి తమ ముడుపులు దండుకోవచ్చునని రాజకీయ నాయకులు, ప్రజాప్రతినిధులు తలపోస్తున్నారు. ఈ దీర్ఘకాలిక ప్రశ్నలు ఎలా ఉన్నా, ఈ ప్రాజెక్టు పనులలో భాగంగా కాంట్రాక్టర్లు ఇల్లంతకుంట, అనంతగిరి గ్రామాలలో సొరంగాల కోసం భూమిని తవ్వి, పక్కన మట్టిదిబ్బలు పోశారు. అందువల్ల తవ్వకంలోనూ, మట్టి దిబ్బల వల్లా భూమి కోల్పోయిన గ్రామాల రైతులు ప్రభుత్వం మీద, అధికారుల మీద, కాంట్రాక్టర్ల మీద ఆగ్రహంగా ఉన్నారు. ప్రజాభిప్రాయ సేకరణతో వారి ఆగ్రహ ప్రకటనకు అవకాశం దొరికింది.

ఆ సమావేశంలో ప్రజలు, ప్రజల తరఫున సామాజిక కార్యకర్తలు లేవనెత్తిన అనేక ప్రశ్నలకు అధికారులు సమాధానాలు చెప్పలేదు. ఏదో ఒక రకంగా ఎన్నికలలో గెలిచినంత మాత్రాన తమను తాము ప్రజా ప్రతినిధులమని చెప్పుకునేవారిలో ఒకరిద్దరు మాత్రం ఆ సమావేశంలో ప్రజాప్రతినిధులుగా కాక కాంట్రాక్టర్ల ప్రతినిధులుగా, ప్రభుత్వ ప్రతినిధులుగా వ్యవహరించారు. ప్రశ్నలు వేసిన వారిని అడ్డుకున్నారు. ఎదురు ప్రశ్నించారు. ప్రాజెక్టు నష్టాలను వివరిస్తున్నవారి ఉపన్యాసాలను మధ్యలో ఆపివేశారు. (ఈ ప్రజాభిప్రాయ సేకరణ ఎంత హాస్యాస్పదంగా జరిగిందో తెలుసుకోవాలంటే ఎవరైనా యూట్యూబ్ మీద ఉన్న పదిహేను నిమిషాల చిత్రీకరణను చూడవచ్చు). చివరికి ఈ పథకం గురించి సంపూర్ణ అధ్యయనం చేసి, శాస్త్రీయంగా, ప్రజానుకూలంగా తన వాదనలు వినిపిస్తున్న శాతవాహన విశ్వవిద్యాలయ అధ్యాపకురాలు సూరేపల్లి సుజాతను ఒక శాసనసభ్యుడు వ్యక్తిగతంగా, నీచంగా దూషించాడు. రాయడానికి వీలులేని బూతులు ప్రయోగించాడు. తన అనుచరులను ఆమె మీదికి ఉసిగొల్పాడు. ఆమె స్థానికురాలు కాదు గనుక, బాధిత రైతు కాదు గనుక మాట్లాడడానికి వీలు లేదన్నాడు. అధ్యాపకురాలిగా ఆమె పని విద్యార్థులకు పాఠాలు చెప్పడమే తప్ప, ఇటువంటి చోట మాట్లాడడం కాదన్నాడు. అంతకుముందు కొందరు ప్రజాప్రతినిధులు ప్రాజెక్టు గురించి సరిగానే స్పందించినప్పటికీ, ఈ దూషణ పర్వం కొనసాగుతుంటే మాత్రం మౌనంగా ఉండి పోయారు.

తన అనుభవం గురించి ఆమె మాటల్లోనే చెప్పాలంటే, 'అసలు నేను చేసిన తప్పు ఏమిటో నాతో సహా అక్కడ ఉన్న ఎవరికీ అర్థం కాలేదు. ప్రజాభిప్రాయ సేకరణలో ప్రజలు మాట్లాడరా? ప్రశ్నించరా? ఆయన చెప్పిన అభ్యంతరాలు నాది ఈ జిల్లా కాదని. నేను రైతును కాదని. పాఠాలు తప్ప ఇంకో పని నేను చేయకూడదని. మరి ఎవరు ఏ పని చేయాలో ఆయన సెలవు ఇవ్వలేదు. ఈ తతంగం అంతా చూస్తున్న మీడియా మాత్రం కనీసం రిపోర్ట్ చేయలేదు. ఒకరో ఇద్దరో కాస్త రాశారు. రెండోరోజు ప్రజాసంఘాల నిరసనకి పత్రికలూ రాయక తప్పలేదు. అంటే మీడియాకి, ప్రజాప్రతినిధులకి, పార్టీలకి న్యాయకోణం గాని, జెండర్ కోణం గాని ఉన్నాయా అని ప్రశ్న వేసుకోవాలి. ఇక్కడ కులం దృష్టి లోంచి చూడడం కాదు, ఒక మహిళగా, బేలగా కూడ కాదు. సమస్య గురించి ఎవరు మాట్లాడాలన్నదే అసలు సంగతి.... అంతో ఇంతో చదువుకొన్న నా పరిస్థితే ఈవిధంగా ఉంటే మరి మామూలు మనుషులు, ఆడవాళ్ల పరిస్థితి?'

'ఇక్కడ జరిగిన సంఘటన తెలంగాణలో, ఇక్కడి ప్రజాప్రతినిధుల సమక్షంలో, ఇక్కడి వనరుల కోసం ఇక్కడి వ్యక్తులు ప్రశ్నించారు. కాని ఫలానా ఆయన దళిత ఎమ్మెల్యే కాబట్టి నేను గాని, ఎవరు గాని మాట్లాడొద్దని ఎన్నో అభ్యర్థనలు. న్యాయం కోసం మాట్లాడని వాడు నాయకుడు ఎట్లా అవుతాడు? న్యాయం తరువాతనే కులం, మతం, ప్రాంతం కదా? ... ఈ ప్రపంచంలో అన్యాయాన్ని ఎదిరించే హక్కు ప్రతి ఒక్కరికీ ఉంది, దానికి వీసా, పాస్‌పోర్ట్ అవసరం లేదు. ఇక్కడి పోలీసు అధికారులు నాకో కొత్త పాఠం చెప్పారు: నేను ప్రజల దగ్గరికి వెళ్లకూడదట, ఏదైనా కోర్టులో మాత్రమే తేల్చుకోవాలట. చిన్న పాటి బెదిరింపు. ఇంకా విచిత్రం ఏమంటే, ఒక కాంట్రాక్టర్ వచ్చి ఇక్కడ రెండు సంవత్సరాలుగా పని చేస్తుంటే, భూములు తీసుకొని మట్టి దిబ్బలుగా మారుస్తుంటే, ప్రజాప్రతినిధులు మాకు ఏమి తెలియదు అనడం విడ్డూరం కాదా?...'

'ఇక మరొక ప్రజాభిప్రాయ సేకరణ విశాఖపట్నం జిల్లా డుంబ్రిగూడ మండలం సరాయి గ్రామంలో మే 10న జరగబోయి, ప్రజా ఆగ్రహం వల్ల ఆగిపోయింది. ఆ గ్రామంలోని సర్వే నం. 122లో చైనా క్లే అనే ఖనిజాన్ని తవ్వుకునేందుకు ముచ్చిక భూదేవి అనే ఆదివాసి స్త్రీ తలపెట్టిన పథకం గురించి ప్రజాభిప్రాయ సేకరణ అది. అక్కడ

దాదాపు పదహారు హెక్టార్ల భూమిలో 60 లక్షల టన్నుల చైనా క్లే ఖనిజం ఉందని అంచనా. ఆ ఖనిజానికి ప్రస్తుత మార్కెట్ విలువ ఆరువందల కోట్ల రూపాయల పైనే. ఆ ఖనిజం పింగాణీ పాత్రల తయారీలో, రంగులు, కాగితం, రబ్బర్, సిరామిక్, గాజు, ఫైబర్ పరిశ్రమల్లో ఉపయోగపడుతుంది. ఒక టన్ను ధర కనీస పక్షం వెయ్యి రూపాయలు ఉంటుందని అంచనా. ఏడాదికి పదిహేను వేల టన్నులు తవ్వుకోవడానికి ఆంధ్రప్రదేశ్ ఖనిజాభివృద్ధి సంస్థ దరఖాస్తుదారుకు ఇప్పటికే అనుమతినిచ్చింది. షెడ్యూల్డ్ ప్రాంతాల పంచాయత్ విస్తరణ చట్టం ప్రకారం గ్రామసభ ఆమోదం ఉంటేనే ఈ అనుమతి ఇవ్వాలి. అప్పుడు కూడ వ్యక్తుల పేర్ల మీద కాక ఆదివాసుల సహకార సంఘాలకు ఇవ్వాలి. కాని గ్రామస్తులలో ఎవరికీ తెలియకుండానే ఈ అనుమతులు మంజూరయ్యాయి. బేనామీ పేరుతో దాఖలయిన దరఖాస్తుతో పాటు గ్రామసభ తీర్మానం చేసినట్టు తప్పుడుపత్రం కూడ సృష్టించి అనుమతి సంపాదించారు. ఈ అక్రమాలన్నీ అయిన తర్వాత, ఆ అనుమతిని ఖరారు చేయడం కోసం కేవలం తూతూ మంత్రంగా ప్రజాభిప్రాయ సేకరణ జరప తలపెట్టారు.

నిజానికి ఈ ఖనిజం దుంబ్రిగూడ మండలంలో కనీసం 24 గ్రామాలలో ఉందని అంచనా. సరాయి గ్రామంలోని ఒక సర్వే నంబర్‌లో తవ్వకాలను ప్రయోగాత్మకంగా ప్రారంభించి, మొత్తంగా మండల మంతటికీ విస్తరించాలని, మొత్తంగానే ఏజెన్సీలో ఉన్న అనేక విలువైన ఖనిజాలను తవ్వుకుపోవాలని ఖనిజ మాఫియా ఆలోచన. స్థానిక రాజకీయ నాయకులు ఈ ఖనిజ మాఫియాకు ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరిస్తున్నారు.

తమ ప్రాంతం నుంచి ఖనిజ నిలువలను తవ్వుకుపోవడానికి సాగుతున్న కుట్రలను ఎప్పటి నుంచో గమనిస్తూ, వ్యతిరేకిస్తున్న విశాఖ ఏజెన్సీ ఆదివాసులు ఈ చైనా క్లే తవ్వకాల ప్రతిపాదన మీద కూడ నిరసన తెలిపారు. దానితో ప్రభుత్వం ప్రజాభిప్రాయ సేకరణను వాయిదావేసి, ఆదివాసులను చల్లార్చే ప్రయత్నాలు మొదలుపెట్టింది. ప్రజాభిప్రాయ సేకరణ వాయిదా పడిందని తెలియక కొంత, అలా ప్రకటించి కూడ దొంగచాటుగా అధికారులు వస్తారేమోనని కొంత, ఆదివాసులు చెట్లు కొట్టి రోడ్లకు అడ్డంగా పడేసి, గ్రామానికి దారి మూసేశారు. ప్రజాభిప్రాయ సేకరణ జరగవలసిన సమయానికి గ్రామంలో గుమిగూడారు. వారిని తవ్వకాలకు అనుకూలం చేయడం కోసం అక్కడికి వెళ్లిన స్థానిక శాసనసభ్యుడిని, మండల ప్రజాపరిషత్ సభ్యుడిని ఆదివాసులు నిలదీశారు. కాంట్రాక్టర్ల దగ్గర, ఖనిజ మాఫియాల దగ్గర డబ్బు తీసుకుని, ఆదివాసుల పేర్లతో బేనామీ దరఖాస్తులు చేయించి ఖనిజ నిలువలు కొల్లగొడుతున్నారంటూ ఆదివాసులు 'ప్రజా ప్రతినిధులను' నిలదీసి తూర్పారబట్టారు. దాడిచేశారు. ఆదివాసి మహిళలే ముందు నిలిచి కర్రలు పట్టుకుని ఎంపిపిని వెంటాడారు, పేడ చల్లారు. రాళ్లు, గొడ్డళ్లు, విల్లంబులు, కత్తులు పట్టుకుని తరిమికొట్టారు. గాయపడి, చొక్కా చిరిగి ఎంపిపి పారిపోవలసి వచ్చింది. ఆదివాసులు ఎమ్మెల్యేతో వాదన పెట్టుకుని, అతని వాహనాన్ని ధ్వంసం చేశారు. తాను ఖనిజ తవ్వకాలకు వ్యతిరేకమని, ఇక్కడ జరిగిందంతా తనకు తెలియకుండా జరిగిందని అంటూ శాసనసభ్యుడు తప్పించుకున్నాడు. వాహనం ధ్వంసం కావడంతో దుంబ్రిగూడకు కాలినడకనే వెళ్లిపోయాడు.

ఇక మూడో ప్రజాభిప్రాయ సేకరణ విశాఖపట్నం సమీపంలోని గంగవరం ప్రైవేటు ఓడరేవు సామర్థ్యాన్ని ప్రస్తుత ఒక కోటి అరవై ఐదు లక్షల టన్నుల నుంచి నాలుగు కోట్ల పది లక్షల టన్నులకు పెంచడానికి వీలుగా నాలుగు కొత్త బెర్త్ లు నిర్మించే పథకం. పర్యావరణానికి పెద్ద ఎత్తున హాని కలిగించే ఈ ఓడరేవు విస్తరణ కార్యక్రమం అమలు జరపవద్దని కోరుతూ కొన్ని రాజకీయ పార్టీలు, ప్రజా సంఘాలు, మత్స్యకారులు ఆందోళన ప్రారంభించారు. పోర్టు ఆవరణలో, ప్రైవేటు యాజమాన్యం కనుసన్నల్లో మొదలైన ఈ ప్రజాభిప్రాయ సేకరణకు న్యాయబద్ధత ఏమిటని ఆందోళనకారులు ప్రశ్నించారు. ప్రజాభిప్రాయ సేకరణ ప్రారంభం కాకుండానే మూడు గంటల పాటు నిరసన కార్యక్రమం జరిగింది. పోర్టు లయజాన్ ఆఫీసర్ పోర్టు విస్తరణ జరపాలని తానే రాసిన ఐదు వినతి పత్రాలను ఐదుగురు నిరక్షరాస్య మత్స్యకారులతో జాయింట్ కలెక్టర్ కు ఇప్పించడానికి ప్రయత్నించగా ఆందోళనకారులు అది గుర్తించి, బయటపెట్టారు. జాయింట్ కలెక్టర్ ఆ వినతిపత్రాలను తిరస్కరించక తప్పలేదు. విపరీతంగా పోలీసులను మోహరించి, డజన్ల కొద్దీ ఆందోళనకారులను అరెస్టు చేశారు. లాఠీఛార్జి చేశారు. అక్కడికి చేరిన పోలీసులు పోర్టు అధికారి ఆదేశాల ప్రకారం పనిచేశారు. ఆయన గతంలో పోలీసు అధికారిగా పనిచేసి ప్రస్తుతం పోర్టులో అధికారిగా ఉన్నాడు,

నిజానికి గంగవరం మొదటి దశలోని నిర్వాసితుల సమస్యల పరిష్కారమే జరగలేదు. పోలీసు కాల్పులు కూడ జరిగి, ఒక మత్స్యకారుడు మరణించి, రాష్ట్రమంతా గగ్గోలు పుట్టినా, అప్పుడు లేవనెత్తిన పునరావాసం, ఉద్యోగకల్పన, నష్టపరిహారం వంటి సమస్యలు ఇంకా అలాగే ఉన్నాయి. అప్పుడు అంగీకరించిన కాలుష్య నియంత్రణ పథకాలు అమలులోకి రాలేదు. కాని మరింత కాలుష్యానికి దారితీసే కొత్త విస్తరణ పథకానికి ప్రభుత్వమూ ఆమోదించింది. తూతూ మంత్రపు ప్రజాభిప్రాయ సేకరణా ప్రారంభించింది. పోలీసుల మోహరింపుతో, లాఠీఛార్జితో, అరెస్టులతో ప్రజాభిప్రాయ ప్రకటన జరగలేదు గనుక బహుశా ప్రజాభిప్రాయం అనుకూలంగానే ఉందనే నివేదికా రావచ్చు, ఈ పథకానికి అనుమతులూ దొరకవచ్చు.

ఈ మూడు ఉదంతాలనుంచి గ్రహించవలసిన అంశాలు ఎన్నో ఉన్నాయి. ప్రస్తుతం కొనసాగుతున్న వ్యవస్థలో పాలకవిధానాలలో ఎక్కడో ఒకచోట ప్రజానుకూల అంశాలు ఉన్నా, చట్టంలో పొందుపరచినా అవి అమలు కావు. రాజకీయ, అధికార వర్గాల దోపిడీ, పీడన, అణచివేత, లాభార్జనలే ప్రధానమైపోయి, ప్రజానుకూల చట్టాలు కేవలం ప్రదర్శన వస్తువులుగా మిగిలిపోతాయి. వాటిని అమలు చేయండి అని ప్రశ్నించడం, ఆందోళన చేయడం ఈ వ్యవస్థ స్వభావాన్ని ప్రజలకు తెలియజెప్పడానికే పనికి వస్తుంది గాని, ఆధిపత్యవర్గాలు ఎప్పటికీ వాటిని అమలు చేయవు. పైగా ప్రశ్నించిన, ఆందోళన తెలిపిన వ్యక్తులను, సంస్థలను, రాజకీయ పక్షాలను అణచివేయడానికి, అవమానించడానికి అధికారవర్గాలు ప్రయత్నిస్తాయి. ఇటువంటి చట్టబద్ధమైన, శాంతియుత మైన, ప్రజాస్వామికమైన ప్రజా ఆకాంక్షల ప్రకటనల వల్ల, వాటిమీద జరుగుతున్న దమననీతి వల్ల మళ్లీ మళ్లీ రుజువయ్యే అంశమేమంటే ఈ వ్యవస్థలో సంస్కరణలకు, అతుకులకు, మాట్లకు అవకాశం లేదు. ఈ వ్యవస్థ సంపూర్ణ పరివర్తన తప్ప మరొక మార్గం లేదు.

*ఈ దేశ మొదటి ప్రధాని ముస్లిం ప్రజానీకానికి సంబంధించి వ్యక్తం చేసిన అభిప్రాయాలు ఈనాటికీ ఎంత వాస్తవంగా ఉన్నాయో వివరిస్తున్నారు* **మహబూబ్ బాషా**

# 'ముస్లింలలో అసంతృప్తికి మనమే కారణం' - నెహ్రూ

ఇరవయ్యొకటవ శతాబ్ది మొదటి దశకంలో జస్టిస్ రాజేందర్ సచార్ కమిషన్, రంగనాథ్ మిశ్రా కమిటీ నివేదికలు, వాటి సిఫారసుల దృష్ట్యా దేశవ్యాప్తంగా ముస్లింల సాంఘిక, ఆర్థిక, రాజకీయ 'వెనుకబాటు'తనంపై తీవ్ర చర్చ జరుగుతున్న నేపథ్యంలో సదరు వెనకకు 'నెట్టివేయబడ్డ' తనాన్ని చారిత్రకంగా అర్థం చేసుకోవడం ఎంతైనా అవసరం. 1947లో దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుండీ ఇప్పటి దాకా కాలాన్ని దశకాలుగా విడగొట్టి సదరు ప్రత్యేక కాలంలో వివిధ రంగాల్లో ముస్లింల ప్రాతినిధ్యాన్ని విశ్లేషిస్తే విషయం మరింత స్పష్టమవుతుంది. ఇలా గణాంక విషయాలే కాకుండా ఆయా సమయాల్లో నిర్ణయాత్మక స్థానాల్లో ఉండిన పాలకులు ముస్లింల స్థితిగతులను గురించి ఎలాంటి ఆలోచనలు కలిగి ఉన్నారో తెలుసుకోవడం అవసరం. ఈ దిశగా భారతదేశానికి రాజకీయ స్వాతంత్ర్యం లభించి నల్ల'దొర'లు పాలకులైన మొదటి దశకంలో (1947-57) దేశ తొలి ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ ముస్లింల స్థితిగతులపై వెలిబుచ్చిన అభిప్రాయాలను ఆయన వివిధ రాష్ట్రాల ముఖ్యమంత్రులకు, మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రికి 1954లో రాసిన లేఖల ద్వారా తెలుసుకోబోతున్నాం.

వలసవాద వ్యతిరేక 'జాతీయోద్యమాన్ని' నడిపిన కొందరు నాయకుల స్వార్థబుద్ధి కారణంగా కూడా బ్రిటిష్ ఇండియా విభజితమైంది. కానీ ఈ 'తప్పుకు' కారణం కేవలం ముస్లింలే నన్న భావజాలం విలయతాండవం చేస్తూండిన చారిత్రక సందర్భంలో నెహ్రూ ఈ లేఖలు రాశారు. 'దేశ విభజనకు మీరే కారకులు' అనే అభాండ కరవాలం ముస్లింల ఆత్మ విశ్వాసాన్ని ఖండఖండాలుగా నరికింది. 'దేశవిభజన', మతతత్వ బూచిల ఖంజర్ మౌలానా అబుల్‌కలాం ఆజాద్ మొదలైన నాయకుల మెడలపై వేలాడి అప్పటిదాకా ముస్లింలకు లభిస్తుండిన రిజర్వేషన్ సౌకర్యంపై అయిష్టంగానే కాంప్రమైజ్ అయ్యేలా ఒత్తిడి పెంచింది. పర్యవసానంగా క్రమక్రమంగా విద్య, ఉపాధి, రాజకీయ రంగాల్లో ముస్లింలు వెనుకబడ్డారు. అందుకే నెహ్రూ 'ఇప్పుడు ఎక్కడా ముస్లింలకు రిజర్వేషన్లు కూడా లేవు కదా!' అనాల్సొచ్చింది. ముస్లింల వెనుకబాటుతనానికి, వివిధ సంస్థల్లో ప్రాతినిధ్యలేమికీ 'ముస్లిం వ్యతిరేకత' కూడా ఒక బలమైన కారణమనీ ఆయన చెప్పారు. ఈ ఉత్తరాలు 'గతానికి' సంబంధించినవి అని అనిపించినా వాటి తేదీలను మారిస్తే అవి వర్తమానానికీ వర్తిస్తాయన్నది కఠోర వాస్తవం.

ఈ కఠోరవాస్తవానికి ప్రతిబింబాలే ఇందిరాగాంధీ నాటి గోపాల్‌సింగ్ హైపవర్ మైనారిటీ ప్యానెల్ నివేదిక, సచార్ నివేదిక, రంగనాథ్ మిశ్రా నివేదిక మొదలైనవి.

ముస్లింల భౌతిక పరిస్థితులకు సంబంధించిన విషయం ఒక ఎత్తైతే 'భద్రత'కు సంబంధించిన వారి మానసిక స్థితి మరొక ఎత్తు. 'దేశ విభజన' భూతాన్ని భుజాలపై భద్రంగా మోస్తున్న ఆర్.ఎస్.ఎస్. అనే అబద్ధాల మురికి మృత సముద్రంలో పుట్టిన క్షుద్ర రాక్షసులు ఓండ్ర పెడుతూ, భయవిహ్వల వాతావరణాన్ని సృష్టిస్తూ ముస్లింలను క్షణక్షణమూ దినదినమూ అభద్రతా పంజరంలోకి నెట్టేస్తున్నారు. 'భారతదేశంలో ఉండాలంటే వందేమాతరం పాడాల్సిందే'నని, 'సూర్య నమస్కారం చేయాల్సిందే'ననీ, 'హిందువుల గుడ్‌విల్ ఎంజాయ్ చేయాలి' అనీ వేయి నాలుకలతో కారుకూతలు కూస్తున్నారు.

---

అట్లాగే వ్యవస్థ మార్పు గురించి మాట్లాడకుండానో, తక్కువ మాట్లాడుతూనో, అస్తిత్వ పోరాటాల ద్వారానే అణగారిన అస్తిత్వాలకు న్యాయం చేకూరుతుందని మాట్లాడుతూ సామాజిక అస్తిత్వాలను, పుట్టుకను ప్రధానం చేస్తున్నవారికి కూడ ఈ మూడు ఉదంతాలు ఒక సవాలు విసురుతున్నాయి. ఇల్లంతకుంట ప్రజాభిప్రాయ సేకరణలో ప్రజలవైపు నిలబడినది ఒక దళిత మహిళా మేధావి. పాలకులవైపు నిలబడి ఆమెను దూషించినది ఒక దళిత శాసనసభ్యుడు. ఆమెతో పాటు నిలబడి ఆందోళనలో పాల్గొన్న ప్రజలలో, కార్యకర్తలలో 'అగ్రవర్ణాలలో' పుట్టినవారు కూడ ఉన్నారు. డుంబ్రిగూడ ప్రజాభిప్రాయ సేకరణలో ప్రజలకు వ్యతిరేకంగా, ఖనిజ మాఫియా తరఫున నిలబడినది ఎన్నికైన ఆదివాసి 'ప్రజాప్రతినిధులు'. గంగవరంలో తమ తరఫున వినతి పత్రాలు ఇవ్వడానికి కొందరు మత్స్యకారులనైనా అగ్రవర్ణ పెట్టుబడిదారులు ఆకర్షించగలిగారు. ఇక రాజకీయాల విషయానికి వస్తే పథకాలను సమర్థించినది ఒకచోట కాంగ్రెస్ నాయకులు, మరొకచోట తెలుగుదేశం నాయకులు. ఆస్తి సంపాదన, ప్రజల వనరులను కొల్లగొట్టడం వంటి విషయాలలో అస్తిత్వాలు, పుట్టుక మూలాల కన్న వర్గ ప్రయోజనాలదే పైచేయి అవుతోంది. పాలక విధానాలను ప్రశ్నించి, ప్రజలవైపు నిలవడంలో పుట్టుక కన్న ప్రజాస్వామిక స్వభావానిదే, న్యాయానిదే నిర్ణాయక పాత్ర అవుతోంది.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

నెహ్రూ లేఖల్లోని మరో అంశం కొందరు ముస్లిం నాయకులు అమాయక ముస్లింలను 'పక్కదోవ' పట్టించగలరనే విషయానికి సంబంధించింది. అలాంటి 'కొందరు నాయకుల' సంఖ్య తగ్గిపోయినప్పటికీ 'పక్కదోవ' పట్టించగలిగే పరిస్థితులు తగ్గకపోగా నానాటికీ పెరుగుతున్నాయనేది మాత్రం వాస్తవం. పరిస్థితుల్లో మార్పు తేకుండా పక్కదోవ పట్టకూడదనుకోవడం మూర్ఖత్వమే. దీని బాధ్యత భారతదేశాన్ని పాలిస్తున్న నల్ల'దొర'లదే.

'కాంగ్రెస్ వారు కానీ, బెంగాల్ లాంటి ప్రాంతాల్లోని 'అర-కొర' కమ్యూనిస్టులు కానీ ముస్లింల గురించి ఇంతదాకా కార్చింది మొసలి కన్నీరేరా భై' అనేది ఈనాటి సాధారణ ముస్లింలలో సైతం ఏర్పడ్డ చైతన్యం. ముస్లింల విశ్వాసాన్ని చూరగొనాలని నెహ్రూ భావించాడు. ఇప్పుడు నెత్తిపై టోపీ పెట్టుకొని, నవాబుల స్టైలు సలాములతో ప్రతి రాజకీయ మర్కటం ఇదే జిమ్మిక్కులు చేస్తోంది.

ఈ లేఖలు చదివి చరిత్ర పునరావృతమైన / మవుతున్న తీరును చదివి మన జనాజేకీ నమాజ్ మనమే చదువుకుందాం.

### 1. మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి రవిశంకర్ శుక్లాకు నెహ్రూ లేఖ (20 మార్చ్, 1954)

ప్రియమైన శుక్లా గారూ,

జనవరి 27 నాటి మీ లేఖలో మధ్యప్రదేశ్‌లోని ముస్లింల (అనుమానాస్పద) కార్యకలాపాల గురించి ప్రస్తావించారు. ఆలస్యంగా ప్రత్యుత్తరమిస్తున్నందుకు చింతిస్తున్నాను.

ఇవాళ భారతదేశంలోని ముస్లింలలో రకరకాల ధోరణులున్నాయి. కొన్ని నిస్సందేహంగా అభ్యంతరకరమైనవే. అయినప్పటికీ సదరు పరిస్థితుల్ని వాస్తవిక దృష్టితో వస్తుగతంగా అర్థం చేసుకోవాలే కానీ పక్కదోవ పట్టకూడదు. భారతదేశంలోని ముస్లింలు సంతోషంగా కాకుండా అసంతృప్తిగా ఉన్నారంటే ఆ తప్పు మనదే కానీ ముస్లింలది కాదు. దేశ విభజన, దాని పర్యవసానాల కారణంగా ముస్లింలు తీవ్ర దిగ్భ్రాంతికి గురై ఉన్నారు. వాళ్లు నిమ్మళంగా ఉండి తమ భవిష్యత్తూ, శ్రేయస్సూ భారతదేశంలో తప్ప మరెక్కడా లేదని భావించే విధంగా వాళ్లలో విశ్వాసాన్ని కలుగజేసే బాధ్యత మనమీదుంది. ఈ పని చేయడంలో మనం విఫలమైతే కొందరు నాయకులు ముస్లింలను పక్కదారి పట్టించగలరు.

(ఈనాడు) ముస్లింల మెదళ్లలో నిరాశతో కూడిన గందరగోళమున్నదన్న విషయం వాస్తవం. నేను పాకిస్తాన్ అనుకూలురయిన వారిని గురించి మాట్లాడ్డం లేదు. అలాంటి వారెక్కువమంది లేరు. ఈనాటి భారతదేశ పరిస్థితులు పలు రకాలుగా ముస్లింలపై ఎడతెగని ఒత్తిడిని పెంచే విధంగా తయారయి ఉన్నాయి. కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వోద్యోగాల్లో ప్రవేశించే సమస్యను ముస్లింలు ఎదుర్కొంటున్నారు. కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో వారి విద్యావకాశాలు కూడా అంతంత మాత్రంగానే ఉన్నాయి. వ్యాపారాల్లో సైతం వారు వ్యతిరేకతనెదుర్కొంటున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో ముస్లింలలో అభద్రతాభావం ఉందంటే అది ఆశ్చర్యకరమేమీ కాదు...

ఈ దేశ జనాభాలో ముస్లింలు అతిపెద్ద సంఖ్యలో ఉన్నారన్న విషయాన్ని మనం మర్చిపోతున్నట్లున్నాం అని అనిపిస్తోంది. వాళ్ల విశ్వాసాన్ని ఎలా చూరగొనగలమనేది మనముందున్న పెను సవాలు...

ఇట్లు మీ

**జవహర్‌లాల్ నెహ్రూ**

(ఆధారం: సెలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జవహర్‌లాల్ నెహ్రూ, సెకండ్ సిరీస్, వాల్యూమ్ 25, జవహర్‌లాల్ నెహ్రూ మెమోరియల్ ఫండ్, 1999, పి.పి. 226-227. రీప్రొడ్యూస్డ్ ఇన్ ఎ.జి. నూరానీ సంపాదకత్వంలో వెలువడిన 'ది ముస్లిం ఆఫ్ ఇండియా - ఎ డాక్యుమెంటరీ రికార్డ్, ఒ.యు.పి., 2004, పి.పి. 107-108. అనువాదం: మహబూబ్ బాషా)

### 2. వివిధ రాష్ట్రాల ముఖ్యమంత్రులకు నెహ్రూ పంపిన లేఖలోని కొన్ని భాగాలు (26, ఏప్రిల్ 1954)

నన్ను తీవ్ర ఆందోళనకు గురిచేసి ఇప్పటికీ నా మనసుకు నొప్పి కలిగిస్తున్న ఒక విషయాన్ని గురించి నేనిదివరకే మీకు రాసి ఉన్నాను. ఇది భారత దేశంలో మైనారిటీలకు సంబంధించిన సమస్య. వివిధ ప్రభుత్వోద్యోగాల్లో ఎంతమంది మైనారిటీలు (ముస్లింలు) ఉన్నారో గణాంకాలు సేకరించమని నేను మిమ్మల్ని కోరి ఉన్నాను. నాకు లభ్యపరచిన గణాంకాలు మిక్కిలి అసంతృప్తికరంగా ఉన్నాయి. (అంటే ముస్లింల ప్రాతినిధ్యం అంత దయనీయంగా ఉండడం వల్లే లభ్యమైన గణాంకాలు అసంతృప్తికరంగా ఉన్నాయి.) మన రాజ్యాంగమూ, చట్టాలూ, నియమాలూ మంచివే. కానీ వాస్తవంలో మైనారిటీలు, ముఖ్యంగా ముస్లింలు, తీవ్ర అసంతృప్తితో, నిరాశా నిస్పృహల్లో కొట్టుమిట్టాడుతున్నారనేది వాస్తవం. వివిధ రంగాల్లోని అంటే సివిల్, మిలిటరీ, పోలీసు తదితర ప్రభుత్వ ఉద్యోగాల్లో అవకాశాలు తమకు మూసివేయబడి ఉన్నాయని ముస్లింలు బలంగా భావిస్తున్నారు. (వాస్తవంగా పరిస్థితులలా ఉండబట్టే వారలా భావిస్తున్నారు.) మన శాసనసభలు, పార్లమెంట్‌లో ముస్లింలు ప్రవేశించడమనేది సులభ సాధ్యమైన విషయం కాదు. మన పబ్లిక్ సంస్థల్లో ముస్లింలకు సరియైన ప్రాతినిధ్యం లభించడమనేది క్రమంగా కష్టతరంగా మారుతోంది. (మన) కాంగ్రెస్‌లో ఈ పరిస్థితి ఉందనేది నాకు స్పష్టంగా తెలుసు. కాంగ్రెస్‌లో ప్రాథమిక సభ్యత్వం లభించడమనేది సులభమే అయినప్పటికీ, ఎన్నికయ్యే పోస్టుల దగ్గరికొచ్చేటప్పటికి ముస్లింలకు మొండిచెయ్యి మిగులుతోంది. ఇప్పుడు ఎక్కడా ముస్లింలకు రిజర్వేషన్లు కూడా లేవు కదా! ఈ (దౌర్భాగ్య) పరిస్థితే మిగిలిన సంస్థల్లోనూ, రాజకీయ పార్టీలలోనూ ఉందని భావిస్తున్నాను. ముస్లిం వ్యతిరేకతే ఈ పరిస్థితులన్నింటికీ కారణం అని చెప్పడం నా ఉద్దేశం కానప్పటికీ అది కూడా ఉందనేది మాత్రం నిక్కమైన నిజం.

(ఆధారం - జవహర్‌లాల్ నెహ్రూ. లెటర్స్ టు చీఫ్ మినిస్టర్స్, 1947-65. జనరల్ ఎడిషన్. జి. పార్థసారథి, జవహర్‌లాల్ నెహ్రూ మెమోరియల్ ఫండ్, 1987, వాల్యూమ్ 3, పేజీ 535. సైటెడ్ ఇన్ ఎ.జి. నూరానీ సంపాదకత్వంలో వెలువడిన 'ది ముస్లిం ఆఫ్ ఇండియా - ఎ డాక్యుమెంటరీ రికార్డ్, ఒ.యు.పి., 2004, పేజీ 109. అనువాదం: మహబూబ్ బాషా)

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, అంబేద్కర్ కేంద్రీయ విశ్వవిద్యాలయం, లక్నో)*

వీ

*పశ్చిమ బెంగాల్‌లోని ఆదివాసీల, గ్రామీణ ప్రజల స్థితిగతుల నుంచి అక్కడి సిపిఎం ప్రభుత్వ వైఫల్యాలను వివరిస్తున్నారు* **భాను సర్కార్**

# బెంగాల్ వామపక్ష ప్రభుత్వం - ఆదివాసులు

జంగల్ మహల్ వ్యాప్తంగా సాయుధ హర్మద్ వాహినీ, సంయుక్త బలగాల చేతుల్లో ప్రతిరోజు హత్యా, ఖూనీ, మిస్సింగ్‌లలో ఒకరి తరువాత మరొకరు ఆదివాసీలు బలవుతున్నారు. పోలీస్ సంత్రాశ్ విరోధి జనసాధారణ కమిటీ వారు ప్రచురించిన లిస్ట్ పరిశీలిస్తే 25 జనవరి 2009 నుండి 29 ఆగస్ట్ 2010ల మధ్య కాలంలో 94 మంది మృతి చెందడమో అదృశ్యం కావడమో జరిగింది. (ఈ సంఖ్య కాకుండా మావోయిస్టుల పక్షాన మృతి చెందిన వారి లిస్ట్ విడిగానే ఉంది.) మృతుల, అదృశ్యం, అరెస్ట్ కాబడిన వారి లిస్ట్ నిరంతరం పెరుగుతూనే ఉంది. వాస్తవ విషయాలు, సత్యాసత్యాలు తెలుసుకోవడం, సేకరించడం ఇప్పుడు ఈ రాష్ట్రంలో నిలిపివేయబడింది. కారణమేమంటే జంగల్ మహల్ లోకి విలేకర్ల ప్రవేశం నియంత్రించబడింది. పోలీసులు లేదా సంయుక్త బలగాలు ఇచ్చే వివరాలే ఇప్పుడు మాలాంటి వారందరికీ ఆధారం.

అనేక మాసాలుగా ఎలాంటి మినహాయింపులు లేకుండా 144 ఎ సెక్షన్ జంగల్ మహల్‌లో విధించబడింది. శాంతిభద్రతల పేరు చెప్పే ప్రభుత్వం 144 ఎ సెక్షన్‌ను విచక్షణారహితంగా అమలు జరుపుతోంది. ఒకప్పుడు జ్యోతిబసు బెంగాల్‌లో చట్టసభలో జరిగిన చర్చలో 12 మార్చ్ 1947లో ఎమన్నారంటే 'శాంతి భద్రతల (లా అండ్ ఆర్డర్) విషయాన్ని ఎప్పుడైతే ప్రశ్నిస్తామో అప్పుడు వినవచ్చేదే మంటే, అర్థమయ్యేదేమంటే లా అంటే పీడించే చట్టం, భద్రత అంటే రైతాంగ ఉద్యమాన్ని నిర్దయగా నిర్బంధించడం.' గ్రామాల్లో మనకు కానవచ్చే దృశ్యం ఏమంటే రైతుల, కౌలుదార్ల ఇల్లు-వాకిలి ధ్వంసం చేయడానికి సర్కారీ యంత్రాంగాన్ని నియమించడం, ఇంకా మనకు కానవచ్చే విషయం స్త్రీలను అవమానించడం, సిగ్గుపడేలా చేయడం. అంతేకాక స్టెన్‌గన్, రివాల్వర్, రైఫిల్ చేబట్టి గ్రామీణ ప్రాంతాలను భీతాహం కావించడం.'

జ్యోతిబసు అధికార పీఠం ఎక్కాక కూడా పరిస్థితి అదే విధంగా కనబడుతుంది. సిపిఎం నియంత్రణలో వామపక్ష ప్రభుత్వం మరిచా ఝాడిలో సల్పిన హత్యాకాండ ద్వారా వీరి ప్రయాణం ప్రారంభమయింది. ఇవాళ ఆదివాసుల చేతుల్లో నుండి అడవి పై హక్కును దఖలు పర్చుకొని, సాధారణ రైతులను భూమి నుంచి ఉద్వాసన చెప్పించి, దేశ, విదేశ పెట్టుబడికి విశ్వసయనీమైన సేవకుడిగా సిపిఎం తనను తానే నియమించుకుంది. అందుకే హూర్‌దివస్ (30 జూన్ 2010 - సిద్ధ కానూల నాయకత్వంలోను మొదటి సంతాల్ తిరుగుబాటు స్మృతిలో ప్రజలు జరుపుకొనే విప్లవ దినం) రోజున హర్మద్‌వాహినీ, పోలీసుల సంయుక్త బలగాలు ఝూర్‌గ్రామ్ పోలీసు స్టేషన్ పరిధిలో గల సోనాముఖి గ్రామంలో కొందరు నవ వధువులను రేప్ చేసి, మరెందరో మహిళలతో అసభ్యంగా వ్యవహరించారు. సోనాముఖి సమీప గ్రామం అయిన బిడీ హండిలో 75 ఏళ్ల వృద్ధురాలు సరలబాలా మహతోను ఈ పైశాచిక బలగాలు లాఠీలతో, తుపాకీ మడమలతో కొట్టి చంపారు. ఆమె చేసిన నేరం సంయుక్త బలగాల, హర్మద్ బలగాల పైశాచికత్వాన్ని ప్రశ్నించడమే. పశ్చిమ మేధినీపూర్ - బంకుర - పురులీయా జిల్లాలలోని పలు ప్రాథమిక విద్యాలయాలు, కళాశాలలు, పంచాయితీ కార్యాలయాలు, పార్టీ కార్యాలయాలు అన్నీ ఇప్పుడు సాయుధ హర్మద్‌ల విడిది కేంద్రాలు. ఈ బలగాల ఉనికితో గ్రామస్తులు బిక్కుబిక్కుమంటూ కాలం వెళ్లదీస్తున్నారు. 5 ఆగస్ట్ 2010 నాటికి ఈ మూడు జిల్లాలలో 87 హర్మద్ క్యాంపులు ఉన్నాయి. ఇటువంటి ఒక హర్మద్ క్యాంపు నుంచే 7 జనవరి 2011న నీలాయి అనే గ్రామంలో కాల్పులు జరిగి తొమ్మిది మంది మరణించగా, 28 మంది గాయపడ్డారు. మృతులలో నలుగురు మహిళలు.

పిల్లలు తమ పాఠశాలలు తెరవాలనీ, క్యాంపులు ఖాళీ చేయాలనీ డిమాండ్ చేస్తే హర్మద్ బలగాలు వారిని చిత్తం వచ్చినట్లు బాదుతున్నాయి. 19 మే 2010న రామ్‌గార్ సమీపాన (లాల్‌ఘుడ్ నుంచి 14 కిలోమీటర్లు) ముగ్గురు స్కూలు పిల్లలను సంయుక్త బలగాలు కాల్చిచంపిన విషయం అందరికీ తెలుసు. జనం తమ సొంత చొరవతో ఆస్పత్రులు తెరుస్తున్నారు. పొలయిబని గ్రామంలో జనసాధారణ కమిటీ నిర్మించే పదిహేను పడకల పక్కా ఆస్పత్రి భవన నిర్మాణ బాధ్యతలు చూసే 53 ఏళ్ల క్షతి మహతోను హర్మద్‌లు చంపివేశారు. ఈ ఆస్పత్రిలో పనిచేసే నిశీల్ మహతో అనే డాక్టర్‌ను ఆయన స్వగ్రామమైన పిగ్రాకుతిలో 14 ఏప్రిల్ 2010న గ్రామాన్ని చుట్టుముట్టిన ఒక బెటాలియన్, సంయుక్త బలగాలు అరెస్ట్ చేసి కోర్టులో హాజరుపర్చాయి. పొలయిబని చుట్టుపక్కల సిపిఎం ను వ్యతిరేకించిన అనేకులు ఇలాంటి దాడులను చవిచూశారు. ఇలా రోగులను, డాక్టర్లను, ఆస్పత్రి సిబ్బందిని ఇబ్బంది పెట్టడం, చివరికి రోగుల కోసం సేకరించే మందులను సైతం పోలీసులు లూటీ చేయడం పలుమార్లు జరిగింది. దీనికి వ్యతిరేకంగా అనేక బంద్‌లు, ఆందోళనలు, నిరహార దీక్షలు, చక్కాజామ్, నల్లజెండాల ప్రదర్శనలు, మౌన ఊరేగింపులు అనేకం జరిగాయి. ప్రభుత్వం ఈ పద్ధతిని నిలిపి వేయలేదు సరిగదా, ఆగస్ట్ 2010 నుంచి మరింత పెద్ద ఎత్తున కొనసాగించింది. ముప్ఫై నాలుగు ఏళ్లు అధికారంలో ఉండి వామపక్షాలు ప్రజలకు అవసరమైన కనీస వనరులు, మౌలిక సౌకర్యాలు ఏర్పర్చకుండా, ప్రజలు

జన సాధారణ కమిటీ నాయకత్వంలో తమ సొంత చొరవతో ఏర్పర్చుకుంటున్న ప్రజోపయోగ వైద్య సర్వీసులను కూడా అనుమతించకుండా, ప్రజల జీవితాలతో చెలగాటమాడుతున్నాయి.

ఆమ్లాజోల్ గ్రామం (పశ్చిమ మేదినీపూర్ – బెల్‌పాహో ప్రాంతం) లో ఆకలి చావు సంభవించిన తరువాత కూడా ప్రభుత్వం ఆ ప్రాంత ప్రజల కోసం పౌరసరఫరా వ్యవస్థను మెరుగుపర్చలేదు. ఆకలి చావులు కొనసాగాయి. కాని, ఈ ప్రాంతానికి ఈస్టర్న్ ఫ్రాంటియర్ రైఫిల్స్, సిఆర్‌పిఎఫ్‌ల శాశ్వత క్యాంపులను ఏర్పాటు చేసింది. దుర్భర దారిద్ర్యానికి గురైన పేదల ఇళ్ల మధ్య వెలసిన రెండు మూడంతస్తుల భవనాలు, చౌక ధరల దుకాణాల డీలర్లవని ఎవరైనా సులభంగా గుర్తించవచ్చు. స్థానికంగా అధికారంలో గల రాజకీయ పార్టీ నాయకులే రేషన్ డీలర్లు. కిరోసిన్ డీలర్లు. అంతేకాదు, అత్యధిక భూమి సైతం వారి చేతుల్లోనే ఉంది. సుప్రీంకోర్టు ఉత్తర్వుల ప్రకారం చౌక ధరల దూకాణాలను వారానికి ఐదున్నర రోజులు తెరిచి ఉంచవలసి ఉండగా, అది ఎక్కడా జరగడం లేదు. మహా అయితే, వారానికి రెండు రోజులు తెరుస్తారు. 'ఈ వారం మాల్ తేలేదని' మధ్య మధ్య అంటూ ఉంటారు.

ఇక వృద్ధాప్య ఫించన్ నెల నెలా మొదటి వారంలో సంబంధీకుల చేతుల్లో ఉంచడం నియమం. కానీ, ఏడెనిమిది మాసాల తర్వాత కూడా వారికి ఆ డబ్బు అందడం లేదు. బ్యాంకులో ఉన్నా వారికి బట్వాడా కాదు. జాతీయ గ్రామీణ ఉపాధి కల్పనా పథకం కింద వంద రోజుల పని కల్పించడం ఎక్కడా జరగడం లేదు. విభిన్న సర్వే రిపోర్టుల ప్రకారం ఈ మూడు జిల్లాలలో పన్నెండు నుంచి పదహారు రోజుల పని మాత్రమే దొరికిందని తేలింది. ఇక్కడ నొక్కి చెప్పాల్సిన విషయం ఏమంటే, లోతట్టు గ్రామాలలో మూడు నాలుగు రోజుల పని సైతం కల్పించబడలేదు. అంతేకాదు, ప్రణాళికా సంఘం వారి పరిశీలన ప్రకారం కేంద్ర ప్రభుత్వం విడుదల చేసిన నిధులలో పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం ప్రత్యేకించి మావోయిస్టు ప్రభావిత ప్రాంతాలకే కేటాయించిన ఉపాధి హామీ పనులలో రు. 295.96 కోట్లు కాగా, అందులో రు. 145.86 కోట్లు ఖర్చు కాలేదు. అలాగే వైద్య సేవలపై కేటాయించిన రు. 35.95 కోట్లలో రు. 31.72 కోట్లు ఖర్చు కాలేదంటే వామపక్ష ప్రభుత్వ నిజాయితీని ఎవరైనా సులువుగా అర్థం చేసుకోవచ్చు. గృహనిర్మాణాలకై కేటాయించిన రు. 116.28 కోట్లలో రు. 76.78 కోట్లు ఖర్చు కాలేదు. ఖర్చు చేసిన మొత్తాలలో 2/3 భాగం హర్మద్ క్యాంపుల నిర్వహణపై ఖర్చు చేశారని ఈ జిల్లాల ప్రజలు అంటున్నారు.

గ్రామ సంసద్ సభ జరపకపోవడం ఇక్కడ నియమం. ఆధిపత్యంలో గల ముఠా నాయకుడు నిర్ణయం తీసుకుంటాడు. సభ నిర్వహణ వివరాలు రాసే రిజిష్టర్ మొత్తం ఖాళీగా ఉంచి సంతకాలు తీసుకుంటాడు. ఆ తరువాత నాయకుల చిత్తానుసారం ఆ ఖాళీ పేజీలలో రాసుకుంటారు. ఈ అప్రజాస్వామిక పని పద్ధతి వల్ల ప్రజలు, గ్రామ సభా, గ్రామ సంసద్ అంటేనే విముఖత ఏర్పర్చుకున్నారు. హాజరయ్యే వారి సంఖ్య గణనీయంగా తగ్గిపోతున్నది.

పశ్చిమ బెంగాల్ హ్యూమన్ డెవలప్‌మెంట్ 2004 ప్రకారం 1997 లో గ్రామ సభలో హాజరయిన వారు 16 శాతం కాగా, 2001లో ఇది 12 శాతంగా నమోదయింది. గ్రామ అభివృద్ధి కార్యక్రమాలలో సాధారణ ప్రజల భాగస్వామ్యం ఏమాత్రం లేదని చెప్పడమే ఉత్తమం. ఆదివాసీ ప్రాంతాలుగా పేర్కొన్న చోట రాజ్యాంగంలోని ఐదవ షెడ్యూల్ ప్రయోగించడానికి ప్రభుత్వం ఎంత మాత్రం శ్రద్ధ చూపలేదు.

తునికాకు, బాబుయి గడ్డి నులక (ఫర్నిచర్ అల్లకంలో ఉపయోగించే ఒక రకమైన మెత్తటి గడ్డి నులక), సాల్‌పత్తా (గుగ్గిలం చెట్ల ఆకు – తూర్పు, ఉత్తర భారత ప్రాంతాలలో విస్తర్లకు, దొప్పలకు వాడుతారు) సేకరణ ద్వారా ఆదివాసులు ఏదో ఒకరకంగా జీవితం వెళ్లదీస్తున్నారు. ఆదివాసీ ప్రజల ప్రధాన జీవితాధారం వ్యవసాయమే. కానీ, వీరిలో సొంత వ్యవసాయంపై ఆధారపడి జీవించే వారి సంఖ్య క్రమంగా తగ్గిపోతున్నది. మరొకవైపు వ్యవసాయ కూలీల సంఖ్య పెరుగుతున్నది. 1981 నాటి జన గణన ప్రకారం ఆదివాసీ ప్రజలలో సొంత వ్యవసాయం ద్వారా జీవనోపాధి లభ్యమయ్యే వారి సంఖ్య 31.04 శాతం కాగా, వ్యవసాయ కూలీల సంఖ్య 48.73 శాతం. ఇక 2001 జనగణన ప్రకారం సొంత వ్యవసాయం పై ఆధారపడే వారి సంఖ్య 19.5 శాతానికి పడిపోయి, వ్యవసాయ కూలీల సంఖ్య పెరిగి 53.2 శాతం అయింది. పొట్టకూటికి, కూలీ కోసం ఇతర జిల్లాలకూ, రాష్ట్రాలకూ వలసపోయే వారి సంఖ్య గణనీయంగా పెరుగుతున్నది. ఇలా వలసపోవడాన్ని ఇక్కడ 'నామాల్' పోవడం అంటారు.

పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం అయిదు జిల్లాలలో ఆదివాసీ ప్రాంతాలైన 74 బ్లాకుల అభివృద్ధి కోసం పశ్చిమాంచల్ ఉన్నయన్ పరిషత్ పేరిట ఒక సంస్థను ఏర్పరిచింది. గోర్బెటా, కేశాపూర్ (తూర్పు బరన్‌పూర్ జిల్లాలోని బ్లాకులు) లో కుఖ్యాతి వహించిన సుశాంతో ఘోష్‌ను ఈ పరిషత్‌కు మంత్రిగా నియమించారు. ఈ పరిషత్‌కు కేటాయించిన నిధులను విశ్లేషించి చూస్తే తెలిసే విషయం 74 బ్లాకులలోని సుమారు 13,500 గ్రామాలలో నివసించే ఒక కోటి మంది మనుషుల కోసం సంవత్సరానికి 30–40 కోట్ల రూపాయలు అంటే, ప్రతి వారికీ 30–40 రూపాయలు. దీంతో వీరి అభివృద్ధి ఎంతో సులభంగానే అర్థం చేసుకోవచ్చు. ఈ డబ్బులో కూడా ఎక్కువ భాగం ఖర్చు కాదు. ఈ డబ్బులో కొంత భాగం సాయుధ హర్మద్ శిబిరాలపై, ఆయుధాల కొనుగోలుపై ఖర్చు అవుతుందని విడిగా చెప్పనవసరం లేదు. వామపక్ష ప్రభుత్వం సర్కారీ ఖజానా నుంచి డబ్బు వెచ్చించి, ఎంత అందమైన ప్రకటనలు, దాని సాఫల్యపు జయగానం కీర్తనలు చేసినప్పటికీ ఈ రాష్ట్రంలో ఆదివాసుల జీవితాలు అత్యంత దయనీయంగా ఉన్నాయి.

2001 జనగనణ ప్రకారం రాష్ట్రంలో మొత్తం అక్షరాస్యత 69 శాతం కాగా, ఆదివాసులలో అక్షరాస్యత కేవలం 43 శాతం. రక్తహీనత, పోషకాహార లోపం, శిశు మరణాల శాతం అన్ని ప్రాంతాల కన్న ఆదివాసీ ప్రాంతాలలోనే అధికం. జాతీయ కుటుంబ ఆరోగ్య సమీక్ష – 2 ప్రకారం శిశు మరణాల సంఖ్య బెంగాల్‌లో 33.8 శాతం కాగా, ఆదివాసీ ప్రాంతాలలో 58.8 శాతం. ఇక్కడ ఆదివాసీ ప్రాంతం అంటే దట్టమైన అడవులు కావు. రోడ్డు, రైలు మార్గం లేని దూరపు కొండ ప్రాంతాలు కావు. ఇవి శ్రమతల ప్రాంతాలు. సంవత్సరం పొడవునా వాహన యోగ్యమైన దారులు గల ప్రాంతాలు. పల్చటి పొరక ప్లాంటేషన్, పల్చటి సాల్ వృక్షాల అడవి మాత్రమే. దేశంలోని మిగతా దట్టమైన చిక్కని అడవులతో వీటిని పోల్చలేం.

పశ్చిమాంచల్ ఉన్నయన్ పరిషత్ పరిధిలోని ఏడు బ్లాకులలో ఒక్క ప్రాథమిక చికిత్సా కేంద్రం కూడా లేదు. పరిషత్ అధీనంలోని 12,558 గ్రామాలలో 2,570 గ్రామాలకు అంటే 23 శాతానికి మాత్రమే బస్సు సౌకర్యం ఉంది. 4,914 గ్రామాలలో విద్యుత్తు లేదు. 34 ఏళ్ల

*ఒడిశా ప్రభుత్వం విప్లవోద్యమానికి ఇచ్చిన హామీలను నెరవేర్చడంలో విఫలమైందనీ, ఉద్యమించి ఒత్తిడి పెంచడమే ప్రజలకు మిగిలిన మార్గమనీ అంటున్నారు* **భాస్కర్**

# కలెక్టర్ నిర్బంధం - డిమాండ్లు - ప్రకాశ్ సింగ్

పాలకవర్గాల సేవకులు అప్పుడప్పుడు ఉదారవాదులుగా, ప్రజాస్వామికవాదులుగా నటించినా కీలక సమయాల్లో తమ ముసుగును తామే తొలగించుకుని అసలు ఫాసిస్టు ముఖాన్ని బహిర్గత పరచుకుంటా రనడానికి తాజా ఉదాహరణ ప్రకాశ్ సింగ్. ఉత్తర ప్రదేశ్ డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ (డిజిపి) గా, బార్డర్ సెక్యూరిటీ ఫోర్స్ (బిఎస్ఎఫ్) డైరెక్టర్ జనరల్‌గా పనిచేసి, 'నక్సలైట్ మూవ్‌మెంట్ ఇన్ ఇండియా' పుస్తక రచన ద్వారా తనను తాను విప్లవోద్యమం మీద పరిజ్ఞానం ఉన్నవాడిగా చెప్పుకునే ప్రకాశ్ సింగ్ గత ఐదారు సంవత్సరాలుగా ఉదారవాదిగా, ప్రజాస్వామికవాదిగా కొందరిలోనైనా భ్రమలు సృష్టించాడు. పత్రికలలో, టెలివిజన్ చర్చలలో విరివిగా పాల్గొంటున్నాడు. తాజాగా ఒడిశాలో మల్కన్ గిరి జిల్లా కలెక్టర్ ఆర్ వినీల్ కృష్ణ ను, జూనియర్ ఇంజనీర్ పవిత్ర మోహన్ మాఝీని విప్లవోద్యమం బందీలుగా పట్టుకుని తమ డిమాండ్లు పెట్టిన తర్వాత ఒక హిందీ పత్రికలో ప్రకాశ్ సింగ్ రాసిన విషయాలు ఆయన అసలు ముఖాన్ని బహిర్గతం చేశాయి.

అంతకు ముందు భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు లెనినిస్టు) (పీపుల్స్ వార్) గా, మావోయిస్టు కమ్యూనిస్టు సెంటర్ గా ఉన్న రెండు పార్టీలు 2004లో సెప్టెంబర్ లో విలీనమై భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) గా ఆవిర్భవించిన తర్వాత ఆ పార్టీ 'దేశ అంతర్గత భద్రతకు ప్రధాన ప్రమాదం' అని పాలకవర్గాల తరఫున ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్ ప్రకటించాడు. ఆ పార్టీ నాయకత్వంలోని వంద మందిని హత్య చేస్తామని పాలకవర్గాలు బహిరంగంగానే ప్రకటించాయి. ఆ స్థితిలో మావోయిస్టు 'సమస్య'ను సామాజిక, ఆర్థిక, రాజకీయ సమస్యగా చూడాలని ప్రకాశ్ సింగ్ వాదించాడు. మావోయిస్టు నాయకత్వాన్ని భౌతికంగా నిర్మూలించే పథకాన్ని వ్యతిరేకించాడు. 'తీవ్రవాద ప్రభావిత ప్రాంతాల్లో అభివృద్ధి సవాళ్లు' అనే అంశంపై కేంద్ర ప్రభుత్వం తరఫున ప్రణాళికా సంఘం నియమించిన నిపుణుల అధ్యయన బృందంలో సభ్యుడుగా బి డి శర్మ, ఎస్ ఆర్ శంకరన్, కె బాలగోపాల్ వంటి వారితో కలిసి పాల్గొన్నాడు. ఆ బృందం సిఫారసులు ఆదివాసుల సమస్యల పరిష్కారం విషయంలో ఉదార, ప్రజాస్వామిక ప్రతిపాదనలు చేశాయని పేరు తెచ్చుకున్నాయి.

మల్కన్ గిరి కలెక్టర్, ఇంజనీర్లు క్షేమంగా విడుదల అయిన తర్వాత, ప్రకాశ్ సింగ్ 2011 ఫిబ్రవరి 25 న హిందీ దినపత్రిక 'ప్రభాత్ ఖబర్' లో తన అభిప్రాయాలు ప్రకటించాడు. నవీన్ పట్నాయక్ ప్రభుత్వం మావోయిస్టులకు లొంగిపోయిందన్నాడు. మావోయిస్టులు పెట్టిన అన్ని డిమాండ్లనూ అంగీకరించి ప్రభుత్వం తలవంచిందనీ, మావోయిస్టుల ప్రతిష్టను పెంచిందనీ అన్నాడు. మావోయిస్టు ప్రతినిధులతో చర్చలలో ప్రభుత్వ ప్రతినిధులు తమ రాజకీయ చతురతను, నైపుణ్యాన్ని ప్రదర్శించలేదని అన్నాడు. 'ప్రజల కోసం' పని చేస్తున్న కలెక్టర్ వినీల్ కృష్ణను చంపే ధైర్యం మావోయిస్టులకు లేదనీ, అందువల్ల కొన్ని డిమాండ్లను మాత్రం ఆమోదించి, ఆ తర్వాత మావోయిస్టులను బెదిరించి ఒత్తిడి పెంచి ఉండవలసిందనీ అన్నాడు. ఇకముందు ప్రభుత్వాధికారు లను బందీలుగా పట్టుకోవడం లాంటి చర్యలకు పాల్పడకుండా కఠిన వైఖరి అవలంబించాలని అన్నాడు. ఒకవైపు మావోయిస్టులను అంతర్గత భద్రతకు ప్రధాన ముప్పుగా ప్రకటించిన ప్రభుత్వం వారికి వ్యతిరేకంగా అన్ని వేదికలమీదా పోరాడడం లేదనీ, వారిపై నిర్ణయాత్మకంగా కాక, ఊగిసలాడే ధోరణితో, బలహీనంగా వ్యవహరిస్తున్నదనీ అన్నాడు.

మావోయిస్టు పార్టీ మల్కన్‌గిరి కలెక్టర్ ను, ఇంజనీరును అరెస్టు చేసి 14 డిమాండ్లు పరిష్కరించాలని కోరింది. ఈ డిమాండ్లు ప్రజలకు సంబంధించినవీ, ప్రజాస్వామికమైనవీ, ప్రకాశ్ సింగ్ విశ్వసించే రాజ్యాంగ విలువలకు లోబడినవీ కూడా. ఇందులో ఎనిమిది డిమాండ్లను ప్రభుత్వం అనిశ్చితంగా, తక్షణమే తేలని విధంగా, సూత్రప్రాయంగా మాత్రమే ఆమోదించింది.

ఆ డిమాండ్లలో ఒడిశాలోని జోడియా, కొండరెడ్లు, నూకరెడ్లు వంటి ఆదివాసులను షెడ్యూల్డ్ ట్రైబ్స్ (ఆదివాసి తెగలుగా – ఎస్టీలుగా) గుర్తించాలనీ, పోలవరం ప్రాజెక్టు నిర్మాణాన్ని నిలిపివేయాలనీ, మాలి – దేవమాలి పర్వతాల్లో బాక్సైట్ తవ్వకాలను నిలిపివేయాలనీ

---

లెఫ్ట్ ఫ్రంట్ ప్రభుత్వం తన పాలనలోని అభివృద్ధి గురించి ఇతర ప్రాంతాలలో తన పార్టీ యూనిట్‌ల ద్వారా ఎంత ఘనకీర్తి ప్రచారం చేసుకున్నా, వాస్తవ పరిస్థితికి ఈ అంకెలు అద్దం పడతాయి. ఆదివాసీ ప్రజల జీవితాలతో జ్యోతిబసు – బుద్ధదేవ్ ప్రభుత్వాలు ఆటలాడాయని అర్థమవుతుంది. లాల్‌ఘడ్ పోరాటం ద్వారా ప్రజలు తమ అభిప్రాయాలు ప్రకటించారు. దావాలనంలో సాగిన ప్రజా ఉద్యమం, ఆదివాసీ తిరుగుబాటు ద్వారా చరిత్ర పుటలలో వాస్తవాలను నమోదు చేశారు. ఈ ప్రభుత్వానికి ఇంకెంత మాత్రమూ అధికారంలో ఉండే హక్కు లేదని ప్రకటించారు.

*(మూల రచయిత సామాజిక అన్వేషకుడు)*

*(ఈ వ్యాసం బెంగాలీ దిన పత్రిక 'ప్రతిదిన్'లో 6 ఏప్రిల్ 2011న అచ్చయింది. తెలుగు అనువాదం : సాక్షి మహతో)* వీ

డిమాండ్లున్నాయి. ఇవి ఇప్పటి ప్రజల డిమాండ్లు మాత్రమే కాదు. మావోయిస్టు పార్టీ, ప్రజా సంఘాల నాయకత్వంలో ప్రజలు వేలాదిగా కదిలి ఆ డిమాండ్ల మీద ఎంతోకాలంగా పోరాడుతున్నారు. కనీసం ఐదు సంవత్సరాలుగా ఈ డిమాండ్లపై ప్రజాస్వామికంగా, అన్ని పోరాట రూపాలతో ప్రజలు పోరాడుతున్నారు. ఇందులో ప్రస్తుతం కలెక్టర్ ను అరెస్ట్ చేసిన కట్ ఆఫ్ ఏరియా ప్రాంతం (బలిమెల జలాశయం వల్ల తెగిపోయిన ప్రాంతం) సమస్యలను పరిష్కరించాలనే డిమాండ్ కూడ ఉంది. ఈ డిమాండ్ సాధన కొరకు 2009 మధ్యలో నెలరోజుల పాటు ప్రజాందోళన జరిగింది. ఈ డిమాండ్ పైనే 25 వేలమంది ప్రజలు రెండు రోజులపాటు చిత్రకొండ సెంటర్‌ను ముట్టడించారు. ఆ సందర్భంగా ఈ ప్రజల సమస్యలను పరిష్కరిస్తామని డిప్యూటీ కలెక్టర్ ప్రజల ముందే ఒప్పుకున్నాడు. కాని వాటిని పాక్షికంగానే అమలు జరిపారు.

నూకరెడ్లు, కొండరెడ్లను పక్కనే ఉన్న ఆంధ్రప్రదేశ్ లోని విశాఖపట్నం, తూర్పు గోదావరి జిల్లాల్లో ఆదివాసి తెగలుగా, ఎస్టీలుగా గుర్తిస్తున్నారు. కాని సరిహద్దు అవతల ఒడిశాలో అక్కడి రాష్ట్ర ప్రభుత్వం వారిని ఆదివాసుల జాబితాలో పెట్టలేదు. అడవి ఆదివాసులది. వారు అడవంతా ఉంటారు. రాష్ట్రాల సరిహద్దులు వారికి సంబంధించినవి కాదు. వారికి తెలియని సరిహద్దులను విధించి వారిలో కొందరిని ఆదివాసేతరులుగా మార్చడం ఘోర అన్యాయం, అప్రజాస్వామికం. ఇలా చేస్తున్నారంటే, ఆదివాసుల సంక్షేమం గురించి జోరుగా ప్రచారం చేసుకునే ప్రభుత్వానికి, రకరకాల విభాగాల అధికారులకు కనీస నైతికత లేదనే చెప్పాలి. ఇక, పోలవరం, మాలి – దేవమాలి విస్థాపన సమస్యలను ప్రభుత్వం ఆమోదించిన ఆదివాసీ చట్టాల పరిధిలో, పర్యావరణ పరిరక్షణ పరిధిలోనైనా చూడవలసి ఉంది. ఆదివాసులు సుదీర్ఘకాలం పోరాడి సాధించుకున్న ఆదివాసి హక్కుల చట్టాలు కేవలం ప్రచారానికి మిగిలి పోగూడదు.

ఒడిశా జైళ్లలో సంవత్సరాలుగా మగ్గుతున్న 700 మంది ఆదివాసి స్త్రీ, పురుషులపై బనాయించిన తప్పుడు కేసులను ఎత్తివేసి విడుదల చేయాలనేది మరొక డిమాండ్. అలాగే గంటి ప్రసాదం, శ్రీరాముల శ్రీనివాస్, పద్మ (శిరీష)లతో పాటు మరికొందరిని విడుదల చేయాలనేది మరొక డిమాండ్. జార్ఖండ్ జైలులో నిర్బంధంలో ఉన్న శీలా దీదీని, చత్తీస్ ఘడ్ జైలులో నిర్బంధంలో ఉన్న పద్మను విడుదల చేయాలనేది ఇంకొక డిమాండ్. తన పాలనకు మార్గదర్శి రాజ్యాంగమేనని చెప్పుకునే నవీన్ పట్నాయక్ ఇవాళ ఒడిశాలో భూస్వామ్య, నిరంకుశ రాజ్యాన్ని నడుపుతున్నాడు. చట్టం ప్రకారం బెయిల్ అనే హక్కు కాగితాలపైనే ఉంటుంది. ఈ బెయిల్ అనే కనీస హక్కు పీడిత ప్రజలకు, ఉద్యమకారులకు మాత్రం నిషేధం. ఏళ్ల తరబడి అప్రకటిత శిక్షను అనుభవించవలసిందే. వందలాది మంది ఆదివాసులపై, ముఖ్యంగా మహిళలపై ఎన్నో అక్రమ కేసులు బనాయించారు. ఈ మహిళలు జైళ్లలో ఉండగా వారి పిల్లలు ఇళ్ల దగ్గర వేదనకు గురవుతున్నారు. జైళ్లలో ఉన్న వారిని చూడడానికి పిల్లలు, బంధువులు వస్తే వారిని గుర్తింపు కార్డులు చూపమని అధికారులు వేధిస్తున్నారు.

శ్రీరాముల శ్రీనివాస్‌ను అరెస్టు చేసినప్పుడు చిత్రహింసలు పెట్టారు. ఆ చిత్రహింసలలో ఆయన చేతులు విరిగిపోయాయి. విరిగిన చేతి బ్యాండేజి తోనే ఆయనను న్యాయమూర్తి ముందు హాజరు పరిచారు. ఆ న్యాయమూర్తికి ఆ విరిగిన చెయ్యి కనబడలేదు. పోలీసుల చిత్రహింసల గురించి పట్టించుకోలేదు. ఆ న్యాయమూర్తి దృష్టికి పోలీసుల చట్టవిరుద్ధ ప్రవర్తన కనబడలేదు. పద్మ (శిరీష) ఎన్నో సంవత్సరాలుగా బహిరంగంగా ప్రజా జీవితం గడుపుతున్నారు. మూడు సంవత్సరాలుగా హైదరాబాద్ లో ఒక పిల్లల హాస్టల్‌లో ఉద్యోగిగా ఉన్నారు. పిల్లలకు సేవలందించే అమ్మగా గుర్తింపు పొందారు. ఈ విషయం ఆ పిల్లలే ప్రత్యక్షంగా పత్రికలకు చెప్పారు. నరహంతక ఆంధ్రప్రదేశ్ ఎస్.ఐ.బి. పోలీసులు పద్మను ఆంధ్ర ప్రదేశ్‌లోనే అరెస్టు చేసి , కోరాపుట్‌లో కేసు బనాయించి జైలుకు పంపారు. ఇక గంటి ప్రసాదం ఆంధ్రప్రదేశ్‌లో అమరుల బంధుమిత్రుల సంఘం అధ్యక్షుడు. చట్టబద్ధమైన, బహిరంగమైన, అధికారిక అనుమతి కూడ పొందిన సభల్లోనే వందలాది ఉపన్యాసాలు ఇచ్చారు. తాను మావోయిస్టు రాజకీయాలను విశ్వసిస్తానని నిజామాబాద్ కోర్టులో బహిరంగంగానే ప్రకటించాడు. ఆంధ్ర ప్రదేశ్ ఎస్.ఐ.బి., గ్రేహౌండ్స్ బలగాలు ఆయనను విశాఖపట్నంలో అరెస్టు చేసి, ఒడిశాలో అక్రమకేసు బనాయించి, కోరాపుట్ జైలులో నిర్బంధించాయి. గంటి ప్రసాదం చేసిన రాజద్రోహం ఏమిటి? మరి ఎస్.ఐ.బి., గ్రేహౌండ్స్ బలగాలు పాల్పడిన దేశద్రోహం గురించీ, చట్ట వ్యతిరేక ప్రవర్తన గురించీ ప్రకాశ్ సింగ్ నోరు మెదపడు గదా!

నారాయణపట్నం ఆందోళన సందర్భంగా 135 మంది ఆదివాసులను అక్రమంగా అరెస్టు చేసి కోరాపుట్ జైలులో నిర్బంధించారు. ఇందులో ఇద్దరు ఆదివాసులు ఎలాంటి వైద్య సదుపాయం లేక, అందక మరణించారు. దీనిపై న్యాయవిచారణ జరపాలనేదీ, నష్టపరిహారం చెల్లించాలనేదీ మరొక డిమాండ్. కేంద్ర మంత్రులు మొదలు చోటామోటా రాజకీయ నాయకుల వరకూ అరెస్టు అయితే, ఉండేది జైలులో కాదు గదా! అరెస్టయిన తక్షణం అనారోగ్య పీడితుల జాబితాలో చేరి కార్పొరేట్ ఆస్పత్రులే వారి పడకగదులుగా మారుతాయి గదా! మరి జైలులో ఉన్న ఆదివాసుల కనీస ఆరోగ్య వసతుల గురించి, అనారోగ్యం గురించి మాత్రం మావోయిస్టులే ఎందుకు డిమాండ్ చేయాలి? అనారోగ్యం గురించి తెలియగానే ప్రభుత్వం ఎందుకు తగిన చికిత్సను, వైద్య సహాయాన్ని అందించదు? కలెక్టర్లు, ప్రభుత్వాధికారులు ఆ అనారోగ్య సమస్యల పరిష్కారానికి ఎందుకు పూనుకోరు?

ఒక నూతన ప్రజాస్వామిక వ్యవస్థ సాధన కొరకు సాయుధ పోరాటం చేస్తున్న మావోయిస్టులు చాలా ప్రజాస్వామికమైన డిమాండ్లను, చట్టబద్ధంగా పరిష్కరించగలిగిన డిమాండ్లను, ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను మాత్రమే కలెక్టర్ అరెస్టు సందర్భంగా సభ్య సమాజం ముందు, ప్రభుత్వం ముందు ఉంచారు. 'ప్రజల సంక్షేమం కొరకు పనిచేస్తున్న కలెక్టర్ ను చంపే ధైర్యం మావోయిస్టులకు లేదు. ప్రభుత్వం అన్ని డిమాండ్లను ఆమోదించకుండా, ఒత్తిడి పెంచి ఉండవలసింది' అని ఇప్పుడు ప్రకాశ్ సింగ్ రాస్తున్నాడు. కాని ప్రకాశ్ సింగ్ చెపుతున్నట్టు ప్రభుత్వం మావోయిస్టుల డిమాండ్లన్నిటినీ ఒప్పుకోలేదు సరిగదా ఆమోదించిన డిమాండ్లను కూడ వెంటనే శషభిషలు లేకుండా ఆమోదించలేదు. ఫిబ్రవరి 24న ఒప్పుకున్న డిమాండ్లను మే 24 నాటికి, మూడు నెలలు గడిచిన తర్వాత, కూడ అమలు చేయలేదు. ప్రకాశ్ సింగ్ వంటి పాలకవర్గ ప్రతినిధులకు, ఈ ప్రభుత్వ నీతిబాహ్యమైన, అప్రజాస్వామికమైన చర్యలు కనబడవు.

ఇంతకూ కలెక్టర్‌ను చంపడమా, చంపకపోవడమా, హాని చేయడమా, హాని చేయకుండా వదలడమా అనే సమస్యే తలెత్తలేదు. అలాగే ప్రభుత్వ అధికారులను అరెస్టు చేసి ప్రజాసమస్యలను పరిష్కరించ వచ్చుననేది మావోయిస్టు విధానమేమీ కాదు. ప్రజలు సుదీర్ఘకాలంగా

*మానవ శ్రమ చవకగా దొరికే చోట ఉత్పత్తులూ, సేవలూ చవకగానే దొరుకుతాయనీ, మన వైద్యం చవక వైద్యమే కానీ, చవకబారు కాదని అంటున్నారు* **ఇ.ఎస్. బ్రహ్మచారి**

# చౌక వైద్యమా? చౌకబారు వైద్యమా?

'చౌక (బారు) చికిత్స కోసం మీరు మెక్సికోకో ఇండియాకో పోవడం నాకు ఇష్టం లేదు. ఇక్కడే అమెరికాలోనే మెరుగైన వైద్యం పొందేట్లు చూడాలనుకుంటున్నాను – ఇక్కడే ఖర్చు తగ్గించగలమేమో చూద్దాం' అన్నాడు ఒబామా. 'అమెరికాలో కనుక్కున్న మందులు విదేశాల్లో కంటే ఎక్కువ ధర ఉండటమేమిటి?' అని అడిగాడు.

'మందుల ధరలు బేరమాడదాం. మెక్సికో కెనడాల్లో కంటే ఇక్కడ 30 శాతం దాకా ఎక్కువ ధరలున్నాయని మోసానికి గురవుతున్నామని అనుకోకుండా చేద్దాం' అంటుండగానే, చప్పట్లతో  హాలు మార్మోగి పోయింది – అంతా అయినట్టే.

అమెరికాలో వైద్యఖర్చులు పెరిగిపోతున్నాయని ఒబామాని అడిగినప్పుడు పై సమాధానమిచ్చి మెప్పించాడు. ఏప్రిల్ 20న వర్జీనియాలోని ఒక కమ్యూనిటీ కాలేజ్‌లో సన్నివేశమిది.

ఇండియా ప్రభుత్వమూ, వైద్యులూ 'చౌకబారు' వైద్యం అనటాన్ని తీవ్రంగా తప్పుబట్టారు. చౌకబారు కాదు భరించదగిన వైద్యం అన్నాడు ఆజాద్. ప్రమాణాల విషయంలో ఏమాత్రం రాజీ పడటం లేదు అన్నాడు. అందుబాటులో ఉన్నంత మాత్రాన అగ్రరాజ్యాల(సూపర్ పవర్స్) వైద్యాని కంటే తక్కువ రకం అని అర్థం కాదు. మామందులు మాదేశంలోనే తయారయినవి. అవి మెరుగైనవి. మెరుగ్గా ఉండడం ఎక్కువ ధర వల్ల వచ్చేది కాదు అన్నాడు. అదే మందుని ఇక్కడ ధరకి పదింతలకి అమ్మే దేశాలున్నాయి. చౌక అనే మాటే చౌకబారు మాట అని కొట్టిపారేశాడు.

ఒబామా రక్షణ విధానాన్ని అవలంబిస్తున్నాడు అని ప్రతిపక్ష బి.జె.పి. ఆరోపించింది. గుండె శస్త్ర నిపుణుడు నరేష్ తెహరాన్ ఇండియాలో వైద్య సంస్థల ప్రమాణాలు అమెరికా ఉన్నత సంస్థలంతన్నా ఉంటాయి. ఎక్కువగా కూడా ఉంటాయి.

అంతర్జాతీయంగా ఇండియా మందుల కంపెనీలు పోటీలో ముందున్నాయనీ, విదేశాలనుంచి వచ్చే వారికి అంతర్జాతీయ స్థాయి

---

పోరాడుతూ ముందుకు తెచ్చిన డిమాండ్లనే, ప్రభుత్వాలు చిరకాలంగా పరిష్కరించకుండా ఉన్న డిమాండ్లనే మావోయిస్టులు చర్చకు పెట్టారు. మావోయిస్టుల తరఫున చర్చలలో పాల్గొన్న మధ్యవర్తులు ఆ సమస్యల నేపథ్యాన్ని రాజకీయంగా చర్చించారు. సమస్యల సాధన కంటే రాజకీయంగా తమ వైఖరిని బహిర్గతం చేయడంలో మావోయిస్టులు సఫలమయ్యారు.

కలెక్టర్ ను బందీగా పట్టుకున్న తర్వాత ప్రభుత్వ సంస్థలు, ప్రభుత్వేతర స్వచ్ఛంద సంస్థలు, గనుల కంపెనీలు తమ కాన్వెంట్ పిల్లలను, ఇతరులను రోడ్లమీదికి దింపి ప్రదర్శనలు జరిపించాయి. దోపిడీ వర్గాల మీడియా సహజంగానే ఈ ప్రదర్శనలకు ప్రచారం కల్పించాయి. మరి కలెక్టర్ బందీగా ఉన్నప్పుడు మావోయిస్టులు వేలాది మంది పీడితప్రజల ముందు ప్రజాకోర్టులు నిర్వహించి, కలెక్టర్ ను అక్కడ హాజరుపరిచారు. ఆ ప్రజలే మొత్తం వారం రోజులు తమ సమస్యలను, ప్రభుత్వ అణచివేత విధానాలను కలెక్టర్ ముందు వెల్లడించారు. మావోయిస్టులూ, ప్రజలూ కలెక్టర్ ను గౌరవంగా చూశారనీ, కలెక్టర్ కూడ ప్రజల సమస్యలను ఓపికగా విన్నాడనీ, స్వేచ్ఛగా ఉన్నాడనీ కూడ బూర్జువా మీడియాలో, పత్రికలలో వచ్చింది నిజమే.

విప్లవకారులను సాయుధంగా అణచివేయడమే దోపిడీ వర్గాల నీతి. ఇదే వారి ప్రధాన విధానం. ఆ అణచివేతకు వివిధ సెక్షన్ల ప్రజల నుండి, మేధావుల నుండి నిరసన వ్యక్తమయినప్పుడు ప్రభుత్వం, అధికారులు పాడేపాట మావోయిస్టు 'సమస్య' సామాజిక రాజకీయ ఆర్థిక సమస్య అని. కాని ఈ పాట కొంతకాలమే నడుస్తుంది. అవసరం తీరగానే అణచివేత విధానానికి సమర్థన మొదలవుతుంది. ఇప్పుడు ప్రకాశ్ సింగ్ కూడ ఈ ఉదారవాద బురఖాను తొలగించుకుని తన సాయుధ అణచివేత సమర్థన విధానాలను బహిర్గత పరిచాడు. కలెక్టర్ ను బందీగా తీసుకున్న సంఘటనను సాకుగా తీసుకుని, మావోయిస్టులమీద హింస, బెదిరింపు అమలు చేయవలసిందనీ, ఒత్తిడి పెంచవలసిందనీ అంటున్నాడు. ఈ ప్రకటనను బట్టే, ఈ సమాజంలో హింసను ఎవరు కోరుకుంటున్నారో, ప్రజాస్వామ్యం, ప్రజాసమస్యల నిజమైన పరిష్కారం, స్వావలంబన ఎవరు కోరుకుంటున్నారో అర్థమవుతుంది. ఉదార ప్రజాస్వామ్యవాదులు, బుద్ధిజీవులు అర్థం చేసుకోవలసిన సమస్య ఇది.

ముందే చెప్పినట్టు ఒడిశా ప్రభుత్వం మధ్యవర్తులతో ఒప్పందంపై సంతకాలు చేసి మూడు నెలలు గడిచినా, ప్రకాశ్ సింగ్ ఈ వ్యాఖ్యలు చేసిన మూడు నెలల తర్వాత కూడ, ఆ ఒప్పందంలో ఒక్క అంశమయినా అమలులోకి రాలేదు. ప్రభుత్వం గ్రీన్ హంట్ ఆపరేషన్ ను యథాతథంగా కొనసాగిస్తూనే ఉంది. మావోయిస్టులు తమ రాజకీయ లక్ష్యసాధన కొరకు ప్రజాపోరాటాన్ని కొనసాగించక తప్పదని ఈ అనుభవం మరొకసారి తెలియజెపుతోంది. ప్రజల డిమాండ్లను ప్రభుత్వాలు సూత్రప్రాయంగా ఆమోదించినా, ఆమోదించకపోయినా, అంతిమంగా పరిష్కరించకపోతే, మావోయిస్టులు, ప్రజలు, ప్రజాస్వామిక శక్తులు ప్రభుత్వపు కుటిలత్వాన్ని బహిర్గతం చేస్తూ విస్తృతంగా ప్రజలను కదిలించి పోరాడక తప్పదు.

*(రచయిత ఆంధ్ర – ఒడిశా సరిహద్దు విప్లవోద్యమ నాయకులు)* వీ

వైద్యాన్ని భరించదగ్గ ఖర్చుకే అందిస్తున్నామనీ నిర్మలా సీతారామన్ అన్నారు. ఒబామా తన ప్రజలకి వైద్యాన్ని అందుబాటులోకి తెస్తే మంచిదే అన్నాడు తెహరాన్. 'విదేశీయులు వైద్యానికి రావడం ఇండియాలో చౌక అని కాదు, మెరుగైన వైద్యం తట్టుగోగల ఖర్చుకే లభిస్తుందని' అన్నాడు. వైద్యం అమెరికాలో చాలా ఖరీదయింది. సామాన్యులు భరించలేనిది.

అక్కడ ఎక్కువ బడా కార్పొరేట్ హాస్పిటల్సే. డాక్టర్లకు భారీ వేతనాలుంటాయి. చిన్న చిన్న క్లినిక్స్ ఎక్కడోగాని ఉండవు. ప్రభుత్వ ఉచిత ఆసుపత్రులు చాలా తక్కువ ఉంటాయి. కనక పెద్ద ఆసుపత్రులే దిక్కు. వైద్యుల ఫీజు సామాన్యులు భరించేది కాదు. ఆరోగ్యపరీక్షలు అక్కడే చేయించాలి. చాలా ఖరీదవుతాయి. ఇటీవలి కాలంలో ఇవి మనకీ అనుభవమవుతున్నయి. ఆయితే మామూలు జనానికి చిన్న ఆసుపత్రులు ఎక్కడైనా ఉన్నాయి. ప్రభుత్వ అసుపత్రులూ ఏదోస్థాయిలో పనిచేస్తున్నాయి.

అమెరికా పోయే వాళ్లు తప్పనిసరిగా అవసరమైన మందులు తీసుకెళతారు. అక్కడ మందులు ఖరీదు ఎక్కువ. అదలా ఉంచి, వైద్యుడు రాయనిదే మందులు అమ్మరు. అందుకు బాగా ఖర్చవుతుంది. తల్లిదండ్రులు అమెరికా వెళ్లి జబ్బున పడితే వాళ్లకి చాలా ఖర్చు. బీమా చెయ్యాలన్నా ఖర్చే. తల్లిదండ్రులమీద ఎంత ప్రేమ ఉన్నా ఖర్చులు తగ్గించుకొని దాచుకున్న డాలర్లు కరిగి పోతుంటే దిగులు సహజం.

అమెరికాలో వైద్యానికి ఖర్చు పైపైకి ఎక్కుతోంది. ఇండియాలో అక్కడయ్యే ఖర్చులో పదోవంతు మాత్రమే అవుతుంది. ఇంకా తక్కువ కూడా కావచ్చు అందుకే కొందరు ఇక్కడకొచ్చి చికిత్స చేయించుకు పోతారు.

గుండె బైపాస్‌కి అమెరికాలో (1,40,000) అయ్యేదానిలో ఇండియాలో 20 వ వంతు (7000) అవుతుంది.

హిప్ రిప్లేస్ మెంట్ సర్జరీ ఇకడ 6 వేలడాలర్లతో అయిపోతుంది అదే అమెరికాలో అంతకు నాలుగింతలు (24,000) చెల్లించాల్సిందే. రెండు చోట్లా పద్ధతులొకటే. హిప్‌లో పెట్టే వస్తువు అమెరికాదే. గుండె కవాట మార్పిడికి అక్కడ 2 లక్షల డాలర్లయితే ఇక్కడ 10 వేల డాలర్లతో ముగుస్తుంది. కాస్మెటిక్ సర్జరీ అమెరికాలో 20 వేలయితే ఇండియాలో 2వేలే. అంటే పదోవంతే. చికిత్స కోసం వారాల తరబడి ఆగాల్సిన పనిలేదు. అంతర్జాతీయ స్థాయి ప్రమాణాలున్న ఆసుపత్రులున్నాయి. మంచి సౌకర్యాలు ఉంటాయి.

గొప్ప ఆసుపత్రుల్లో వైద్యానికయ్యే ఖర్చులు (అమెరికా డాలర్లలో) అమెరికాలో, ఇండియాలో:

| చికిత్స | అమెరికాలో (డాలర్లు) | ఇండియాలో (డాలర్లు) |
|---|---|---|
| కాలేయ మార్పిడి | 3,00,000 | 69,000 |
| ఎముక మజ్జ మార్పిడి | 2,50,000 | 69,000 |
| ఏంజియో ప్లాస్టీ | 57,000 | 11,000 |
| హిస్టెరెక్టమీ | 20,000 | 3,000 |
| మోకాలు కీలు మార్పిడి | 40,000 | 8,500 |
| ఓపెన్ హార్ట్ సర్జరీ | 1,00,000 | 7,500 |
| గాస్ట్రిక్ బైపాస్ (ఊబకాయానికి) | 65,000 | 9,500 |
| కొవ్వు లాగటం | 10,000 | 2,500 |
| ఫేస్ లిఫ్ట్ | 20,000 | 3,000 |
| రూట్ కెనాల్ (పంటికి) | 1,000 | 100 |
| మెటల్ ఫ్రీ బ్రిడ్జ్ (పళ్లకి) | 5,000 | 500 |

మరొక స్త్రీ గర్భంలో పిండం ప్రవేశపెట్టి బిడ్డని పొందడానికి అమెరికాలో మొత్తం ఖర్చు 5 లక్షల డాలర్ల దాకా అవుతుంది. ఆదే ఇండియాలో 40 వేల డాలర్లవుతుంది. అందుకే గుజరాత్ ఆసుపత్రులకి విదేశీజంటలు ఎగబడుతున్నారు. అంతంత డబ్బు వైద్యానికి పెట్టగలిగే స్థితిలో ఎక్కువమంది అమెరికన్లు లేరు. మధ్యతరగతి వాళ్లు కూడా ఈధరలు భరించలేరు. పేదలసంఖ్య పెరుగుతున్నది.

| సంవత్సరం | పేదల సంఖ్య | జనాభాలో శాతం |
|---|---|---|
| 2007 | 3 కోట్లా 73 లక్షలు | 12.5 |
| 2008 | 3 కోట్లా 98 లక్షలు | 13.2 |
| 2009 | 4కోట్ల 36 లక్షలు | 14.3 |
| 2010 | 4 కోట్లా 78 లక్షలు | 15.7 |

ఈ లెక్కలు తీస్తున్న 51 సంవత్సరాల్లోనూ 2010లో ఉన్నంతమంది పేదలు ఎన్నడూ లేరు. పైపట్టిక చూస్తే, ఏటికేటికీ పెరుగుతున్నట్లు స్పష్టమవుతుంది. పేదల శాతం 1994 తర్వాత ఇదే ఎక్కువ. నిరుపేదలు 1 కోటీ 90 లక్షలమంది (6.3 శాతం). వాళ్ల ఆదాయం దారిద్ర్య రేఖలో సగానికన్నా తక్కువ. అంటే నలుగురున్న కుటుంబానికి ఏడాది మొత్తంలో 11 వేల డాలర్లకి మించదు.

2007లో 2 కోట్లా 60 లక్షలమంది మంది అన్నం చీటీలు తీసుకుంటే, 2010 లో 4 కోట్లా 36 లక్షలమంది వాటితో బతికారు. 1కోటీ 76 లక్షలమంది పెరిగారు. వీళ్లు హాస్పిటల్ ఖర్చులు భరించలేరని వేరే చెప్పక్కర్లేదు.

బీమా లేకపోతే చాలా మందికి వైద్య చికిత్సఅసాధ్యం. ఆ సౌకర్యం అందరికీ ఉండదు. 2009లో ఆరోగ్య బీమా లేని వాళ్లు 5 కోట్లా 7 లక్షలు (16.7 శాతం). 2008లో 4 కోట్ల 63 లక్షలమంది (15.4 శాతం)కి ఆరోగ్య బీమా లేదు. వీళ్లలో 60 శాతం మంది సంవత్సర ఆదాయం 50 వేల లోపు వచ్చే కుటుంబాల వాళ్లే.

15 ఏళ్లు పైబడ్డ అమెరికన్లలో దాదాపు సగం మందికి సంవత్సరానికి 25 వేల డాలర్ల లోపు ఆదాయం ఉంటుంది. 25 - 50 వేల మధ్య ఆదాయం వచ్చే వాళ్లు 25 శాతం మంది ఉంటారు. అంటే అమెరికాలో నూటికి 75 మంది ఆదాయం 50 వేలు దాటదు.

ఆరోగ్య ఖర్చులు భరించలేక దివాలా తీసే వాళ్లూ తక్కువేమీకాదు. ఇలాంటివి మొత్తం దివాలాల్లో 2001 లో 46.2 శాతం. అక్కడనుంచీ వైద్య ఖర్చులు అదుపు తప్పాయి. 2007లో దివాలాలు 62.5 శాతం ఆరోగ్యానికి చెందినవే. అదే 1981-82 లో 8 శాతమే. అరేళ్లలో పెరుగుదల 50 శాతం అన్నమాట. వీళ్లలో 92 శాతం మంది వైద్య రుణం 5 వేల డాలర్ల కన్న ఎక్కువ. కుటుంబ ఆదాయంలో 10 శాతం కన్నా ఎక్కువ. ఉద్యోగాలు పోయి ఆదాయాలు తగ్గేకొద్దీ దివాలాలు ఎక్కువవుతాయి. 2009, 2010 రెండేళ్లలో 90 లక్షలమంది బీమా కోల్పోయారు. కారణం నిరుద్యోగమూ, పెరిగిన ఖర్చులూ.

బీమా ఖర్చులు పెరిగి నందువల్ల చాలామంది యజమానులు ఆరోగ్యబీమా సౌకర్యం కల్పించడం తగ్గించారు.. అలాంటి చోట్ల పనిచేసే

| సంవత్సరం | బీమాలేనివారి సంఖ్య | జనాభాలో శాతం |
|---|---|---|
| 2007 | 4 కోట్ల 57 లక్షలమంది | 15.3 |
| 2008 | 4 కోట్ల 63 లక్షలమంది | 15.4 |
| 2009 | 5 కోట్ల 07 లక్షలమంది | 16.7 |
| 2010 | 5 కోట్ల 20 లక్షలమంది | |

ఉద్యోగులు తామే ఎక్కువ భాగం చెల్లించుకోవాలి. లేకపోతే బీమా లేకుండానే నెట్టుకు పోవాలి. బీమా లేనందువల్ల సరైన వైద్యం చేయించుకోలేక ఏటా 45,000 మంది మృత్యువాత పడుతున్నారని హార్వర్డ్ యూనివర్సిటీ అధ్యయనంలో తేలింది.

ఒకేరకం వస్తువులు ఎక్కడ చౌక (చీప్) అయితే అక్కడే ఎక్కువ అమ్ముడవుతాయి– అనేది మార్కెట్ సూత్రం.దాన్ని కాదనలేదు. అందుకే చౌక బారు (చీప్) అనే అర్థంలో వాడాడు.అమెరికాది మెరుగైన (క్వాలిటీ) వైద్యం అని ప్రశంసించాడు. అన్నీ చూసుకునేగదా అమెరికన్లలో కొందరు ఈదేశాల బాట పట్టింది? వాళ్ల ఆలోచన వాళ్లది. వదిలెయ్యడమే. అయితే ఒబామా  అలా ఊరుకోదల్చుకోలేదు. అమెరికన్లు తక్కువకి ఆరోగ్యం పొందితే మంచిదేగదా! అది ఎక్కడైతే ఏం? ఎక్కడ తక్కువైతే చికిత్సఅక్కడ చేయించుకుంటారు. ఆయనకెందుకు? ఆయన బాధ అది కాదు.

ఎక్కడో వైద్యం చేయించుకుంటున్న అమెరికా ప్రజల గురించి కాదు.విదేశాలలో చేయించుకుంటున్నారని కాదు, ఆ డబ్బు అమెరికా అసుపత్రులూ, మందుల కంపెనీలూ కోల్పోతున్నాయని. ఇక్కడే చేయించుకోమని ప్రజలకి చెబుతున్నాడు. ఖర్చులు తగ్గించే ప్రయత్నం చేస్తానని హామీలిస్తున్నాడు. నమ్మి చప్పట్లు కొట్టారు. అమాయకంగా నమ్మిన జనం గనక. కార్పొరేట్ ఆసుపత్రుల యజమానులకీ, మందుల కంపెనీలకీ చెబితే అప్పుడు తెలుస్తుంది. అది అయ్యేపని కాదని. లాభలే లక్ష్యంగా పెట్టుకున్న కార్పొరేట్లని లాభాలు తగ్గించుకోమని అడగ గలడా? అసలు వాళ్లకోసమే గదా అమెరికాలోనే వైద్యం చేయించుకో మంటున్నది?

ఆదాయం అమెరికా వైద్య పరిశ్రమకి దక్కేట్టు చెయ్యాలనేదే ఆయన ఉద్దేశ్యం. పైకేమో ఇండియా మెక్సికో లాంటి దేశాలకు పోయి చౌక  బారు చికిత్స చేయించుకోవడం తనకు ఇష్టం లేదంటాడు ఒబామా.

**ఒకే రకం సరుకు అన్ని దేశాల్లో ఒకే ధర ఎందుకు ఉండదు?**

ఉత్పత్తి ఖర్చులు ఇతరదేశాల్లో కంటే అమెరికాలో కొన్ని రెట్లు ఎక్కువ. ఇండియా, చైనా ధరలకు అమెరికా సరుకులు గిట్టుబాటు కావు. ఏసరుకునైనా కూలీలే చేస్తారు. అయితే కూలి మాత్రం అన్ని దేశాల్లో ఒకటికాదు. హెచ్చుతగ్గులుంటాయి.కూలీ తక్కువ ఉన్న చోట ఎక్కువ ఉన్న చోటకన్నా సరుకు తక్కువకి తయారవుతుంది. మార్కెట్ పోటీలో నెగ్గుతారు. అమెరికా తయారీ పరిశ్రమలు ఎన్నో ఇతరదేశాలకు వెళ్లి పోయాయి. డెట్రాయట్‌లో ప్రస్తుతం జనాభా తగ్గడానికి అదొక ముఖ్య కారణం.అమెరికా నుంచి తలిదండ్రులకి పంపించే వస్తువులు చూస్తే చైనా తయారీ అనో కొరియా తయారీ అనో ఉంటుంది తప్ప అమెరికా మేడ్ అని ఎక్కడో కాని కనపడదు. అంతదాకా ఎందుకు, అమెరికా మాల్స్ లోనే అమెరికా వస్తువులు పెద్దగా ఉండవు.

అమెరికా కనీస వేతనం గంటకి 7.25 డాలర్లు. అదే చైనా షెంఝెన్ లో నెల కనీస వేతనం 201 డాలర్లు. వారనికి 6 రోజులూ, రోజుకి 10 గంటలూ పనిచేస్తే నెలకి 347 డాలర్లొస్తాయి. షెంఝెన్ లో గంటకి వేతనం 1.45 డాలర్లుగా లెక్కకోస్తుంది. అయితే చైనాలో కనీస వేతనాన్ని నెలకింతని చెబుతారు. ఇంకొక విషయం 2005లో కాలిఫోర్నియాలో గంట పనికి 20.84 డాలర్లు. మెక్సికోలో 2.96. చైనాలో 72 సెంట్లు. 2000లో అమెరికలో 21, మెక్సికోలో 3.41డాలర్లు, చైనాలో 50 సెంట్లు.

1990 నుంచీ 2009 నాటికి 60 లక్షల తయారీరంగ ఉద్యోగాలు అమెరికా నుంచి తక్కువ వేతనాల దేశాలకు తరలి పోయాయి. దాంతో అమెరికా కార్మికులకి డిమాండ్ లేక జీతాలు తగ్గాయి.

చైనా సరుకులు మన మార్కెట్‌నూ ముంచెత్తుతున్నాయి. కారణం మనకన్నా చౌకగా ఇవ్వడమే. అంతేగాని చౌక బారు వయినందువల్ల కాదు. చైనాలో ఉన్న తైవాన్ ఎలెక్ట్రానిక్స్ తయారీ సంస్థ ఫాక్స్ కాన్. ఇది ఆపిల్, డెల్, ఎచ్.పీ., నింటెండో, నోకియా, సోనీ ఎరిక్సన్, మోటరోలా లాంటి ఎన్నో అంతర్జాతీయ సంస్థలకి హైస్థాయి సరుకుల్ని తయారుచేసి ఇస్తుంది. ఆ ఉత్పత్తుల మీద వచ్చే లాభాల్లో సింహ భాగం అమెరికా, జపాన్, యూరప్ దేశాల కార్పొరేట్లకు చేరతాయి. ఉదాహరణకి, ఒక ఐపాడ్ సమకూరిస్తే బయట దేశాల్లో 499 డాలర్లకి అమ్మే ఐపాడ్‌ని ఫాక్స్ కాన్ 11.2 డాలర్లకే సమకూరుస్తుంది. ఇక దాన్ని తయారుచేసిన కార్మికుడికి ఎంత తక్కువ వెళుతుందో ఎవరైనా ఊహించవచ్చు.

సోనీ కంపెనీ తన టి.వి. ని అమెరికాలోనో జపాన్‌లోనో తయారు చేస్తే అదే కంపెనీ చైనాలో తయారు చేసిన అ దేరకం టి.వీ కంటే చాలా ఎక్కువ పడుతుంది–ఒకే రకం యంత్రాలతో కార్మికులు పనిచేసినా. కారణం అమెరికాలో ఇచ్చే దానిలో పదోవంతొ పదిహేనోవంతో ఇస్తే చైనాలో సరిపోతుంది. కనక చౌకగా తయారవుతాయి. అమెరికా కంపెనీలు అంతర్జాతీయ మార్కెట్లో పోటీలో నిలబడలేవు. జరిగిందదే, జరుగుతున్నదీ అదే.

ఎక్కడ వేతనాలు తక్కువయితే కంపెనీలు అక్కడకి రావడానికి ఇష్టపడతాయి. సాఫ్ట్ వేర్ కంపెనీలు ఇండియాలో పెరగడానికి కారణం, ఇక్కడ ప్రాజెక్టులు మరిన్ని ఉండికాదు. చేసేవాళ్లుఅమెరికాలో లేకా కాదు. అక్కడకంటే ఇక్కడ జీతాలు 10వ వంతు ఉండడమే.

తయారీ రంగ ఉత్పత్తి ప్రపంచం మొత్తంలో 2010 లో 10,078 బిలియన్ డాలర్లు. ఇందులో 19.8 శాతం చైనాది. అమెరికాని వెనక్కి నెట్టి మొదటి స్థానాన్నికైవశం చేసుకుంది. 19.4 శాతం వాటాతో అమెరికా రెండో స్థానానికి తప్పుకోక తప్పలేదు. స్థూలజాతీయోత్పత్తిలో జపాన్ని (5,474 బిలియన్ డాలర్లు) దాటి చైనా 5,879 బిలియన్ డాలర్లతో రెండో స్థానానికి ఎగబాకింది.  దానికీ దీనికీ ముఖ్య కారణం చౌక శ్రమే.

చైనా స్థూలజాతియోత్పత్తిలో రెండోస్థానానికీ, మాన్యుఫాక్చరింగ్ లో మొదటిస్థానానికీ ఎగబాకినా ఆ అభివృద్ధి ఫలాలు ఆయా కార్పొరేట్ సంస్థలకే గాని కార్మికులకి కాదు. ఫాక్స్ కాన్ కార్మికులు అతి దారుణమైన పరిస్థితుల్లో అతితక్కువ కూలికి పనిచేస్తున్నారు. ఆత్మహత్యలు కూడా చేసుకున్నారు.

సరుకులెలాగో సేవలూ అలాగే. వైద్య చికిత్సలో మందులు లాంటి సరుకులూ, వైద్యులూ, నర్సులూ చేసే సేవలూ కలిసే ఉంటాయి. అలాగే, అనేక పరికరాలూ, యంత్రాలూ ఉంటాయి. చౌక శ్రమ ఉన్నచోట ఇవన్నీ చౌకే. శ్రమ ఖరీదైన చోట అన్నీ ఖరీదే.

ఆహార ధరలూ , ఇంధన ధరలూ విపరీతంగా పెరిగి, ఆదాయంలో ఎక్కువ భాగం తిండి తిప్పలుకే పెట్టాల్సివస్తున్నది.అప్పులు పుట్టడం లేదు. తీర్చే అవకాశాలు తగ్గుతున్నాయి. కనక వైద్యఖర్చులు మరీ భారమవుతాయి.

**ఒబామా ఏంచేస్తే ఆయన మాట నిలబడుతుంది?**

మందుల ధరలూ, ఆసుపత్రి ఖర్చులూ, వైద్యుల ఫీజులూ తగ్గించాలి. పేదల ఆదాయం గణనీయంగా పెరగాలి. భీమా సంస్థలు ప్రజల కనుకూలంగా ఉండేట్లు చట్టాలు చేసి అమలు పరచాలి. వీటిలో ఏ ఒక్కటీ ఆయన వల్ల అయ్యేది కాదు. లేదా తేడా ఖర్చు ప్రభుత్వమే భరించాలి. అది వీలవదు. అసలే అప్పుల్లో కూరుకు పోయి ఉంది. రేటింగ్ తగ్గుతున్నది. ద్రవ్యలోటు పట్టపగ్గాలు లేకుండా పరుగులిడు తోంది. కట్టడి చెయ్యాలని ప్రతిపక్ష రిపబ్లికన్లు పట్టుబడుతున్నారు. చేస్తానని ఒబామా పదే పదే ప్రకటిస్తున్నాడు.

2010 బడ్జెట్‌లో 3850 కోట్ల డాలర్లు కోత పెట్టాకనే షట్‌డౌన్ నుంచి తప్పించారు రిపబ్లికన్లు. 2012 బడ్జెట్ ప్రతిపాదనల్ని బట్టి, వచ్చే పదేళ్లలో 1,10,000 కోట్ల డాలర్ల లోటు తగ్గించాలి. అంటే అమెరకు ఆదాయమన్నా పెంచాలి. ఖర్చులన్నా తగ్గించాలి. రిపబ్లికన్ల ప్లాన్ ప్రకారం, రాగల పదేళ్లలో 58 లక్షల కోట్ల డాలర్లు ఖర్చులు తగ్గించాలి. మెడికేర్, మెడికైడ్, సామాజిక భద్రతలకు మార్పులు సూచించారు. వీటివల్ల ఆయా ఖర్చులు ఆయా వ్యక్తుల మీదే పడతాయి. పన్నులు ఇప్పటికన్నా 4లక్షలా 20 వేల కోట్ల డాలర్లు తగ్గించాలి. అప్పు మే 13కి పద్నాలుగు లక్షలా ముప్పై ఏడు వేల కోట్ల డాలర్లు. ఒక్కొక్క పౌరుడి తలమీద 46,165 డాలర్ల అప్పు ఉంది. పైగా అక్కడ ప్రైవేట్ వైద్య రంగం శక్తివంతమైంది. ప్రభుత్వంలో, పార్టీలలో వాళ్ల లాబీయింగ్ బలమైంది. ఇటీవలి సెనేట్ ఎన్నికల్లో డెమాక్రట్లని ఓడించడంలో వైద్య రంగ కార్పొరేట్ల పాత్ర చిన్నదేమీ కాదు.

ఈ పరిస్థితుల్లో ఒబామా చెబుతున్నది ఏమాత్రం కుదిరేది కాదని ఎవరికైనా తేలిగ్గానే తెలుస్తుంది. మరింతమంది చౌక వైద్యం కోసం విదేశాలకు పోవాల్సి రావడం ఖాయం. ఇవన్నీ తెలియని అమాయకుడు కాదు ఒబామా. ఎప్పటికప్పటికి జనాన్ని మెప్పించడానికి అలాంటివి చెప్పడంలో అతనికతనే సాటి. అయితే వాస్తవాల్ని జనం ఆలస్యంగానైనా తెలుసుకుంటారు. అనుభవమే వాళ్లకి కళ్లుతెరిపిస్తుంది.

ఎన్నికల ముందు అన్నిదేశాల నాయకులలాగే అదిచేస్తా ఇదిచేస్తా అన్నీ చేస్తా అంటూ ఆర్భాటం చేశాడు. ఇప్పుడు కాసేపు చప్పట్లు మోగాయి. అప్పుడు ఎడతెరిపి లేకుండా మార్మోగాయి. గద్దెనెక్కాక ఏమీచేయలేక పోయాడు. మాంద్యాన్ని ఆపలేకపోయాడు. పేదరికాన్ని తగ్గించలేకపోయాడు. సంపన్నులకి పన్నులు పెంచలేక పోయాడు. అప్పులు పెరగడాన్ని అడ్డుకోలేకపోయాడు. తడిసి మోపెడవుతున్న ద్రవ్యలోటు జోరుని అణుమాత్రమైనా ఆపలేక పోతున్నాడు. నింగి చూస్తున్న నిరుద్యోగాన్ని కిందికి లాగలేక సతమతమవుతున్నాడు. ఇవన్నీ చెయ్యాలని ఒకవేళ ఆయనకి ఉందని మాటవరసకి అనుకుందాం. ఇప్పటికి ఏదేశంలోనూ ఎవ్వరి వల్లా కాలేదు. పెట్టుబడిదారీ విధానం గమనం అలాంటిది. వీ

*(రచయిత రిటైర్డ్ ఇంగ్లిష్ లెక్చరర్)*

## వీక్షణం రచయితలకు సూచనలు

ఎనిమిది సంవత్సరాలలో, నూట పదమూడు సంచికలలో వీక్షణం దాదాపు పద్దెనిమిది వందల వ్యాసాలు, రచనలు ప్రచురించింది. వీటిలో నిడివిలోనూ, వస్తువులోనూ, చెప్పిన పద్ధతి లోనూ, సుబోధకత లోనూ చాల వైవిధ్యం ఉంది. ఈ వైవిధ్యాన్నంతా గౌరవిస్తూనే, పత్రికలో అచ్చయ్యే వ్యాసాలను ప్రామాణికం చేయడానికి రచయితలు ఈ కింది సూచనలు పాటిస్తే బాగుంటుందని భావిస్తున్నాం.

❖ రచన మరీ చిన్నది (ఒక పేజీ కన్న తక్కువ) కాకుండానూ, మరీ పెద్దది (ఐదు పేజీల పైన) కాకుండానూ ఉంటే బాగుంటుంది. రచన ఐదు పెజీలకు మించితే రెండు మూడు సంచికలలో వేయవలసి వస్తుంది గనుక రచయిత అభిప్రాయం పాఠకులకు అందడం కష్టమవుతుంది. మూడు-నాలుగు పేజీల రచన (1800 - 2500 పదాలు) వీక్షణం కు సరిగ్గా సరిపోతుంది.

❖ చేతిరాతతో పంపేవారయితే వీలయినంత కుదురుగా, చదవడానికి వీలుగా, పంక్తుల మధ్య ఖాళీ వదులుతూ, కాగితానికి ఒకవైపునే రాసి పంపాలి. కంపోజ్ చేసి పంపేవారయితే, డబుల్ లైన్ స్పేసింగ్ లో కాగితానికి ఒకవైపునే అచ్చువేసి పంపాలి. యూనికోడ్ లో గాని, పేజ్ మేకర్ లో గాని కంపోజ్ చేసేవారు సాఫ్ట్ కాపీ సి.డి. ద్వారాగాని, ఇ మెయిల్ లోగాని పంపితే మంచిది.

❖ రచయితలు తప్పనిసరిగా తమ రచన ఫొటో కాపీ తమ దగ్గర ఉంచుకోవాలి.

❖ రచనతో పాటు తప్పనిసరిగా రచయిత సంక్షిప్త పరిచయం, పూర్తి చిరునామా, ఫోన్ నంబర్లు, ఇమెయిల్ వగైరా వివరాలు పంపాలి.

❖ వీక్షణం కార్యాలయానికి రచన అందిన వెంటనే అందినట్టుగా రచయితలకు సమాచారం పంపుతాం. రెండువారాలలోగా ఆ రచనను ప్రచురణకు స్వీకరిస్తున్నదీ లేనిదీ తెలుపుతాం. తక్షణ ప్రాముఖ్యత ఉన్న అంశం మీద రచన అయితే రెండు-మూడు నెలల లోపు అచ్చువేస్తాం. సాధారణ రచనలు అచ్చువేయడానికి ఆరు నెలల వరకూ పట్టవచ్చు.

❖ మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణం కు పంపగూడదు.

❖ దీర్ఘకాలిక తాత్విక, రాజకీయార్థిక, సామాజిక అంశాల మీద మాత్రమే కాక, సమకాలీన రాజకీయార్థిక, సామాజిక పరిణామాలపైన కూడ రచనలు పంపాలని రచయితలకు విజ్ఞప్తి. ఆ విషయం మీదనే మరొకరు రాసినా, అన్ని దృక్పథాల రచనలు అచ్చు వేయడం వీక్షణం ఉద్దేశ్యం. క్షేత్ర పరిశోధనా నివేదికలు, విధానాల అమలు తీరుతెన్నులు, ప్రజాజీవితంలో మార్పులు, వివిధ దృక్కోణాలు, విభిన్న సామాజిక శాస్త్ర పరిశీలనాంశాలు వీక్షణంలో ప్రాధాన్య ప్రచురణాంశాలు. సాహిత్య రంగానికి సంబంధించిన రచనలకు వీక్షణంలో చోటు కల్పించడం సాధ్యం కాదు.

❖ రచయిత అభిప్రాయాలను మార్చడం ఎప్పుడూ జరగదు. కాని నిడివి దృష్ట్యాగాని, సాంకేతిక కారణాల దృష్ట్యాగాని రచనలు కుదించే, మార్చే పరిస్థితి రావచ్చు. ఇలా ఎడిట్ చేయడానికి రచయితలు ఆమోదించాలి.

*పాఠశాల విద్యారంగంలోని సమస్యల పూర్వాపరాలను విశ్లేషిస్తూ, పరిష్కారాలను సూచిస్తున్నారు*

**రమేష్ పట్నాయక్**

# అందరికీ విద్య ఇంకెంత దూరం?

**అం**దరికీ విద్య అన్న నినాదం దశాబ్దాలుగా భారత ప్రజల చెవులలో మారు మోగుతూనే ఉంది. సాంస్కృతికోద్యమకాలంలో జ్యోతిరావు పూలే నుండి కందుకూరి వీరేశలింగం పంతులు వరకు ఈ లక్ష్యాన్ని చేపట్టిన వాళ్లే. సాంస్కృతికోద్యమం తన లక్ష్య సాధనలో కనీసం కొంత దూరం ముందుకెళ్లింది. అయితే రాజకీయోద్యమం అందుకు విరుద్ధంగా నడిచింది. స్వాతంత్ర్యోద్యమ కాలంలో నాయకులు స్వాతంత్ర్యం వస్తే అందరికీ విద్య వస్తుందని వాగ్దానం చేసేవాళ్లు. అయినా ఇప్పటికీ అందరికీ విద్య అందుబాటులోకి రానేలేదు. ఏప్రిల్ 1, 2010 నుండి విద్యా హక్కు చట్టం దేశవ్యాపితంగా అమలులోకి వచ్చినట్లు ప్రకటించారు. ఈ చట్టం వలన అయినా అందరికీ విద్య అందుబాటులోకి వస్తుందని అనేక మంది భావిస్తున్నారు. విద్యా హక్కు చట్టం అందరికీ విద్య ఇవ్వనుందా, అందరికీ ప్రమాణాలు గల విద్య ఇవ్వనుందా అన్న విషయాలు ఈ వ్యాసంలో చర్చిద్దాం.

1882లో, అంటే కాంగ్రెస్ పుట్టకముందే, హంటర్ కమిషన్‌కు జ్యోతిరావు పూలే విద్యా విషయాలపై ఒక వినతిపత్రం సమర్పించారు. బ్రిటిష్ ప్రభుత్వం విద్య కోసం చేస్తున్న కేటాయింపులు బ్రాహ్మణులకు, పై వర్గాల వారికి మాత్రమే ప్రయోజనాన్ని సమకూరుస్తున్నాయని, అత్యధికులైన పేదలను పేదరికంలోనూ, అజ్ఞానంలోనూ ఉంచుతున్నాయని ఆ వినతి పత్రంలో పేర్కొన్నారు. 1911లో గోపాల గోఖలే ఇంపీరియల్ చట్ట సభలో ప్రాథమిక విద్యా బిల్లును ప్రవేశపెట్టారు. ఫ్యూడల్ ప్రాంతాల నుండి, ప్రిన్సిలీ స్టేట్స్ నుండి వచ్చిన ప్రతినిధులు ఆ బిల్లును వ్యతిరేకించారు. చివరికి ఆ బిల్లు పాస్ కాలేదు. 1937లో వార్ధాలో నిర్వహించిన జాతీయ విద్యా మహాసభలలో మహాత్మా గాంధీ బేసిక్ విద్యకు ప్రాధాన్యత ఇవ్వవలసిందిగా ప్రతిపాదించాడు. కాంగ్రెస్ సభకు హాజరైన తొమ్మిది కాంగ్రెస్ పాలిత రాష్ట్రాల విద్యాశాఖామాత్యులను ఒప్పించడం గాంధీకి చాలా కష్టమైన పని అయిందట. అందుకు ఆయన తన నైతికశక్తినంతా ఉపయోగించవలసి వచ్చిందట. ఇంగ్లిష్ వారి నుండి కాంగ్రెస్ వారి వరకు అందరూ విద్యా విస్తరణను వ్యతిరేకించిన వారే.

స్వాతంత్ర్యానంతరం భారత రాజ్యాంగ పరిషత్ (1948-49)లో కూడా విద్యా హక్కుపై చర్చ జరిగింది. విద్యాహక్కును ప్రాథమిక హక్కులలో చేర్చాలని డా. బి.ఆర్. అంబేద్కర్ ప్రతిపాదించాడు. 'ఉక్కు మనిషి' అయిన సర్దార్ వల్లభాయి పటేల్ విద్యాహక్కును ప్రాథమిక హక్కులలో చేర్చడానికి అంగీకరించలేదు. ఫలితంగా విద్యాహక్కు ఆదేశిక సూత్రాలకు మాత్రమే పరిమితం అయింది. ఆదేశిక సూత్రాలలో 41వ అధికరణం రాజ్యం (ప్రభుత్వం) తన ఆర్థిక శక్తి పరిమితుల మేరకు పౌరులకు విద్య అందించాలని పేర్కొంటుంది. ఈ అధికరణం పాఠశాల విద్యకు, ఉన్నత విద్యకు కూడా వర్తిస్తుంది. అదలా ఉండగా, ఆదేశిక సూత్రాలలో మరొక అధికరణం అయిన 45వ అధికరణం 14 ఏళ్ల లోపు బాలబాలికలందరికీ ఉచిత, నిర్బంధ విద్య అందించాలని పేర్కొంది. అంటే 14 ఏళ్లలోపు బాలబాలికలకు ఎలిమెంటరీ విద్య అందించడం రాజ్యం విధి. రాజ్యం ఆర్థిక స్తోమత ఎంత తక్కువ ఉన్నా, ఆర్థిక స్తోమతతో సంబంధం లేకుండా బాలబాలికలకు ఎలిమెంటరీ విద్య ఇవ్వడం రాజ్యం విధి. అయితే అధికరణం 41 ప్రకారం సెకండరీ విద్య, ఉన్నత విద్య పౌరులకు అందించడం కూడా రాజ్యం విధి అయినప్పటికీ అది రాజ్యం ఆర్థిక స్తోమతపై ఆధారపడే విషయం. 41వ అధికరణం ఉన్నత విద్యల మాట అలా ఉంచితే, 45వ అధికరణం 14 ఏళ్ల లోపు బాల బాలికలందరికీ ఉచిత, నిర్బంధ విద్య అందించాలని రాజ్యాన్ని ఆదేశిస్తుంది. అంతేకాదు ఈ నిబంధన రాజ్యాంగం అమలు ప్రారంభమైన పదేళ్లలోపు పూర్తిగా అమలులోకి తీసుకురావాలని అదే అధికరణంలో పేర్కొనబడింది. భారత రాజ్యాంగంలో ఏ ఇతర అధికరణానికి ఇలా కాల నిర్ణయం లేదు. రాజ్యాంగ పరిషత్తు సర్దార్ వల్లభాయి పటేల్ ఒత్తిడి వలన విద్యా హక్కును ప్రాథమిక హక్కులలో చేర్చలేక పోయినా 45వ అధికరణంలో 'ఉచిత', 'నిర్బంధ' అనే పదాలు చేర్చడం ద్వారా పది సంవత్సరాల కాలపరిమితిని నిర్ణయించడం ద్వారా విద్యాహక్కుకు చాలా ప్రాధాన్యత ఇచ్చిందని తెలుస్తోంది. రాజ్యాంగ అధికరణం 45 అమలు జరిగి ఉంటే 1960 అనంతరం 14 ఏళ్ల లోపు బాలబాలికలెవరూ పాఠశాల బయట ఉండేవారు కాదన్నమాట. అయితే, 1960 కాదు, ఆ తరువాత అర్ధ శతాబ్దం గడిచినా ఈనాటికీ విద్య బాలబాలికలందరికీ అందుబాటులోకి రాలేదు. కోట్లాది మంది బాలబాలికలు గాజు పరిశ్రమలలో, మందుగుండు సామాగ్రి పరిశ్రమలలో, హోటళ్లలో అనేక చోట్ల బాల కార్మికులుగా మగ్గిపోతున్నారు.

## జాతీయ విద్యా విధానం, 1986

1960 నాటికి 45వ అధికరణం అమలు జరుగలేదు. 1970 నాటికి అమలు జరుగుతుందన్న ఆశ కూడా ఆనాడు ఎవరికీ లేదు. 1950 దశకం గడిచిన తీరు అందరినీ నిరాశపరిచినట్లుంది. 1964-66లో కొఠారీ కమిషన్ ఈ విషయమై అధ్యయనం చేసింది.

1966లో తన నివేదిక ఇచ్చింది. తరగతి గదిలోనే దేశ భవిష్యత్ నిర్మించబడుతుందని కొఠారీ కమిషన్ చేసిన చారిత్రక ప్రకటన తెలిసిందే. కొఠారీ కమిషన్ అందరికీ విద్య అందించాలని, ప్రజాస్వామిక విలువలు గల విద్య అందించాలని, కామన్ స్కూల్ విధానం స్థాపించాలని చెప్పింది. అయితే ఈ మూడు విషయాలు ఇప్పటి వరకు అమలు జరుగలేదు. కమిషన్ చెప్పిన ఇతర విషయాలు ఇక్కడ అప్రస్తుతం. 1986లో రాజీవ్ గాంధీ ప్రభుత్వంలో పి.వి. నరసింహారావు విద్యాశాఖ మంత్రి / మానవ వనరుల శాఖా మంత్రిగా ఉన్నప్పుడు 'జాతీయ విద్యా విధానం - 1986' ప్రవేశపెట్టారు. విద్యాశాఖకు మానవ వనరుల శాఖ అని పేరు పెట్టడంలోనే కార్పొరేటు ప్రయోజనాలున్నాయి. మానవ వనరులు అన్నమాట విద్యా లక్ష్యాన్ని పూర్తిగా వక్రీకరిస్తోంది. అదలా ఉంచగా, ఈ జాతీయ విద్యా విధానం - 1986 ఉన్నత విద్యను వ్యక్తిగత విషయానిర్వచించింది. పౌరులను ఉన్నత విద్యావంతులను చేయడం సమాజం సమిష్టి అవసరంగా ఈ విధానం భావించలేదు. వ్యక్తులు తమ స్వంత ప్రయోజనం కొరకే డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లు, టీచర్లు, చరిత్రకారులు, రచయితలు, చివరికి తత్వవేత్తలు అవుతారని, అవ్వాలని ఈ విధానం భావించినట్లు కనిపిస్తుంది. ఉన్నత విద్య నుంచి వ్యక్తులే ప్రయోజనం పొందుతారని, అందుకు అవసరమయ్యే ఖర్చును ఆయా వ్యక్తులే భరించాలని ఈ విధానం ప్రకటిస్తోంది. దీనిని మరొక విధంగా చెప్పుకోవాలంటే డబ్బులు ఖర్చు చేయగలిగే వారికే ఉన్నత విద్య, డబ్బులు లేని వారికి ఉన్నత విద్యా హక్కు లేదు. ఇది రాజ్యాంగం 41 అధికరణానికి విరుద్ధం. రాజ్యం తన ఆర్థిక శక్తి పరిమితులకు లోబడి సమాన విద్యావకాశాలు కల్పించాలని ఈ అధికరణం పేర్కొంటుంది. ఈ అధికరణం పరిధిలోకి ఉన్నత విద్య కూడా వస్తుంది. అంటే రాజ్యం తన ఆర్థిక పరిమితులకు లోబడి ఎంత శాతం యువతీ యువకులకు విద్య ఇవ్వగలిగితే అంత శాతం మందికి సామాజిక న్యాయం, మెరిట్‌పై ఆధారపడి విద్య అందించాలని, అంతేగాని విద్యను బజారు సరుకుగా మార్చి డబ్బులున్న వారు కొనుక్కోండి, లేనివారు మానుకోండి అనడానికి లేదు. రాజ్యం ఆర్థిక శక్తిపై ఆధారపడి ఉన్నత విద్య విస్తరించాలి. అంతేగాని వ్యక్తి ఆర్థిక స్థితిపై ఆధారపడి నిరాకరించబడరాదు. అందుకే జస్టిస్ ఒ. చిన్నప్పరెడ్డి జాతీయ విద్యా విధానం - 1986ను రాజ్యాంగంపై దుశ్చర్యగా నిరశించారు. ఈ జాతీయ విద్యా విధానం - 1986 విద్యా వ్యాపారీకరణకు, విద్యా వస్తువును వృత్తి నైపుణ్యాలకు కుదించడానికి, విద్యారంగంలో ద్వంద్వ ప్రమాణాలకు, విశ్వవిద్యాలయాల స్వయం ప్రతిపత్తిని కుదించే నిరాజకీయికరణ చర్యలకు అలాగే జాతీయ వారసత్వం పేరుతో ముందుకు వచ్చిన కాలం చెల్లిన భూస్వామ్య సాంస్కృతిక విధానాలకు ఆజ్యం పోసింది. పాఠశాలల విద్య విషయానికి వస్తే ఈ విద్యా విధానం మూడు అంచల విధానాన్ని ప్రవేశపెట్టింది. అధికారులను, నిపుణులను తయారు చేసుకోవడానికి నవోదయ విద్య, గుమస్తాలను కింది స్థాయి ఉద్యోగులను తయారు చేసుకోవడానికి సాధారణ పాఠశాలలు, అత్యధిక బాలబాలికలను బాల కార్మికులుగా కొనసాగిస్తూ వారిని నైపుణ్యం లేని అసంఘటిత కార్మికులుగా తయారు చేయడానికి రాత్రిపూట అనియత విద్య అనే విధానాలను ఈ విధానం రూపొందించింది. ఈ విధానం అందరికీ విద్య, అందరికీ ఒకే ప్రమాణాలు గల విద్య, కామన్ స్కూల్ విద్య అనే లక్ష్యాలకు గొడ్డలి పెట్టయింది.

## మార్కెట్ అనుకూల సంస్కరణలు - విద్యపై ప్రభావం

1990లలో ప్రపంచ వ్యాపితంగా మార్కెట్ ఆర్థిక సంస్కరణలు ప్రారంభమయినాయి. వీటితోనే ప్రపంచ బ్యాంక్, ఆసియా అభివృద్ధి బ్యాంక్, ఇతర అనుబంధ బ్యాంకులు అనేక దేశాలలో సంస్థాపరమైన సర్దుబాట్లు (స్ట్రక్చరల్ అడ్జస్ట్‌మెంట్ ప్రోగ్రామ్స్) అన్న పేరుతో ఇతర రంగాలతో పాటు విద్యారంగంలో కూడా వేలు పెట్టడం ప్రారంభించాయి. ఆ క్రమంలోనే పాఠశాల విద్యారంగంలో జిల్లా ప్రాథమిక విద్యా పథకం (డి.పి.ఇ.పి.)ని ప్రవేశపెట్టారు. దీని పేరు జిల్లా పథకం అయినా మన దేశంలోనే కాక ప్రపంచంలోని అనేక దేశాలలో ఈ విధానాన్ని ప్రపంచబ్యాంక్ బలవంతంగా రుద్దింది. ఇది ప్రపంచ వ్యాపితంగా ఒకే ఒక్క మూసపోత విధానం. ఈ డి.పి.ఇ.పి. ప్రాథమిక విద్యా లక్ష్యాలను నేరపూరితంగా కుదించివేసింది. ఎనిమిదేళ్ల విద్యా స్థానంలో ఐదేళ్ల విద్య, ప్రతి తరగతికి ఒక ఉపాధ్యాయుడు స్థానంలో రెండు లేక మూడు తరగతులకు ఒకే ఒక్క ఉపాధ్యాయుడు - బహుళ తరగతుల బోధన (మల్టిగ్రేడ్ టీచింగ్); అర్హతలు కలిగిన శిక్షణ పొందిన ఉపాధ్యాయుని స్థానంలో కనీస అర్హతలు, శిక్షణ లేని విద్యా వాలంటీరు, ఉపాధ్యాయుల రెగ్యులర్ నియామకాల స్థానంలో కాంట్రాక్టు నియామకాలు అనే విధానాలను, అలాగే సమగ్రమైన ప్రాథమిక విద్య స్థానంలో చదవనూ, రాయనూ నేర్పే విద్య అన్న భావనలను ఈ డి.పి.ఇ.పి ప్రవేశపెట్టింది. ఈ డి.పి.ఇ.పి. పాఠశాల విద్యలో తీవ్ర సంక్షోభాన్ని సృష్టించింది. ఈ డి.పి.ఇ.పి. వలన ప్రభుత్వ పాఠశాలలు ప్రధానంగా ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలలు పూర్తిగా బలహీనమైపోయాయి. ఈ డి.పి.ఇ.పి. సర్వశిక్షా అభియాన్ రూపంలో ఇప్పటికీ అమలు జరుగుతూ ఉంది. 1986 నుంచి జాతీయ విద్యా విధానం, 1992 నుంచి డి.పి.ఇ.పి., 2002 నుండి సర్వశిక్షా అభియాన్ వంటి పథకాలు (ఈ పథకాలన్నీ అందరికీ విద్య అన్న లక్ష్య ప్రకటనతో వచ్చినవే) అమలు జరుగుతున్నా బాల కార్మిక సమస్యగానీ, బాలబాలికలు మధ్యలో బడి మానివేసే సమస్యగానీ ఇంకా పరిష్కారం కాలేదు. అంతేకాదు ఈ పథకాలు అమలు జరుగుతున్న కొద్దీ ప్రభుత్వ పాఠశాలలు మరింతగా దిగజారుతున్నాయి.

## సుప్రీం కోర్టు తీర్పు (1993) - ప్రాథమిక హక్కుగా విద్య

1993లో ఉన్నికృష్ణన్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కేసులో సుప్రీం కోర్టు రాజ్యాంగ ధర్మాసనం ఉన్నత విద్యకు సంబంధించి విద్యా వ్యాపారానికి అనుకూలమైన తీర్పును, అంటే అభివృద్ధి నిరోధకమైన తీర్పుని ఇచ్చినా, ఎలిమెంటరీ విద్యా హక్కు విషయమై చారిత్రత్మకమైన తీర్పునిచ్చింది. ఈ తీర్పులో సుప్రీం కోర్టు 14వ ఏట వరకు బాలబాలికలకు ఉచిత, నిర్బంధ విద్య ప్రాథమిక హక్కుని ప్రకటించింది. ఈ తీర్పు కాలం నాటికి రాజ్యాంగం అమలు జరిగి నాలుగు దశాబ్దాలు దాటింది. రాజ్యాంగం అమలు ప్రారంభమయిన పది సంవత్సరాల కాలంలోనే అమలు జరుగవలసిన ఆదేశిక సూత్రం (అధికరణ 45) నలభై ఏళ్లు దాటినా అమలు జరగపోవడంపై సుప్రీం కోర్టు కార్యనిర్వాహక విభాగాన్ని (స్వాతంత్ర్యం కాలం నుండి అధికారం చలాయించిన ప్రభుత్వాలను) తీవ్రంగా ఆక్షేపించింది. అధికరణం 45ను జీవించే హక్కు ప్రాథమిక హక్కు అధికరణం 21తో కలిపి చూడాలని, ఎలిమెంటరీ విద్య జీవించే హక్కు నుంచి నేరుగా వస్తుందని

తీర్పునిచ్చింది. ఈ తీర్పు కేంద్ర ప్రభుత్వంపై తీవ్రమైన ఒత్తిడి తీసుకువచ్చింది. అయినా కేంద్ర ప్రభుత్వం ఈ తీర్పును అమలు చేయలేదు. కమిటీలు, కమిషన్‌లతో కాలయాపన చేసింది. చివరికి, ఈ తీర్పును నీరుకార్చే ఉద్దేశంతో ఎన్.డి.ఎ. ప్రభుత్వం 2002లో రాజ్యాంగానికి 86వ సవరణ తీసుకువచ్చింది. ఈ సవరణ పూర్వ ప్రాథమిక విద్యకు సంబంధించిన వయోపరిమితిని (5వ ఏట వరకు) ఆదేశిక సూత్రాలకే పరిమితం చేసింది. అంటే పూర్వ ప్రాథమిక విద్యను 45వ అధికరణలోనే కొనసాగించింది. ఎలిమెంటరీ విద్యకు సంబంధించిన వయో పరిమితిని (6-14) మాత్రమే ప్రాథమిక హక్కులలోనికి తీసుకు వచ్చింది. దీన్ని 21ఎ అధికరణంగా చేర్చింది. అంతేకాదు, ఎలిమెంటరీ (1-8 తరగతులు) విద్యా హక్కును నిర్వహించే అధికారాన్ని అదే అధికరణలో ఒక క్లాజు ద్వారా ప్రభుత్వానికి కట్టబెట్టింది. దీనర్థం ఏమిటి? ఎలిమెంటరీ విద్య కనీస ప్రమాణాలను నిర్ణయించే అధికారం ప్రభుత్వానికే ఉంటుంది. సదరు కనీస ప్రమాణాలను ప్రశ్నించే హక్కు ప్రజలకు ఉండదు, కోర్టులకు ఉండదు. ప్రభుత్వం ఈ అధికారాన్ని ఎలా ఉపయోగించుకున్నదీ గత సంవత్సరం నుండి అమలు జరుగుతున్న విద్యా హక్కు చట్టంతో స్పష్టమయింది.

## విద్యా హక్కు చట్టం - ఒక విద్యా వ్యాపార చట్టం

1993లో సుప్రీం కోర్టు విద్యా హక్కును ప్రాథమిక హక్కు అని తీర్పు ఇచ్చిన విషయం, ఈ తీర్పును నీరుకారుస్తూ, విద్యా హక్కు నుంచి పూర్వ ప్రాథమిక విద్యను తొలగిస్తూ, విద్యాహక్కును ఎలిమెంటరీ విద్యకు పరిమితం చేస్తూ 2002లో 86వ రాజ్యాంగ సవరణ తీసుకు వచ్చిన విషయం చూశాం. అయితే, ఈ కుదించబడ్డ హక్కును అమలు చేయడానికి కేంద్ర ప్రభుత్వానికి మరి పది సంవత్సరాలు పట్టింది. బాలల ఉచిత, నిర్బంధ విద్యా హక్కు చట్టాన్ని 2009 ఆగస్ట్‌లో గెజిట్‌లో నోటిఫై చేసి, 2010 ఏప్రిల్ 1 నుండి అమలు చేస్తున్నట్లు ప్రకటించారు. ఈ చట్టాన్ని బాలల ఉచిత, నిర్బంధ విద్యా హక్కు చట్టం, 2009 అని వ్యవహరిస్తారు. అయితే ఈ చట్టాన్ని అమలు చేయడానికి అవసరమైన వివరాలతో రాష్ట్రాల వారిగా రాష్ట్ర ప్రభుత్వాలు నిబంధనావళులను రూపొందించుకోవలసి ఉంటుంది. అయితే చట్టాన్ని అమలు చేయడానికి, అవసరమైన నిబంధనావళులను రూపొందించుకోవడానికి వివిధ రాష్ట్ర ప్రభుత్వాలకు మరొక్క సంవత్సరం పట్టింది. ఈ చట్టంలో ప్రభుత్వ పాఠశాలలకు సంబంధించిన అంశాలు రానున్న విద్యా సంవత్సరం నుంచి అమలు జరగవచ్చు. ఈ చట్టం ప్రైవేట్ పాఠశాలలకు వర్తించకూడదని కార్పొరేట్ పాఠశాలల యాజమాన్యాలు సుప్రీం కోర్టులో వేసిన వ్యాజ్యాలు నడుస్తున్నాయి. ఈ విషయం అలా ఉండగా, విద్యా హక్కు చట్టం బాలబాలికల విద్యా హక్కును ఎలా నిర్వచించిందీ చూద్దాం.

విద్యా హక్కు చట్టం 86వ రాజ్యాంగ సవరణ వలె పూర్వ ప్రాథమిక హక్కులను తొలగించింది. ప్రజాస్వామికవాదులు, విద్యావేత్తలు, ప్రజాసంఘాలు ఎంత డిమాండ్ చేసినా సెకండరీ విద్యా హక్కు (9-12 తరగతులు) ను కల్పించలేదు. ఈ చట్టం ఎలిమెంటరీ విద్య (1-8 తరగతులు) ను గ్యారంటీ చేసినా, ఎలిమెంటరీ పాఠశాలలో కనీస ప్రమాణాలను గ్యారంటీ చేయలేదు. అదలా ఉండగా, ప్రైవేట్ పాఠశాలలలో ఫీజుల నియంత్రణ ఈ చట్టం ఎత్తివేసింది. పాఠశాల స్థాయిలో కూడా ప్రభుత్వ - ప్రైవేట్ భాగస్వామ్యం పేరుతో ప్రభుత్వ నిధులను ప్రైవేట్ యాజమాన్యాలకు ధారాదత్తం చేయడానికి 25 శాతం సీట్లకు రీయింబర్స్‌మెంట్ పథకం ప్రవేశపెట్టింది. మరి ఈ చట్టం చేసిందేమిటి? ప్రభుత్వ పాఠశాలలు తమవద్దకు వచ్చిన ప్రతి విద్యార్థిని బదిలీ ధృవపత్రం, వయస్సు ధృవపత్రం అడగకుండా పాఠశాలలలో చేర్చుకోవాలని, అడిగినప్పుడు బదిలీ ధృవపత్రం ఇవ్వాలని, బాలబాలికలను వారు సాధించిన విద్యా ప్రమాణాలతో సంబంధం లేకుండా వయస్సును బట్టి తగిన తరగతిలో చేర్చుకోవాలని ఆరు మాసాల నుంచి రెండు సంవత్సరాల పాటు ప్రత్యేక శిక్షణ ఇవ్వాలని - మొదలగు అంశాలే ఈ చట్టంలో ప్రధామైనవి. ఈ నిబంధనల ప్రయోజనం ఎవరి మట్టుకు వారు అంచనా వేసుకోవచ్చు. అలాగే ఆవాస ప్రాంతానికి ఒక కిలోమీటర్ దూరంలో ప్రాథమిక పాఠశాల, మూడు కిలోమీటర్ల దూరంలో ప్రాథమికోన్నత (6 నుంచి 8 తరగతులు) పాఠశాల ఉండాలని ఈ చట్టంలో నిబంధన ఉంది. కాని పాఠశాల ప్రమాణాల మాట అలా ఉంచితే ఈ దూరపు 'నిబంధన' ఆంధ్రప్రదేశ్‌తో సహా అనేక రాష్ట్రాలలో ఇప్పటికే అమలులో ఉంది. ఈ చట్టం బాలబాలికలు మధ్యలో బడిమానివేయకుండా చూడగలుగుతుందా? బడికి వచ్చిన వారికి కనీస ప్రమాణాలు గల (ప్రమాణాలు అన్న మాటకు దాని సంకుచిత అర్థంలోనైనా) విద్య అందించగలుగుతున్నదా అన్నదే మనముందరున్న ప్రధామైన ప్రశ్న.

## ప్రమాణాలు గల విద్య

ప్రభుత్వ, ప్రైవేట్ పాఠశాలలు అనుసరించవలసిన ప్రమాణాలు గురించి చట్టానికి చివరన జతచేయబడిన షెడ్యూలులో పేర్కొనబడింది. ఈ షెడ్యూలులో కొంతలో కొంత బాగున్నది గ్రంథాలయం మాత్రమే. గ్రంథాలయంలో వార్తాపత్రికలు, పాఠ్యపుస్తకాలు, కథల పుస్తకాలు ఉండాలని పేర్కొనబడింది. ఆట స్థలం ఇచ్చారు కాని కనీస కొలతలు ఇవ్వలేదు. మంచినీళ్లు, మరుగు దొడ్లు ఉండాలని పేర్కొన్నారు. కాని అటువంటి నిబంధనలు ఇప్పటికే ఉన్నాయి. అవి ఎలా అమలు జరుగుతున్నదీ అందరికీ తెలిసిందే. కార్పొరేట్ పాఠశాలలు నడుస్తున్న బహుళ అంతస్తుల భవనాలలో అగ్ని ప్రమాదాలు జరగడం మనకు తెలిసిందే. అయితే బహుళ అంతస్తులపై ఈ చట్టం ఎటువంటి నిబంధనలు విధించలేదు - ఇవన్నీ భౌతిక వనరులకు సంబంధించిన విషయాలు. అయితే, ఈ షెడ్యూలు విద్యార్థి, ఉపాధ్యాయ నిష్పత్తి గురించి ఏమి చెప్తుందో చూద్దాం. ప్రాథమిక పాఠశాలలలో కనీస ప్రమాణాలు సాధించాలంటే ప్రతి తరగతికి ఒక గది, ఒక ఉపాధ్యాయుడు అనే ఏర్పాటు కనీస అవసరం. అలాగే అదనంగా ఒక ప్రధానోపాధ్యాయుడు అవసరం. అయితే, ఈ చట్టం అమలు జరిగినా, ఈ చట్టానికి జతపరచబడిన షెడ్యూలు ప్రకారం ప్రాథమిక పాఠశాలలో విద్యార్థుల సంఖ్య 150 దాటితే గాని సూచించిన విధంగా ఐదు సంవత్సరాలకు ఐదుగురు ఉపాధ్యాయులు, అలాగే అదనంగా ప్రధానోపాధ్యాయుడు అనే ఉపాధ్యాయులు నియమించబడతారు. ఈ పాఠశాలలలో ప్రమాణాలు గల విద్య సాధ్యమా? దేశవ్యాపితంగా అత్యధిక గ్రామీణ ప్రాథమిక పాఠశాలలో విద్యార్థుల సంఖ్య 60 కంటే తక్కువగానే ఉంటుంది. మన రాష్ట్రంలో ఉన్న 56,960 ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలకు గాను 40,779 పాఠశాలలలో అంటే 72 శాతం పాఠశాలలలో విద్యార్థుల సంఖ్య 60 కంటే తక్కువగా ఉంది. 51

లక్షల మంది విద్యార్థులు ప్రైవేట్ పాఠశాలలకు తరలిపోవడం, 17 లక్షల మంది బాలబాలికలు బాల కార్మికులుగా మారిపోవడం ఈ పరిస్థితికి కారణం. తరగతికి ఒక ఉపాధ్యాయుడు లేకపోవడంతో ప్రభుత్వ బడులకు వస్తున్న బాలబాలికలకు కనీస ప్రమాణాలు కల విద్య కూడా లేకుండా పోతోంది. విద్యావ్యాపారాన్ని నిషేధించి, బాల కార్మికతను రద్దు చేస్తేగాని ప్రభుత్వ పాఠశాలలు తిరిగి కళకళలాడవు. అదలా ఉండగా మన రాష్ట్ర ప్రభుత్వం ఈ సంవత్సరం మే నెలలో మూడు దఫాలుగా విడుదల చేసిన రేషనలైజేషన్ రూల్స్, వాటిననుసరించి జరుగుతున్న బదిలీల ప్రకారం 5,276 ప్రాథమిక పాఠశాలలు తిరిగి ఏకోపాధ్యాయ పాఠశాలలుగా దిగజారిపోతాయి. కాగా 1,010 పాఠశాలలలో కనీసం ఒక ఉపాధ్యాయుడు కూడా ఉండడు. ఈ పాఠశాలలు విద్యా వాలంటీర్లతో నడుస్తాయి. ఈ రేషనలైజేషన్ నిబంధనలు విద్యా హక్కు చట్టం నిబంధనలకు వ్యతిరేకంగా ఉన్నాయి. చట్టాన్ని ఉల్లంఘించేవిగా ఉన్నాయి. ప్రభుత్వ పాఠశాలలలో కనీస సంఖ్యలో ఉపాధ్యాయులు ఉండరని తెలుస్తోంది. ప్రైవేట్ పాఠశాలల ప్రమాణాల డొల్లతనం ఇక్కడ చర్చనీయాంశం కాదు. విద్యా లక్ష్యం, విద్యావస్తువు, విద్యా ప్రక్రియ, విద్య వ్యాపార మాధ్యమంలో అందించడం సరియైనదేనా అన్న విషయాలపై ప్రైవేట్ పాఠశాలల ప్రమాణాలను పరిశీలించవలసి ఉంటుంది. కనీస వసతులు, అవసరమైనంత మంది ఉపాధ్యాయులు ఉంటే ప్రభుత్వ పాఠశాలలే స్వేచ్ఛా వాతారణంలో కొంతైనా సామాజిక స్పృహను కలిగించే విద్య అందించగలుగుతాయి. యాజమాన్యాలకు లాభాలు పరమావధి, తల్లి దండ్రులకు మార్కుల ర్యాంకులు పరమావధి అయిన ప్రైవేట్ పాఠశాలల వాతావరణం జైళ్లను తలపిస్తున్నాయి. ఈ పాఠశాలలలో విద్యార్థులు ఆత్మహత్య చేసుకుంటున్న సందర్భాలున్నాయి. ఈ విద్యాహక్కు చట్టం, విద్యా వ్యాపారాన్ని నిషేధించడం లేదు. ఈ చట్టం ప్రభుత్వ పాఠశాలలలో కనీస వసతులు, అవసరమైనంత మంది ఉపాధ్యాయులను కల్పించడం లేనందున ప్రభుత్వ పాఠశాలలకు వెళుతున్న లక్షలాది మందికి కనీస ప్రమాణాలు గల విద్య అందదని చెప్పవచ్చు. విద్యా ప్రమాణాలు అన్న మాటను వసతులు, అవసరమైనంత మంది అర్హతలు గల, శిక్షణ పొందిన ఉపాధ్యాయుల అందుబాటుగా కుదించి చూసినా అత్యధిక ప్రభుత్వ, ప్రైవేట్ పాఠశాలలలో కనీస ప్రమాణాలు గల విద్య అందబోవడం లేదని మనం గ్రహించవచ్చు. అందరికీ ప్రమాణాలు గల విద్య మాట అలా ఉంచి, అసలు ఈ విద్యా హక్కు చట్టం అందరికీ విద్యనైనా గ్యారంటీ చేస్తుందా అన్నది మన ముందు మిగిలిన ప్రశ్న.

## అందరికీ విద్య – డ్రాప్ ఔట్ సమస్య

విద్యా హక్కు చట్టంలో బాలబాలికలందరికీ ఎలిమెంటరీ విద్యను ప్రభుత్వమే గ్యారంటీ చేయాలని ఒక నిబంధన పేర్కొంటుంది. అయితే అందుకు ప్రభుత్వం చేపట్టవలసిన చర్యలు ఈ చట్టంలో పేర్కొనబడలేదు. పేద, దళిత, గిరిజన కుటుంబాల బాలబాలికలే మధ్యలో చదువు మానివేస్తున్నారని అందరికీ తెలుసు. కేంద్ర ప్రభుత్వం నిర్వహించే నేషనల్ సాంపుల్ సర్వే (ఎన్.ఎస్.ఎస్.) కూడా బడి మానివేసిన వారిలో 40 శాతం మంది పేదరికం కారణాల వల్లనే బడి మానివేస్తున్నారని లెక్కలు తేల్చింది. అయితే ప్రభుత్వం బడి మానివేయడానికి, కుటుంబ పేదరికానికి గల సంబంధాన్ని అంగీకరించడానికి సిద్ధంగా లేదు. ప్రపంచ బ్యాంకు, ప్రపంచ బ్యాంకు ప్రోదిత ఎన్.జి.ఒ.లు బాలబాలికలు బడిమానివేయడానికి ఇతర కారణాలు వెతికారు. సిద్ధాంతాలు తయారు చేశారు. సౌకర్యంగా ఉన్నందుకు ప్రభుత్వం కూడా ఆ సిద్ధాంతాలను ఆమోదించింది. ఆ సిద్ధాంతమేమంటే విద్య ఆకర్షణీయంగా ఉండక పోవడం, జీవితానికి సంబంధించినదిగా లేకపోవడం. విద్య జీవితానికి సంబంధించినదిగా లేకపోవడం వాస్తవమే అయితే, ఈ వాస్తవం మధ్యతరగతికి కూడా వర్తిస్తుంది. మరి వారెందుకు మధ్యలో చదువు మానేయడం లేదు. ప్రజాస్వామిక విద్య విజ్ఞానదాయినిగా ఉంటుంది. వ్యక్తి సమిష్టిలో భాగం అని గుర్తింపు ఇస్తుంది. జీవిత వాస్తవికతను, చలనశీలతను తెలియజేస్తుంది. ఆ విధంగా విద్య ఆనందాన్ని ఇచ్చేదిగా ఉంటుంది. విద్య ఆనందాన్ని ఇచ్చేదిగా ఉండాలంటే అర్థం చేసుకోవచ్చు. కాని విద్య ఆకర్షణీయంగా ఉండాలంటే అర్థం ఏమిటి? దీనర్థం డి.పి.ఇ.పి. ఆచరణలో ఒక పెన్సిల్‌పై ఒకవైపు అమ్మాయి, రెండవవేపు అబ్బాయి కూర్చునే బొమ్మ గోడల మీద వేయడమే అని తేలింది. విద్య జీవితానికి సంబంధించినదిగా లేకపోవడం ముందుగానే చెప్పుకున్నట్లు నిజమే అయినా గత ఇరవై సంవత్సరాలుగా ప్రపంచ బ్యాంక్ వివిధ రూపాలలో ప్రధానంగా డి.పి.ఇ.పి. రూపంలో నిర్నిబంధంగా జోక్యం చేసుకున్నా విద్య ఎందుకు జీవితానికి సంబంధించినదిగా మారలేదు. అందుకు వారే సమాధానం చెప్పాలి. విద్య అందుబాటుపై, విద్యా వస్తువుపై మార్కెట్ శక్తుల అజమాయిషీ ఉన్నన్నాళ్లు విద్య ఏ స్థాయిలోనూ జీవితానికి సంబంధించేదిగా గాని, సహజమైనదిగా గాని, సంతోషాన్ని ఇచ్చేదిగా గాని ఉండజాలదు. మార్కెట్ వెనుక మధ్యతరగతి ప్రైవేట్ పాఠశాలలు, వారి వెనుక అనివార్యంగా పేదవర్గాల వారు, చివరికి ప్రభుత్వ పాఠశాలలు పరిగెడుతూ పోయినన్నాళ్లూ విద్య విముక్తిని ప్రసాదించేదిగా గాని, మనోవికాసాన్ని కలిగించేదిగా గాని ఉండజాలదు. విద్య మార్కెట్ నుండి విముక్తి పొందే వరకు ప్రజాస్వామిక వ్యక్తిత్వాన్ని రూపొందించే ప్రక్రియగా గాని అభివృద్ధి కాజాలదు. విద్య మార్కెట్ శక్తుల నుండి విముక్తి పొందే వరకు పాఠ్యాంశాలు స్థానికతను వ్యక్తీకరించాలనే, విద్య మాతృభాషా మాధ్యమంగా సాగాలనే భావాలకు బలం రాదు. ఏ ప్రపంచ బ్యాంక్ విద్యను మార్కెట్ శక్తులకు లోబరుస్తుందో అదే ప్రపంచ బ్యాంక్ ప్రాథమిక విద్య ఆకర్షణీయంగా ఉండాలని, సృజనాత్మకంగా ఉండాలని, స్థానికతను వ్యక్తీకరించాలని చెప్పడం వైపరీత్యం. ప్రపంచబ్యాంకు మన వేలుతో మన కంటినే పొడుస్తుంది. ప్రజాస్వామికవాదులు లేవనెత్తిన సమస్యలతోనే ప్రపంచ బ్యాంకు తన పథకాలను పండించుకుంటుంది. అందుకే విద్యాలక్ష్యం, విద్యా వస్తువు, విద్యా ప్రక్రియ అన్న సమస్యలకు విద్యా వ్యాపారం, బాలకార్మికత, ప్రభుత్వ పాఠశాలల దుస్థితి వంటి విషయాలకు ఉన్న సంబంధాన్ని, వాటిని వేరు వేరుగా పరిష్కరించలేమన్న విషయాన్ని గట్టిగా ప్రతిపాదించవలసిన సందర్భమిది. ఈ సంబంధాన్ని చూడలేనివారు, చూడడానికి ఇష్టపడనివారు డి.పి.ఇ.పి. పథకాలకు బాగా మద్దతు ఇచ్చారు. విద్యావ్యాపారాన్ని బాలకార్మికతను నిషేధించి కామన్ స్కూల్ విధానాన్ని స్థాపించి అవసరమైన బాలబాలికలకు విద్యతో పాటు బట్టలు, పుస్తకాలు, పౌష్టికాహారం ఇంకా అవసరమైతే వసతి కల్పించినప్పుడే అందరికీ విద్య, ప్రమాణాలు గల విద్య, సహజమైన విద్య సాధ్యమవుతుంది. అప్పుడే విద్యా లక్ష్యం, విద్యా వస్తువు, విద్యా ప్రక్రియ ప్రజాస్వామికీకరించబడతాయి.

పాఠశాల విద్యలోని అసమానతలను, ప్రభుత్వ నిర్లక్ష్యాన్ని వివరిస్తూ ప్రమాణాలు పెంచడానికి చేపట్టాల్సిన చర్యలను సూచిస్తున్నారు **కె. ప్రభాకర్**

# వధ్యశిలపై పాఠశాల విద్య - ప్రమాణాలు

ఆరు నుండి పద్నాలుగేళ్ల లోపు పిల్లలందరికీ ఉచిత నిర్బంధ విద్యనందించడం కోసం కేంద్ర ప్రభుత్వం రూపొందించిన చట్టం (ఆక్ట్ 35 ఆఫ్ 2009) ఏప్రిల్ 1, 2010 నుండి అమలులోకి వచ్చింది.

దీనికి అనుబంధంగా రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్రంలో విద్యా ప్రమాణాల పెంపుదల కోసం ఉపాధ్యాయ శిక్షణ తదితర అంశాలకు 'ఎస్.సి.ఇ.ఆర్.టి.'కి బాధ్యతలను అప్పగిస్తూ, జి.ఒ. ఎం.ఎస్. నెం. 41ని, జూలై 30, 2010న విడుదల చేసింది. రాజ్యాంగ ఆదేశిక సూత్రాల్లో పొందుపరుచుకున్న నిర్బంధోచిత సార్వత్రిక విద్య, అరవై ఏళ్ల స్వాతంత్ర్యానంతర దశలో కూడా అరవై శాతానికి మించని అక్షరాస్యత (చదవడం, రాయడం)తో కొట్టుమిట్టాడడం ఆందోళన కలిగిస్తోంది. ఈ పరిస్థితిని అధిగమించడం కోసం అన్ని స్థాయిల్లోని యాజమాన్యాలు, స్థానిక సంస్థలు, బడి బయట ఉన్న పిల్లల్ని గుర్తించి, వాళ్ల 'వయసుకు తగ్గ' తరగతుల్లో చేర్పించాలని 'చట్టం' నిర్దేశించింది.

ఆ కోవలోనే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆనాటి నుండి నేటి వరకు కొనసాగిస్తూ వస్తున్న - ఓ.బి.బి., అపెప్, డిపెప్, ఎస్.ఎస్.ఎ., ఆర్.వి.ఎం., ఆర్.ఎం.ఎస్.ఎ. గా చేసిన ప్రయోగాలన్ని విఫలమైన కారణాలను అన్వేషించకుండా, విద్యారంగాన్ని ప్రాథమిక, మాధ్యమిక రంగాలుగా, మంత్రుల కోసం విడగొట్టడం చూశాం. అట్లా విడగొట్టడం ద్వారా, రెండు విద్యాసంబంధమైన శాఖలను, అధికార యంత్రాంగాలను ఏర్పాటు చేయడం ద్వారా మెరుగైన ఫలితాలు సాధించవచ్చున్న లక్ష్యంతో, అసలు ప్రమాణాలు దిగజారి, మొత్తం పాఠశాల విద్యారంగం వధ్యశిల పైకి చేరుకోవడానికి ప్రభుత్వమే కారణమవుతుంది.

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ప్రపంచ బ్యాంక్ అప్పుల కోసం అన్ని రంగాలను అప్పగించినట్లుగానే విద్యారంగాన్ని అప్పగించింది. అందువల్లనే విద్యా వ్యవస్థ దేశంలో, రాష్ట్రంలో రెండు రకాల అంటే ప్రభుత్వ, ప్రైవేట్ రంగాలుగా కొనసాగుతోంది.

---

బాలకార్మికత సమస్య, బాలబాలికలు మధ్యలో బడి మానివేయడం సమస్య మొదటిగా ఆయా కుటుంబాల ఆర్థిక, సాంస్కృతిక సమస్యలతోనూ, తరువాత పాఠశాల కనీస ప్రమాణాలతోనూ ముడిపడి ఉన్న సమస్య. తప్పకుంటా అది విద్యాలక్ష్యం, విద్యా వస్తువు, విద్యా ప్రక్రియ, మాధ్యమాలతో ముడిపడి ఉన్న సమస్య కూడా సమాజంలో పేదరికాన్ని, సాంస్కృతిక వెనుకబాటుతనాన్ని రూపుమాపితే అందరికీ విద్య సులభ సాధ్యమవుతుంది. అయితే అందరికీ విద్య అన్న సమస్యను అంతవరకూ వాయిదా వేయనవసరం లేదు. కొన్ని పాక్షిక చర్యలు ఇప్పుడే ప్రయత్నించవచ్చు. ప్రభుత్వ పాఠశాలలలో బాలబాలికలకు మూడు పూటలా ఆహారం, అవసరమైన బట్టలు పుస్తకాలు, రాత పరికరాలు అందజేస్తే అంటే బాలబాలికల పరంగా కుటుంబం మీద ఖర్చు లేకుండా చేస్తే పేద కుటుంబాల వారు కూడా తమ పిల్లలను పాఠశాలలకు పంపిస్తారు. అలాగే ప్రభుత్వ పాఠశాలలలో అవసరమైన వసతులు అవసరమైనంత మంది ఉపాధ్యాయులు ఉంటే బాలబాలికలకు విద్య ఉత్సాహకరంగానూ, ప్రయోజనకరంగానూ కనిపిస్తుంది. బాలబాలికలు పాఠశాల కారణంగా వెనుకబడరు, చదువు మానరు. బాలబాలికలకు సైకిళ్లు ఇవ్వడం, రవాణా సౌకర్యాలు కల్పించడం వలన కూడా ఉన్నత పాఠశాలలలో డ్రాప్ అవుట్ సమస్యను తగ్గించవచ్చు. ఇటువంటి వస్తుగతమైన చర్యలన్నీ తీసుకున్న తరువాత కూడా మధ్యలో చదువు మానివేసే బాలబాలికలుంటారు.

అయితే అటువంటి పరిస్థితులలో వారు చదువు మానివేయడానికి కారణాలు కూడా స్పష్టంగా కనిపిస్తాయి. ఆ సమస్యల పరిష్కారానికి కృషి చేయవచ్చు. అయితే విద్యా హక్కు చట్టాలు ఈ సమస్యలనేమీ గుర్తించలేదు. కాబట్టి వాటికి పరిష్కారాలను కూడా సూచించలేదు. విద్యాహక్కు చట్టం వలన పాఠశాలలలో ఉపాధ్యాయుల సంఖ్య పెరగడం లేదు. పాఠశాలల పరిస్థితులు మెరుగుకావడం లేదు. బాలబాలికలకు అదనంగా వస్తున్నవి రెండు జతల యూనిఫారాలు, ఐదు నోటు పుస్తకాలు మాత్రమే.

ఇటువంటి అరకొర చర్యల వలన బాలబాలికలు మధ్యలో బడిమానివేయడం అనే సమస్య పరిష్కారం కాదు. అందరికీ ప్రమాణాలు గల విద్య అనే మాట సరేసరి, అందరికీ విద్య కూడా సాధ్యం కాదు. అసలు ప్రభుత్వానికి ఆ ఉద్దేశం లేదు. అందుకే బాలకార్మికతను పూర్తిగా నిషేధించలేదు. అందరికీ విద్య లేదు, అందరికీ ప్రమాణాలు గల విద్య లేదు, కామన్ స్కూల్ కలలో కూడా కనిపించని దృశ్యం అయిపోయింది. ప్రభుత్వ, ప్రైవేట్ భాగస్వామ్యాన్ని రద్దు చేయాలి. ప్రభుత్వ పాఠశాలలను అభివృద్ధి చేయాలి. విద్యావ్యాపారాన్ని నిషేధించాలి, కామన్ స్కూల్ విధానాన్ని ప్రవేశపెట్టాలి అనే నినాదాలను క్రమక్రమంగా ప్రజలు అందిపుచ్చు కుంటున్నారు. ముసురుకుంటున్న మార్కెట్ అంధకారంలో ప్రజా ఉద్యమాలే వెలుగు రేఖలు.

*(రచయిత విద్యా పరిరక్షణ కమిటీ నాయకులు)* వీ

అందుకు నిదర్శనంగా ఆరేళ్ల లోపు పిల్లల బాధ్యత మాది కాదన్నట్లు ఎదగాల్సిన, సంరక్షణ చేయాల్సిన '0-6' సంవత్సరాల లోపు పిల్లల బాధ్యతను కేవలం 'అంగన్‌వాడీ బోర్డు' లకు అప్పగించింది. మరొకవైపు డబ్బున్న సంపన్న వర్గాల పిల్లలకు 'ఆర్కిడ్స్' లాంటి ఏసి తరగతి గదుల్లో 'ఎల్‌కెజి' ప్లే స్కూల్స్‌లో మెరుగైన బాల్యాన్ని రూపొందించుకోవడానికి అవకాశం కల్పించింది.

పూర్వ ప్రాథమిక విద్యకు సంబంధించిన బాధ్యతల్ని విస్మరించి, పోషక ఆహార లేమితో సుమారు నలభై శాతం గ్రామీణ బాల్యాన్ని పిండి బళ్ల (అంగన్‌వాడీ)కు నెట్టి, అంగన్‌వాడీలకైనా నిర్దిష్ట వేతనం, పని గంటలు, పర్యవేక్షణ లేకుండా చేసి బాల్యాన్ని హరిస్తున్నది.

అట్లాంటి ఐదేళ్లు నిండిన పిల్లల్ని ప్రభుత్వ పాఠశాలల్లో చేర్చుకొని శిక్షణ పొందిన టీచర్లతో కనీస వసతులు, మంచినీళ్లు, పలకా బలపం, తరగతికో గది, టీచర్‌ను ఇవ్వకుండా ఇన్నేళ్లు ప్రాథమిక విద్యను కొనసాగించింది.

ప్రస్తుత విద్యా హక్కు చట్టం అమలు వల్ల మెరుగైన పరిస్థితులు ఏర్పడతాయని ఆశిస్తే అందుకు భిన్నంగా, పది మంది పిల్లలున్న పాఠశాలలకు అసలు శిక్షణ పొందిన టీచర్ అవసరం లేదని, 'విద్యా వాలంటీర్'తో నడప చూడడం ఎట్లాంటి ప్రమాణాల కోసమో అర్థం చేసుకోవచ్చు.

'తరగతికో ఉపాధ్యాయుడు' తప్పనిసరిగా ఉండాలన్న ఉపాధ్యాయ సంఘాల డిమాండ్‌ను బేఖాతరు చేస్తూ ఎన్ని తరగతులైనా, అరవై మంది లోపు పిల్లలను, ఐదు తరగతులైనా, ఇద్దరే టీచర్లు బోధించాలని రేషనలైజేషన్ ద్వారా పోస్టుల సర్దుబాటుకు, ఈ మధ్య విడుదల చేసిన 'జి.ఒ. 55' ద్వారా చర్యలు తీసుకుంటున్నది.

ఇట్లాంటి అరవై రెండు వేలకు పైగా ఉన్న ప్రాథమిక పాఠశాలల్ని, విద్యా ప్రమాణాల పెంపుదల పేర ఏటా వేయికి పైగా పాఠశాలల్ని మూసి వేస్తోంది.

దీనికి భిన్నంగా కనీస అర్హతలు లేని ప్రైవేట్ స్కూల్స్‌లోని తరగతికో టీచరు ఉండడం వల్ల వస్తున్న ఫలితాలను, వ్యతిరేక దిశలో ప్రచారం చేస్తూ, ప్రభుత్వమే ప్రభుత్వ పాఠశాలల్ని బలహీనం చేస్తూ ప్రైవేట్ పాఠశాలల్ని ప్రోత్సహిస్తోంది.

విద్యా హక్కు చట్టంలో కనీస వసతులు, ఆట స్థలం, అర్హత కలిగిన ఉపాధ్యాయ సిబ్బంది లేని పాఠశాలల్ని మూసివేయమంటే, అట్లాంటి పాఠశాలలకు అనుమతినిస్తూ, అర్హతలున్న శిక్షణ పొందిన ఉపాధ్యాయులను 'రేషనలైజేషన్' పేర కుదిస్తూ ప్రభుత్వం విద్యారంగాన్ని సంక్షోభంలోకి నెడుతోంది.

పర్యవసానంగానే ప్రపంచబ్యాంక్ నివేదికలైనా 'ప్రథమ్' లాంటి సంస్థల, వివిధ పత్రికల సర్వేల్లో పాఠశాల విద్యా ప్రమాణాలు దిగజారి పోతున్నాయని నిరూపిస్తున్నవి. దీనికి పరిష్కారంగా సంఖ్య లేదన్న సాకుతో పాఠశాలల్ని మూసివేయడం, పోస్టులను సర్దుబాటు చేయడం బదులుగా, ఆయా ఆవాసాల్లోని ప్రైవేట్ పాఠశాలల్ని ఎత్తివేసి, కిలోమీటర్ పరిధిలోని విద్యార్థులందరిని తరగతికో పదిమందినైనా, ఐదు తరగతులకు యాభై మందితో ఒక ప్రాథమిక పాఠశాల కేంద్రాన్ని, ఐదుగురు టీచర్లతో నడపవచ్చును. ఆ కేంద్రానికి విద్యార్థుల్ని చేర్చడానికి 'ఆర్.వి.ఎం.' లాంటి నిధుల నుండి రవాణా సౌకర్యాలను, ఉచితంగా విద్యా సంబంధమైన అన్ని సామాగ్రిని, మధ్యాహ్న భోజనంతో పాటు పాలు, బ్రెడ్డు తదితర అల్పాహారం, యూనిఫాం, మంచినీటి, వైద్య, ఆట స్థలం మెరుగైన వసతులతో పాఠశాలల్ని బలోపేతం చేయవచ్చు.

అందుకు భిన్నంగా విద్యావాలంటీర్‌తోనో, ఇద్దరో ముగ్గురో ఉపాధ్యాయులతోనో, సగానికి పైగా మంచినీటి వసతిలేని, తరగతి గదుల్ని ఊడ్చడానికి స్వీపర్లు లేని, పర్యవేక్షణ లేమితో, శిక్షణలు, మీటింగ్‌లు బోధనేతర పనులతో పాఠశాల పనిదినాలను ఆటంక పరచడం వల్లే బోధనాభ్యసన కార్యక్రమాల్లో ఫలితాలు రావడం లేదని గుర్తించలేక పోతోంది.

ప్రభుత్వమే పెంచి పోషిస్తున్న భాషా జాడ్యం 'ఆంగ్ల' మాధ్యమం మోజువల్ల రానున్న విద్యా సంవత్సరం నుండి అదనంగా 'ఆంగ్లం' సబ్జెక్టును ఇదే టీచర్లతో బోధించడానికి ప్రయత్నిస్తోంది.

ఇట్లాంటి సబ్జెక్టుకో టీచర్, తరగతికో తరగతి గది, కనీస ప్రమాణాలు సాధించడానికి ఆలోచించని ప్రభుత్వం అనాలోచితంగా ఆరో తరగతి నుండి ఆంగ్ల మాధ్యమాన్ని రాష్ట్రంలోని ఆరు వేల ఐదు వందల పాఠశాలల్లో 2007-08 విద్యా సంవత్సరం నుండి సిబిఎస్ఇ సిలబస్‌తో ప్రారంభించింది.

ఉపాధ్యాయ సంఘాలు, తెలుగు మీడియం శిక్షణ పొందిన ఉపాధ్యాయులు, సాధ్యం కాదన్నా ఐదు తరగతులు తెలుగు మాధ్యమంలో చదివిన విద్యార్థులను జైల్లో నెట్టినట్లు, ఆరో తరగతి ఆంగ్ల మాధ్యమంలో చేర్చడం వల్ల టీచర్లు, విద్యార్థులు అనుభవించిన మానసిక హింస సామాన్యమైంది కాదు. దీన్ని ఇప్పటికీ ప్రభుత్వం గుర్తించలేకపోతోంది. ఆంగ్ల మాధ్యమానికి కావాల్సిన ప్రత్యేక శిక్షణ పొందిన టీచర్లు, పాఠశాల వాతావరణం, కుటుంబ స్థితిగతులు అనుకూలంగా లేకపోవడం వల్ల 'ఆంగ్ల మాధ్యమం'లో చేరిన విద్యార్థుల భవితవ్యం అటు తెలుగు, ఇటు ఇంగ్లిష్ నేర్చుకోలేని స్థితికి నెట్టబడ్డారు. అట్లా తొమ్మిదవ తరగతి వరకు ఆంగ్ల మాధ్యమం, పదవ తరగతి వరకు తెలుగు మీడియం ఒకే పాఠశాల ఆవరణలో, తెలుగు మీడియంతో బోధించే ఉపాధ్యాయుల చేతనే, పేద పిల్లలకు ఇంగ్లిష్ విద్యను అందిస్తున్నామని ప్రకటించుకుంటున్నది.

ఆంగ్ల మాధ్యమం రాక ముందు వరకు అన్ని తరగతులకు సరిపడ అన్ని పోస్టులున్న పాఠశాలలు, సాధించిన మెరుగైన ఫలితాలు, ఇటు ఉపాధ్యాయుల భారమైన పనిభారం, విద్యార్థుల విసుగుదలతో కేవలం 'పరీక్ష కోసం' సిద్ధపరిచే కేంద్రాలుగా పాఠశాలలు మారిపోయినవి.

పరీక్షల నిర్వహణ తీరుతెన్నులు పరిశీలిస్తే, ఈ మధ్యకాలంలో ఉద్దేశపూర్వకంగానే కొన్ని జిల్లాల్లో, అధికార యంత్రాంగమే పదవ తరగతిలో నూరు శాతం ఉత్తీర్ణత సాధించాలని, ఆ జిల్లానే మొదటి స్థానంలో నిలువాలని చేసిన ప్రయత్నాలు ఏ జిల్లా వార్తా పత్రిక తిరగేసినా కనిపిస్తాయి.

దీని ఫలితంగా కొంతమంది టీచర్లు ఇక సంవత్సరమంతా విద్యార్థులకు బోధించడం అనవసరమన్నట్లు, పరీక్ష హాల్లో సిట్టింగ్, ఫ్లయింగ్ స్క్వాడ్‌ల పేరనో, ఇన్విజిలేటర్ల, చీఫ్ సూపరింటెండెంట్లను 'మేనేజ్' చేయడం ద్వారానో 'మాల్ ప్రాక్టీస్'కు పాల్పడడం జరుగుతోంది.

దీనివల్ల కనీసం 'అల్ఫాబెటికల్' ఆర్డర్ తెలియని విద్యార్థులు పదవ తరగతి పాసై, మొన్నటి ఇంటర్ ఫలితాల్లో అత్యధికంగా 'ఆంగ్లం'లో తెలుగులో ఫెయిల్ కావడం చూస్తే పాఠశాల విద్య ప్రమాణాల స్థితి కనిపిస్తుంది. ఇట్లాంటి ఫలితాల కోసం కృషి చేస్తున్న విద్యా సంబంధిత అధికారులు, టీచర్లు ప్రైవేట్ పాఠశాలల

యాజమాన్యాలు, తమ స్వంత పిల్లలకు ఐఐటి ఫౌండేషన్, మెరుగైన విద్యను, టెక్నో స్కూల్స్‌లో లక్షలాది రూపాయలు చెల్లించి పొందుతూ తమ మెరుగైన జీవితాలకు, జీతాలు ఇస్తున్న ఇట్లాంటి ప్రభుత్వ పాఠశాలల పిల్లలకు ఏ రకమైన విద్యా ప్రమాణాలు అందిస్తున్నారో ఆలోచిస్తే ఆవేదన కలిగిస్తున్నది.

ప్రభుత్వ విద్యారంగ దుస్థితికి 'ప్రైవేటీకరణ'తో పాటు, అధికార, అనధికార ఉపాధ్యాయులు, సంఘాలు విద్యార్థి సంఘాల బాధ్యతా రాహిత్యం కన్నా ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలే కారణం.

ప్రాథమిక దశ నుండి కళాశాల దశ వరకు ఇవాళ సమాజంలో డబ్బున్న వాళ్లకు ఒక రకమైన విద్య, పేద ప్రజల బిడ్డలకు నామ మాత్రపు విద్యను అందించడం రాజ్యాంగ వ్యతిరేకమైనది. విద్యా హక్కు చట్టంలో పొందుపరిచిన సమాన, నాణ్యమైన విద్యను నిరాకరించడం.

- ప్రభుత్వ రాజ్యాంగంలో, విద్యాహక్కులో పొందుపరిచినట్లు అందరికీ సమానమైన విద్యావకాశాలు అందే పాఠశాల వ్యవస్థను తన ఆధీనంలోనే కొనసాగించాలి. ప్రైవేట్ పాఠశాలల్ని నియంత్రించాలి.
- విద్యా హక్కు చట్టంలోని నైబర్‌హుడ్ పాఠశాల వ్యవస్థలోకి అన్ని యాజమాన్యాల్లోని పాఠశాలల్ని తీసుకురావాలి. ప్రభుత్వమే పాఠశాల విద్యను అందించాలి.
- ఆంగ్ల మాధ్యమం పాఠశాలల్ని విడిగా ప్రత్యేక శిక్షణ కలిగిన ఉపాధ్యాయులచే నిర్వహించాలి.
- ప్రాథమిక 'విద్య'ను మాతృభాషలో కొనసాగించాలి. 0 నుండి 18 సంవత్సరాల వరకు 'విద్య' ప్రభుత్వం బాధ్యతగా స్వీకరించాలి.
- ప్రాథమిక పాఠశాలల్లో తరగతికో పది మందిని, ఐదు తరగతులకు ఐదుగురు టీచర్లుండేలా, ఆట స్థలం, పిఇటి, కనీస వసతులు ఉండేలా చూడాలి.
- పాఠశాలకొస్తున్న విద్యార్థులకు సంబంధించిన పుస్తకాలు, పెన్నులు, పెన్సిల్లు, యూనిఫాంలతో పాటు మంచినీటి, వైద్య వసతులన్నీ సమకూర్చాలి.
- ప్రభుత్వ పాఠశాలల చుట్టూ ఉన్న ప్రైవేట్ పాఠశాలల్ని ఎత్తివేస్తూ విద్యార్థుల్ని ప్రభుత్వ పాఠశాలల్లో చేర్చాలి. ఎయిడెడ్ పాఠశాలల్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి. నియామకాలు ప్రభుత్వమే చేపట్టాలి.
- ఉన్నత పాఠశాలల్లో కంప్యూటర్ పోస్టుల్ని నియమించాలి.
- పర్యవేక్షణా పోస్టుల్ని భర్తీ చేయాలి. ప్రత్యేక 'టాస్క్‌ఫోర్స్' బృందాలచే విధులకు గైర్హాజరయ్యే టీచర్లపై చర్యలు తీసుకోవాలి.
- భాషా పండితుల పోస్టులన్నీ అప్‌గ్రేడ్ చేయాలి.
- ప్రధానోపాధ్యాయుడిని, ఉపాధ్యాయ సిబ్బందిని పాఠశాల పనివేళల్లో ఇతర పనులతో ఆటంకపరచకూడదు.
- హాస్టల్ వ్యవస్థను పటిష్టపరచాలి. రెసిడెన్షియల్ పాఠశాలలుగా మార్చాలి.
- మధ్యాహ్న భోజనం ప్రత్యేక వ్యవస్థను రూపొందించాలి. పోషకాహారం అందించాలి.
- మంచినీళ్లు, మరుగుదొడ్డి, గ్రంథాలయం, సైన్స్, క్రీడా రంగాలను అభివృద్ధి పరచాలి.
- పాఠశాలలకు ఇస్తున్న 'గ్రాంట్' దుర్వినియోగం కాకుండా, సామాగ్రి రూపంలో అందించాలి. అవినీతికి పాల్పడుతున్న అధికారులపై కఠిన చర్యలు తీసుకోవాలి.
- పరీక్షల నిర్వహణ ప్రాథమిక స్థాయి నుండి పదవ తరగతి వరకు యూనిట్ టెస్ట్ నుండి సాలుసరి వరకు పునర్వ్యస్థీకరించాలి.
- బోధనాంశాలు, పాఠ్యాంశాలు విద్యార్థుల అభిరుచికి అనుగుణంగా, సామాజిక అవసరాలకు అనుగుణంగా, శాస్త్రీయంగా రూపొందించబడాలి.
- ప్రస్తుతం కొనసాగిస్తున్న 'ఎంఆర్‌పి' వ్యవస్థను రద్దు చేయాలి.
- ప్రతి పాఠశాలకు ఒక వ్యాయామ ఉపాధ్యాయుడు, తరగతికి ఒక పీరియడ్ విధిగా 'ఆటల' పీరియడ్ కొనసాగించాలి.
- ప్రాథమిక పాఠశాలలకు హెడ్‌మాస్టర్ పోస్టును మంజూరీ చేయాలి.
- ప్రతి సంవత్సరం పాఠశాలలకు కావాల్సిన ఆట వస్తువులు, సైన్స్ సామాగ్రి సరఫరా చేయాలి.
- విద్యార్థుల్ని శారీరక, మానసిక హింసకు గురికాకుండా బోధనా ప్రక్రియను సాగించాలి.
- బదిలీలు, శిక్షణలు సెలవుల్లోనే పూర్తి చేయాలి.
- పాఠశాల సమయం, ప్రధానోపాధ్యాయుడినైనా ఇతర ఉపాధ్యాయులనైనా విద్యార్థుల కోసం ఈ సమయం అన్న స్పృహతో, సెల్‌ఫోన్స్, విద్యేతర విషయాలతో కాలం వృథా కాకుండా చూడాలి.
- విద్యార్థి సంఘాలు ప్రభుత్వంపై ఒత్తిడి తేవడం కోసం విద్యార్థుల స్కాలర్‌షిప్స్, టెక్స్ట్‌బుక్స్ తదితర సమస్యలపై పాఠశాల పని దినాలకు ఆటంకం కలగకుండా ఆందోళన చేయాలి.
- లోకల్, ఆప్షనల్ హాలిడేస్ పేర బడి మూతపడకుండా చూడాలి.
- నిరంతరం అధ్యయనం, ఆచరణతో ఉపాధ్యాయ లోకం 'తన కుటుంబ ఉన్నత స్థితికి' కారణమైన పిల్లల భవిష్యత్ కోసం శ్రమించాలి.
- ఉపాధ్యాయ సంఘాలు, నాయకులు, రాష్ట్రస్థాయి నుండి మండల స్థాయి దాకా తరగతి గదిలో దేశ భవిష్యత్తు నిర్మించబడాలన్న ఆకాంక్షతో ముందుకు సాగాలి.

*(రచయిత తెలంగాణ టీచర్స్ ఫోరం (టిటిఎఫ్) కన్వీనర్)* వీ

ఉపాధ్యాయులకు దృక్పథ స్పష్టత అవసరం గురించి, వివిధ సమూహాల ఆకాంక్షలకు అనుగుణంగా పాఠ్యాంశాలు రూపొందాల్సిన అవసరం గురించి వివరిస్తున్నారు **జి. శ్రీనివాసాచార్యులు**

# తెలుగు బోధనలో దృక్పథాల పాత్ర

ఉపాధ్యాయుని ఆలోచనా విధానం పాఠ్యాంశ లక్ష్యసాధనలో ముఖ్యపాత్ర వహిస్తుంది. వేల సంవత్సరాల కిందటి సమాజంలోని ఇతివృత్తాలకు సంస్కృతి నుంచి అనువాదాలుగా రచించినవి తెలుగు కావ్యాలు, ప్రబంధాలు. వాటినుంచి తీసుకున్న పాఠాలను సమకాలీనంగా బోధించడానికి ఉపాధ్యాయునికి చైతన్యం, విచక్షణ ఎంతో అవసరం. ఉన్నత పాఠశాల స్థాయిలో తొమ్మిది, పది తరగతుల పాఠ్యాంశాల్ని కొన్నింటిని ఈ దృష్టితో పరిశీలిద్దాం.

తొలినాళ్లలో ఒకే వర్గానికి, విశ్వాసాలకు చెందినవారు భాషోపాధ్యాయులుగా రావడంతో వారి నేపథ్యంలో నుంచే బోధన జరుగుతూ వచ్చింది. మారిన సామాజిక పరిస్థితుల్లో అన్ని వర్గాల నుంచి తెలుగు భాషోపాధ్యాయులు వస్తున్నప్పటికి సామాజిక పరిణామాల్ని సాహిత్య చరిత్రను, ఉద్యమాలను అవగాహన చేసుకోక పోవడం వల్ల తెలుగు పాఠ్యాంశాల బోధన అంతగా మార్పును సాధించలేదని చెప్పవచ్చు. ఉపాధ్యాయుడు నిత్య విద్యార్థిగా సామాజిక చలనాలను అందుకొని తన బోధనను వర్తమానంతో సమీక్షించుకొని భవిష్యత్తరాలకు బాటలు వేసేలా మలచుకోవాల్సి ఉంది. కొత్తగా వస్తున్న భాషోపాధ్యాయుల్లో ఈ ఆలోచనలు ఉన్నప్పటికీ అవి తరగతి గదిలో కార్యరూపం దాల్చి రాష్ట్రీయ మాధ్యమిక శిక్షణా అభియాన్ సందర్భాల్లో స్పష్టంగా చర్చకు రావాల్సి ఉంది. మార్పును నిర్దేశించాల్సి ఉంది.

పద్య పాఠ్యాంశాల బోధనలో భాషోపాధ్యాయునికి చారిత్రక దృష్టి లేకపోవడం విశ్వాసాలతో బోధించడం విద్యార్థి వ్యక్తిత్వ నిర్మాణంపై ప్రభావం చూపుతుంది. విద్య మౌలిక లక్ష్యం సామాజిక మార్పు సాధించబడదు. పైగా ఇంకా నమ్మకాల సాలెగూళ్లల్లో చిక్కుకున్న పురుగుల్లా పిల్లలు చారిత్రక వాస్తవాలకు దూరమై సమాజానికి భారమవుతారు. జ్ఞానం అజ్ఞానమై దారి తప్పుతుంది. సమాజానికి ఎంతో కీడును కలిగిస్తుంది.

ప్రస్తుత తొమ్మిది, పది తరగతుల పాఠ్యాంశాల ఎంపిక అనేక ప్రక్రియా పరిచయాలతో ఎంతో మెరుగ్గానే ఉంది. పాఠ్యభాగాల నిర్ణయంగా అనవసర విషయాల్లేకుండా జాగ్రత్తగానే జరిగింది. విద్యార్థికి అవసరమైన విలువల్నే తీసుకోవడం జరిగింది. కాని పూర్వపరగాథల పేరున పరిహరించాల్సిన అంశాల్ని బోధించడం ఏ మేరకు ప్రయోజనకరం? ఇక్కడే ఉపాధ్యాయుని చైతన్యం కీలకమైనది. విద్యార్థిని తిరోగమనం పట్టించే ప్రమాదాన్ని గుర్తించాల్సి ఉంది. ఇందుకు ఉపాధ్యాయునికి ఆయా ఇతివృత్తాలపై చారిత్రక, శాస్త్రీయ దృక్పథం అవసరమవుతుంది. విశ్వాసం కేంద్రంగా బోధించే భాషోపాధ్యాయులే ఎక్కువ మంది ఉన్నారు. హేతుబద్ధంగా, చారిత్రక అవగాహనతో బోధించే వాళ్లు చాలా తక్కువ మంది ఉన్నారు. ఈ పరిస్థితిని చక్కదిద్దడానికి రాజ్యాంగం వెలుగులో లౌకిక ప్రజాతంత్ర విలువల్ని పెంపొందించడానికి వివిధ స్థాయిల నుండి ప్రయత్నం జరగాల్సి ఉంది.

పదవ తరగతి 'మాతృవేదన' పాఠ్యాంశ బోధనలో పసిప్రాయం లోని తన సంతానాన్ని ఖాండవ వనంలో వీడలేని తల్లి జరిత ఆవేదన, ఆమె కొడుకు జరితారి తల్లికి చెప్పిన సహేతుక అంశాలు 'జ్వలనంబు వాయు వశమున తొలగుడు' 'కృత్రంబుల సంశయయుత కార్యంబులు కర్తవ్యములు' మొదలైన సంభాషణ విద్యార్థిలో హేతు దృష్టిని పెంపొందిస్తుంది. పాఠ్యాంశ బోధనలో ఉపాధ్యాయుడు తల్లి వేదనను, కొడుకు హేతు దృష్టిని ప్రధానంగా చేసి బోధించడం ప్రయోజనకరం. అది విద్యార్థికి, సమాజానికి ఎంతో మేలును చేకూర్చుతుంది. కాని పూర్వ గాథల పేరున రుషుల యాగాల్లో హవిస్సులు స్వీకరించిన అగ్ని అది అరగక కృష్ణార్జునుల సహాయంతో ఖాండవ వన దహనానికి సిద్ధపడ్డాడని చెప్పడంలోని అనౌచిత్యం విద్యార్థికి ఎలాంటి ప్రయోజనాన్ని అందించదు.

దైవ కేంద్రంగా పురాణాల్ని ప్రవచిస్తున్న గుడి దాని పరంపర ఉండనే ఉంది. ఆధునిక సమాజ అవసరాల్ని సాధించాల్సిన పాఠశాల ఉపాధ్యాయుడు ఇటువంటి సందర్భాల్లో, భారతదేశానికి ఆర్యుల రాక తమ పశుపోషణ మైదానాలకై వాళ్లు ఖాండవ వన దహనాలకు పూనుకోవడం అప్పటికి అడవిని నమ్ముకొని జీవిస్తున్న మూలవాసుల బతుకులు బుగ్గవ్వడం మొదలైన చారిత్రక సత్యాల్ని, సంస్కృతుల సంఘర్షణను బోధించడం భాషోపాధ్యాయునికి సముచితంగానూ, సమున్నతంగానూ ఉంటుంది. ఆ క్రమంలో విద్యార్థి నేటి సింగూరు, సోంపేట, కాకరాపల్లి, దుంబ్రిగూడ సంఘటనలనూ అర్థం చేసుకోగలడు. ఇందుకుగాను తెలుగు భాషోపాధ్యాయుడు రాహుల్ సాంకృత్యాయన్, కొశాంబీ మొదలైన రచయితల్ని అధ్యయనం చేయాలి.

అట్లాగే 'జడివాన' పాఠ్యాంశ నేపథ్యం బోధనలో ఇంద్రునికి, కృష్ణునికి ఏర్పడ్డ వైరానికి గల కారణాల్ని సహేతుకంగా వివరించవచ్చు. తొలి ఆర్య గణనాయకుడైన ఇంద్రునికి తర్వాత వచ్చిన యదుగణ ఆర్య నాయకుడైన కృష్ణునికి సంపద ఆధిపత్యం కారణంగానే వైరం ఏర్పడిందని, అది పౌరాణికంగా ప్రచారమైన తీరును విశ్లేషించవచ్చు.

*పాఠశాలల నిర్వహణలో కొన్ని మార్పులు చేపడుతున్నా, బోధనా నాణ్యతను ఉద్దేశపూర్వకంగానే ప్రభుత్వం నిర్లక్ష్యం చేస్తోందని, ఇది అంతరాలు పెంచడానికే దోహదపడుతుందని అంటున్నారు* **కె. వేణుగోపాల్**

# పాఠశాల విద్య - విఫల ప్రయోగాలు

అటు... మట్టికొట్టుకొని, గోడలు పెచ్చులూడుతూ ఒకే గది, మాసిన బోర్డుతో ఉపాధ్యాయులు లేని పాఠశాల! ఇటు... చక్కగా రంగులు వేసి, అందంగా అలంకరించిన అయిదు గదులున్న పాఠశాల! అయిదు తరగతులున్న మా పాఠశాలలో అయిదుగురు అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులచే విద్యాబోధన గావిస్తామనే వాగ్దానంతో రంగురంగుల బ్యానర్లు కట్టి తల్లిదండ్రులను ఆకర్షిస్తున్న పాఠశాల.

ఈ రెండు పాఠశాలల్లో మొదటి పాఠశాల... ఉపాధ్యాయుడనే విద్యా వాలంటీరు... ఎప్పుడు వస్తాడో.. ఎప్పుడు తొలగించబడతాడో తెలియని పరిస్థితి . . . గౌరవ వేతనమనే చాలీచాలని జీతంతో బడి పంతులుగా ఈ పాఠశాలలో ఉద్యోగం . . . ఈ పాఠశాల ఖచ్చితంగా వచ్చే విద్యా సంవత్సరంలో కనిపించనున్న ప్రభుత్వ ప్రాథమిక పాఠశాల.

ఇక రెండో పాఠశాల తప్పకుండా ప్రైవేట్ పాఠశాలనే. అయిదుగురు ఉపాధ్యాయులతో, పని దినాలన్నీ బోధనకు ఉపయోగించే, అకడమిక్ వాతావరణంతో విద్యార్థులను ఆకర్షించేది. ఈ పాఠశాల ఫీజుల రూపంలో తల్లిదండ్రుల జేబులకు కత్తెర వేసినప్పటికీ వచ్చే విద్యా సంవత్సరం నుండి ఇటువంటి పాఠశాలలే కనిపించనున్నాయి.

విద్యా హక్కు చట్టం అమల్లోకి రాకముందు "ఇక పాఠశాలలకు మహర్దశ", "నాణ్యమైన విద్యను గ్యారంటీ చేయనున్న పాఠశాలలు", "పేద పిల్లలకు నాణ్యమైన విద్య కోసమే విద్యా హక్కు చట్టం" వంటి శీర్షికలతో, సామాన్యులను కలలలో ఊరేగించిన ప్రభుత్వ ప్రకటనలు,

---

ప్రకృతి బీభత్సాలను గురించి తెలియనితనంలో ఆనాటి జనుల భయాలను, భావనలను తెలియజేయవచ్చు. పాఠ్యాంశానికి, నేపథ్యానికి ఉన్న సంబంధం కేవలం భయ విశ్వాసాలకు సంబంధించినదని విద్యార్థికి అర్థమవడం వల్ల బోధన నిర్మాణాత్మకంగా, లక్ష్యాత్మకంగా ఉంటుంది.

శివధనుర్భంగం వంటి పాఠ్యాంశాల బోధనలో వివాహాల చారిత్రక నేపథ్యాల్ని, సీతా స్వయంవర సందర్భాన్ని సీత గుణాలను, రాముని వీరత్వాన్ని, సీతారాముల దాంపత్యాన్ని వివరించవచ్చు. కాని రాముని సందర్భం రాగానే తెలుగు భాషోపాధ్యాయుడు శ్రీరాముడు ధర్మ స్వరూపుడని తన్మయత్వంతో హైందవ ధర్మాన్ని నెత్తికెత్తుకొని, దాన్ని ఉద్ధరించే బాధ్యత తన భుజస్కంధాలపైనే ఉన్నట్టు ప్రబోధించడం తరచుగా జరుగుతుంటుంది. ప్రస్తుతం ప్రభుత్వ పాఠశాలల్లో మిగిలిన నిమ్నవర్గాల పిల్లలకు శంబూక, ఏకలవ్యుల వారసులకు ఈ వైఖరి ఏ మేరకు మేలు చేస్తుందో ఆలోచించాలి. తెలుగు సామాజిక, సాహిత్య రంగాల్లో వచ్చిన అస్తిత్వ ఉద్యమాల నేపథ్యంలో ఆ ఉద్యమాలు విసురుతున్న సవాళ్లను అర్థం చేసుకుంటే ఉపాధ్యాయుడు తన పరిమితుల్ని, ప్రమాణాల్ని గ్రహించవచ్చు.

భాషా సాహిత్యాలు వాటికవే గొప్పవికావు. సమాజమే పునాది. ఈ విచక్షణతో సాహిత్య ప్రక్రియలను, వస్తువును అర్థం చేసుకోవాలి. పద్యాన్ని బతికించుకోవడమే తెలుగు ఉపాధ్యాయుని ప్రధాన బాధ్యతగా భావించే స్థితి ఉంది. రాచరిక సమాజ సాహిత్య రూపంగా విస్తరించిన పద్యం సామాజిక అంశాలతో శతకాలుగా, నాటకంగా మనుగడ సాగించడం, క్రమంగా సామాజిక పరిణామ క్రమంలో ఆధునిక ప్రక్రియలు ప్రధాన స్థానాన్ని ఆక్రమించడం ఒక వాస్తవం. 'అష్టావధానం' పాఠం విద్యార్థులకు అంతగా కొరుకుడు పడడం లేదని అత్యధికుల అభిప్రాయం. ఈ సందర్భంగా చెళ్లపిళ్ల వారి మాటల్ని 'ఆశు కవితా సన్యాసమిప్పించవే!', దొమ్మరాట వంటి సత్యాల్ని గుర్తించాల్సి ఉంది. సాహిత్య చరిత్ర వెలుగుల్లోకి సరికొత్త పద్ధతిలో భాషా క్రీడలను నిర్వహించుకోవాల్సి ఉంది.

ఆయా కవుల దేశ కాలాలను దృష్టిలో పెట్టుకోకుండా బోధించడం వల్ల అంతగా ప్రయోజనం చేకూరదు. దాశరథి 'తామసి' ఆధునిక పద్య రచనలో కవిని ప్రభావితం చేసిన ఆనాటి ప్రపంచ పరిస్థితుల్ని అవగతం చేసుకోవాలి.

చాసో 'బొండ మల్లెలు' చెప్పే ఉపాధ్యాయుడు ఆ పాఠ్యాంశాన్ని ఒక పేదకు జరిగిన అన్యాయంగా మాత్రమే చూస్తే సరిపోదు. మార్క్స్ అదనపు విలువ సూత్రం వెలుగులో కథానికను విద్యార్థికి అర్థం చేయించాలి. వదరుబోతు, చేనేత దృక్పథం మొదలైన పాఠ్యాంశాల్ని వాటి సామాజిక సందర్భాల వెలుగులో బోధించాలి. చేరా అన్నట్టు సాధారణ పాఠశాల విద్యార్థికి తగినంతగా వ్యాకరణాంశాల్ని కుదించాలి. ఆధునిక అవసరాలకు తగినట్టుగా రాబోవు సిలబస్‌ను నిర్ణయించాలి. ప్రధానంగా ఉపాధ్యాయుని అవగాహన, ఆలోచనా విధానం, నిబద్ధత తెలుగుభాషా బోధనలో ప్రధానపాత్ర వహిస్తాయి. ప్రస్తుతం ప్రపంచీకరణ సంక్షోభంలో మాతృ భాషోపాధ్యాయులకు ప్రజాస్వామిక విలువలే సరియైన ప్రమాణాలు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

మీడియా ప్రచారంతో ఒక విద్యా సంవత్సరం గడచిపోయి, రెండో విద్యా సంవత్సరం ప్రారంభం కానున్న దశలో ఉన్నాం.

విద్యాహక్కు చట్టాన్ని, ఈ చట్టం ద్వారా నాణ్యమైన విద్యను ఇస్తానంటూ రాష్ట్ర ప్రభుత్వం విద్యార్థుల సంఖ్య కనుగుణంగా ఉపాధ్యాయ పోస్టులను హేతుబద్ధీకరణ చేయడానికి ఉత్తర్వులిచ్చి, వచ్చే విద్యా సంవత్సరం 8 వేల ప్రాథమిక పాఠశాలలను సహజ మరణానికి సిద్ధం చేస్తూ, విద్యార్థుల సంఖ్య లేదని ఉపాధ్యాయ పోస్టులను తరలించడానికి విద్యాశాఖ రంగం సిద్ధం చేసింది. పది కన్నా తక్కువ విద్యార్థులున్న 3 వేల పాఠశాలలను విద్యా వాలంటీర్లతో పాఠశాలను నడపాలని ఆదేశాలిచ్చింది. (ఈ వ్యాసం రాసే సమయానికి హైకోర్టు ఒక ప్రజా ప్రయోజనాల వ్యాజ్యంలో విద్యావాలంటీర్లను తొలగించాలని, రెగ్యులర్ టీచర్లను నియమించాలని ఆదేశాలిచ్చింది). మరో నాలుగు వేల పాఠశాలలను ఏకోపాధ్యాయ పాఠశాలలుగా మారుస్తోంది. పిల్లలు వస్తేనే ఉపాధ్యాయులనిస్తానని షరతు పెట్టింది. ఉపాధ్యాయులుండి, చక్కని వాతావరణం ఉంటే పిల్లలు వస్తారనే కనీస అవగాహన లేకుండా విద్యార్థులుంటేనే ఉపాధ్యాయులనే సరికొత్త ఆలోచనకు ప్రభుత్వం నడుం కట్టి వేలాది పాఠశాలలను రేషనలైజేన్ పేరుతో మూసివేతకు రంగం సిద్ధం చేసింది.

విద్యాహక్కు చట్టం వస్తే బడి నిండా ఉపాధ్యాయులు నియమింప బడి, ఉపాధ్యాయుల కొరత తీరనున్నదని ఆశించిన వారికి రేషనలైజేషన్ పేరుతో ఆశాభంగం కల్గించింది. విద్యార్థుల సంఖ్య మేరకు ఉపాధ్యాయులను నియమిస్తారనుకున్న వారికి కొత్తగా ఒక ఉపాధ్యాయుడిని నియమించేది లేదు, ఒక్క ఉపాధ్యాయుడిని ఉద్యోగం నుంచి తొలగించేది లేదని జి.ఒ. రావడంతో కొత్తగా ఎన్ని కబుర్లు చెప్పినా ఈ ప్రభుత్వం కొత్త ఉపాధ్యాయ పోస్టులను మంజూరు చేయదని తేలిపోయింది. అంటే ఉన్న ఉపాధ్యాయుల పైననే అధిక పని భారాన్ని మోపి వచ్చే విద్యా సంవత్సరం చదువు చెప్పించడానికి ప్రభుత్వం సన్నద్ధం అవుతోంది.

ఉన్నత పాఠశాలల్లో తరగతివారీగా సెక్షన్లు చేయడానికి బదులుగా మొత్తం పాఠశాలలోని నమోదు ఆధారంగా సెక్షన్లు చేయడం, 60 మంది విద్యార్థులకో సెక్షనుగా ఉపాధ్యాయులను కేటాయించడం, అశాస్త్రీయంగా బోధనా పీరియడ్లను నిర్ణయించడంతో ఉపాధ్యాయులపై అధిక భారం పడనుంది. మూడేళ్ళ క్రితం ఆర్భాటంగా ప్రారంభించిన ఇంగ్లిష్ మీడియం తరగతులకు పోస్టులు కేటాయించకపోవడంతో ఉన్న కొద్ది ఉపాధ్యాయుల పైననే భారం పడనుంది. విద్యార్థుల సంఖ్య అధికంగా ఉండి చక్కగా నడిచే పాఠశాలలనుండి పదుల సంఖ్యలో ఉపాధ్యాయ పోస్టులను తరలించడంతో బాగా నడిచే పాఠశాలలు బలహీనమయ్యే ప్రమాదం ఉంది. ప్రభుత్వ పాఠశాలలను ఉద్దేశ్య పూర్వకంగా బలహీనపరచడంతో పాటు, ప్రైవేట్ పాఠశాలలు పుట్టగొడుగుల్లా ప్రారంభం అవుతున్న నేపథ్యంలో ప్రభుత్వం అమలు చేస్తున్న నూతన ఆర్థిక విధానాలు పాఠశాల విద్యలో అమలు చేయడానికి బలంగా ప్రయత్నిస్తోంది.

విద్యా వ్యాపారం, ప్రభుత్వ, ప్రైవేట్ భాగస్వామ్యం, అంతరాలతో కూడిన విద్యను చట్టబద్ధం చేసిన 'విద్యాహక్కు చట్టం' అమలులో ఒక సంవత్సరం గడిచిన తర్వాత రెండో విద్యా సంవత్సర భవిష్యత్ చిత్రపటం పై విధంగా ఉండబోతోంది. 60 ఏళ్ల స్వాతంత్ర్య కాలంలో విద్యారంగం విఫల ప్రయోగాల వేదికగా మారిన నేపథ్యంలో ఉపాధ్యాయ పోస్టుల రేషనలైజేషన్‌తో పాటు మరికొన్ని ప్రయోగాలు పాఠశాల విద్యలో అమలు కానున్నాయి. ఈ ప్రయోగాలన్నీ సామాన్యులకు ఉచిత విద్యనందించే ప్రభుత్వ విద్యాసంస్థలను బలహీనపరిచి ప్రైవేట్, కార్పొరేట్ యాజమాన్యాలకు అనుకూలంగా మారనున్నాయి.

## ఒకటో తరగతి నుంచి ఇంగ్లిష్ బోధన

మూడేళ్ల క్రితం 6500 ఉన్నత పాఠశాలల్లో ఆరవ తరగతి నుండి ఇంగ్లిష్ మీడియంలో తరగతులను ప్రారంభించిన ప్రభుత్వం ఇప్పటి వరకు ఆ పాఠశాలలకు అదనంగా వసతులేమీ కల్పించలేదు. ఇంగ్లిష్ మీడియం బోధనలో టీచర్లకు ప్రత్యేక శిక్షణ ఇవ్వకపోవడంతో బోధనలో నాణ్యత కొరవడింది. దీనికితోడు అయిదవ తరగతి వరకు తెలుగు మీడియంలో చదివి ఒకేసారి ఆరవ తరగతిలో ఇంగ్లిష్ మీడియంలో బోధన ప్రారంభించడం పట్ల విమర్శలు వచ్చాయి. దీనికి పరిష్కారంగా ఒకటో తరగతి నుంచి ఇంగ్లిష్‌ను ఒక సబ్జెక్టుగా ప్రవేశ పెట్టాలని, తద్వారా పిల్లల ఇంగ్లిష్ సామర్థ్యాన్ని పెంచగలమనే అశాస్త్రీయ ఆలోచనతో ప్రభుత్వం వచ్చే విద్యా సంవత్సరం నుంచి ఇంగ్లిష్‌ను ప్రాథమిక పాఠశాల్లో ప్రవేశపెట్టాలని ఆదేశాలిచ్చింది. ఆదేశాలైతే ఇచ్చింది గాని ఇంతవరకు ఇంగ్లిష్ పాఠ్య పుస్తకం తయారు కాలేదు. ఉపాధ్యాయులకు ఇంగ్లిష్ బోధనా నైపుణ్యాలు పెంచడానికి శిక్షణ ఇవ్వలేదు. పైగా ఇంగ్లిష్ బోధనకై ప్రత్యేకంగా ఇంగ్లిష్ బోధనలో శిక్షణ పొందిన ఉపాధ్యాయులను ప్రతి ప్రాథమిక పాఠశాలలో అదనంగా నియమించాలని ఉపాధ్యాయ సంఘాలు కోరినప్పటికీ 'ఎ' ఫర్ 'ఏపిల్' అని బోధించడానికి ప్రత్యేక ఉపాధ్యాయులు కావాలా? అని విద్యామంత్రి ఎద్దేవా చేస్తున్నారు. ఈ అదనపు సబ్జెక్టు బోధన, అసలే ఉపాధ్యాయుల కొరత, ఏకోపాధ్యాయ పాఠశాలలు ఉన్న పాఠశాలల్లో ఉపాధ్యాయులకు అదనపు పనిభారం కానున్నది. వెరసి ఇంగ్లిష్ బోధన నామమాత్రమై విద్యార్థులకు ఇంగ్లిష్‌లో నైపుణ్యం ప్రశ్నార్థకం కానున్నది.

తల్లిదండ్రులు తమ పిల్లలకు ఇంగ్లిష్ మీడియం చదువు కావాలని ప్రైవేట్ పాఠశాలలకు పంపిస్తున్నారని, ఫలితంగా ప్రభుత్వపాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య తగ్గిపోతోందని ఇంగ్లిష్ మీడియంలో ఉన్నత పాఠశాలల్లో బోధనగాని, ఒకటో తరగతి నుంచి ఇంగ్లిష్ ఒక సబ్జెక్టుగా ప్రవేశ పెట్టే విషయంలో ప్రభుత్వం చేస్తున్న వాదన సరికాదు. నిజానికి ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య తగ్గిపోవడానికి గత రెండు దశాబ్దాలుగా ప్రభుత్వం అవలంబించిన విధానాలు, పాఠశాలల్లో అవసరాలకు తగినంత సౌకర్యాలు కల్పించక పోవడం, ఉపాధ్యాయులను సకాలంలో నియమించక పోవడం, పాఠశాలలను ఆకర్షణీయంగా తీర్చిదిద్దక పోవడం కారణాలు. ప్రధానంగా ప్రైవేట్ పాఠశాలలకు నిబంధనలను సడలించి విచ్చలవిడిగా అనుమతులివ్వడం,. ఈ విషయాలను ప్రభుత్వం అంగీకరించక తన వైఫల్యాలను కప్పిపుచ్చుకోవడానికి ఉపాధ్యాయులకు జవాబుదారీతనం లేదనే నిందా ప్రచారం చేస్తోంది.

## విద్యాశాఖ విభజన

ఒకటి నుండి పది తరగతులను ప్రాథమిక, అప్పర్ ప్రైమరీ,

ఉన్నత పాఠశాలల్లో నిర్వహిస్తూ పాఠశాల విద్యాశాఖగా ఉన్న శాఖను విభజించాలని, ఇంటర్మీడియట్ విద్యను పాఠశాల విద్యలో విలీనం చేయాలనే ప్రయత్నాలు గత నాలుగైదేళ్ళుగా సాగుతోంది.

కొఠారీ కమిషన్ సిఫార్సుల మేరకు నలభై ఏళ్ళనాడు 10-2-3 పద్ధతి అమల్లోకి వచ్చిన తర్వాత దీని సాఫల్య వైఫల్యాలను సమీక్షించడానికి ప్రత్యేక అధ్యయనం ఏదీ జరగకుండానే మొదటి దశగా సెక్రటేరియట్ స్థాయిలో ఇద్దరు విద్యా కార్యదర్శులను నియమించింది. ఆ తర్వాత ఇద్దరు మంత్రులు వచ్చారు. ఇద్దరు మంత్రులకు క్షేత్ర స్థాయిలో ఒకే శాఖ ఆధీనంలో ఉండే పాఠశాలల వలన ఆధిపత్య సమస్య రావడంతో విద్యాశాఖను విభజించాలనే ఆలోచన చేసి క్షేత్ర స్థాయిలో పాఠశాలల నిర్వహణ కూడా రెండు శాఖలుగా చేయాలనే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

రాజీవ్ విద్యా మిషన్‌గా పిలువబడే సర్వశిక్షాఅభియాన్ ఆధీనంలోనికి ప్రాథమిక పాఠశాలలు, అప్పర్ ప్రైమరీ పాఠశాలలను తెచ్చి ప్రత్యేకంగా కొత్తగా జిల్లా స్థాయి ప్రాథమిక విద్యాశాఖాధికారిని నియమించాలని తద్వారా ప్రాథమిక విద్యా నిర్వహణకు క్షేత్ర స్థాయి నుంచి, మంత్రిత్వ శాఖ వరకు సమన్వయం పెరగాలనే ప్రతిపాదనలు చేస్తోంది. అట్లే ప్రస్తుతమున్న డి.ఇ.ఒ.ను మాధ్యమిక విద్యాశాఖాధికారిగా వ్యవహరించి, ఉన్నత పాఠశాలల నిర్వహణకే పరిమితం చేయాలని ప్రతిపాదనలున్నాయి.

అట్లే పాఠశాల విద్యలో 11, 12 తరగతులను చేర్చి ప్రాథమిక విద్యగా 1 నుండి 8 తరగతులు, 9 నుండి 12 తరగతులతో మాధ్యమిక విద్యగా నిర్వహించాలనే ప్రతిపాదనలు కూడా ఉన్నాయి.

ఈ మార్పులన్నీ నిర్వహణకే పరిమితం కానున్నాయి. కాని ప్రభుత్వ పాఠశాలల నిర్వహణలో, బోధనా నాణ్యతను పెంచడంలో దృష్టిపెట్టాల్సిన అనేక అంశాలను ప్రభుత్వం ఉద్దేశ్య పూర్వకంగా దాటవేస్తూ ఈ కొత్త ప్రతిపాదనలు తెస్తోంది. నిజానికి గత అయిదేళ్ళుగా ఉమ్మడి సర్వీసు రూల్స్ వివాదంతో పర్యవేక్షణ పోస్టులన్నీ ఖాళీలుగా ఉండి, ఇంచార్జీలతో నెట్టుకు రావడం వలన విద్యా పాలన అస్తవ్యస్తమైంది. జిల్లాలకు డి.ఇ.ఒ.లు, మండలాల్లో ఎం.ఇ.ఒ.లు, డివిజన్లకు డిప్యూటీ ఇ.వోలు లేకపోవడంతో పర్యవేక్షణ చిన్నాభిన్నమైంది. సర్వీస్ రూల్స్ వివాదాన్ని పరిష్కరించి విద్యాపాలనను ఒక గాడిలో పెట్టాలనే ఆలోచన లేకపోవడంతో మొత్తం 1094 మండలాల్లో 750 మండలాల్లో పూర్తి కాలపు ఎం.ఇ.ఒ.లు లేకుండానే నూతన విద్యా సంవత్సరం ప్రారంభం కానుంది.

## మోడల్ స్కూల్స్

కేంద్ర ప్రభుత్వం 6000 మోడల్ స్కూళ్ళను ఈ విద్యా సంవత్సరం నుంచి దేశవ్యాప్తంగా ప్రవేశపెడుతోంది. దాంట్లో రాష్ట్రానికి 755 పాఠశాలలు రానున్నాయి. ఈ పాఠశాలలన్నీ తక్కువ అక్షరాస్యత ఉన్న ప్రాంతాల్లో నెలకొల్పుతారు. అంటే 755 మండలాల్లో మోడల్ స్కూళ్ళ పేర సరికొత్తగా పాఠశాలలు రానున్నాయి. ఈ పాఠశాలలన్నీ రాష్ట్రీయ మాధ్యమిక శిక్షా అభియాన్ పథకంలో భాగంగా నిర్వహింపబడుతాయి. ఈ పాఠశాలల్లో 6వ తరగతి నుంచి ఇంగ్లిష్ మీడియంలో, సి.బి.ఎస్.ఇ. సిలబస్‌తో 12వ తరగతి వరకు బోధన ఉంటుంది. ఈ పాఠశాలలన్నీ డే స్కూల్సుగా ఉంటాయి. ఇందుకోసం ప్రత్యేకంగా 5 ఎకరాల స్థలాన్ని ఎంపిక చేసి, 3 కోట్ల రూపాయలతో భవనాలు నిర్మించి ప్రతి సంవత్సరం 80 లక్షల రికరింగ్ ఖర్చు ప్రతిపాదనలతో మన రాష్ట్రంలో 355 పాఠశాలలు ఈ విద్యా సంవత్సరమే ప్రారంభించాలనే ఆర్భాటపు ప్రకటనలు ప్రభుత్వం చేసింది. అయితే ఇంకో పదిహేను రోజుల్లో పాఠశాలలు పున:ప్రారంభించనున్న నేపథ్యంలో ఇంతవరకు ఒక్క పాఠశాల ఏర్పాటు గాని, అందుకు బోధనా సిబ్బంది నియామకం గాని, తగినన్ని నిధులుగాని మంజూరు కాలేదనేది కొసమెరుపు.

ఒక్కొక్క పాఠశాలకు 3 కోట్లతో మౌలిక వసతులకు చేసే ఖర్చును ఇప్పటికే ఉన్న ప్రభుత్వ, జిల్లా పరిషత్ పాఠశాలల అభివృద్ధి చేసి, అందరికీ నాణ్యమైన విద్య అందించే అవకాశాలను కల్పించే అవకాశమున్నా ప్రభుత్వం ఆ రకమైన ఆలోచన చేయకుండా ప్రస్తుత అంతరాల విద్యా దొంతరలో మరో పాఠశాల వ్యవస్థను తేనున్నది. ఇది గ్రామీణ విద్యార్థులలోని ప్రతిభావంతులకు ప్రోత్సాహకరంగా ఉంటుంది.

కొఠారీ కమిషన్ సూచించిన కామన్ స్కూల్ విధానం ద్వారా అందరికీ ఒకేరకమైన నాణ్యమైన విద్యను అమలు చేయకుండా ఉన్న వారికో బడి, లేని వారికో బడి అని విద్యార్థులలో రకరకాల అంతరాలను సృష్టించడమే ధ్యేయంగా ప్రభుత్వ విధానంగా ఉంది.

పదేళ్ళ క్రితం ఒకటో తరగతిలో 22,89,220 మంది విద్యార్థులు చేరగా పదో తరగతికి వచ్చేసరికి 10,67,642 మంది అయ్యారు. అంటే 53.6 శాతం విద్యార్థులు పదో తరగతి పూర్తి చేయలేక బాల కార్మికులు, కూలీలుగా, వ్యవసాయ కార్మికులుగా పనిచేస్తూ బడి బయట ఉంటున్నారు. ఈ పిల్లలందరినీ బడిలోనికి చేర్చడానికి పాఠశాలలకు తగు వసతులు కల్పించడం, అదనపు ఉపాధ్యాయ పోస్టులు మంజూరు చేయడం వంటి మౌలిక విషయాలను ప్రభుత్వం విస్మరిస్తోంది. అట్లే చదువుకుంటున్న విద్యార్థులలో ఈ విషయంలో కూడా ప్రభుత్వం శ్రద్ధ తీసికోవాల్సి ఉంది.

ఉపాధ్యాయులుగా తమ సామాజిక బాధ్యతను గుర్తిస్తూ తమ పాఠశాలలకు వచ్చే విద్యార్థులకు నాణ్యమైన విద్య నందించడానికి, మంచి చదువుకు ప్రతి ఉపాధ్యాయుడు పూచీ పడాల్సి ఉంది. ప్రభుత్వ పాఠశాలల్లో చేరే ప్రతి విద్యార్థినీ బాధ్యతగల పౌరుడుగా తీర్చిదిద్దడానికి ప్రతి ఉపాధ్యాయుడు తమ బాధ్యత నిర్వహించాలి.

ప్రభుత్వ పాఠశాలల పట్ల, ప్రభుత్వం అవలంబించే వివక్షాపూరిత ప్రభుత్వ విధానాలను తల్లిదండ్రులు, సమాజం దృష్టికి తెచ్చే బాధ్యతను కూడా గుర్తింపజేయడంతో పాటు, ఉపాధ్యాయులు, సమాజం కలిసి ప్రభుత్వంపై ఒత్తిడి పెంచి ప్రభుత్వ పాఠశాలల పరిరక్షణ కర్తవ్యంగా సాగాల్సిన ఆవశ్యకత ఉంది.

పాఠశాల విద్యలో ఇన్ని రకాల ప్రయోగాలు ఒకే విద్యా సంవత్సరంలో అమలుగానున్న నేపథ్యంలో విద్యా వ్యవస్థ మరింత సంక్షోభంలో పడనున్నది. ప్రభుత్వ పాఠశాలలు రోజురోజుకు ఆదరణ కోల్పోతూ ఉన్న తరుణంలో సరియైన చర్యలు తీసుకొని విద్యాహక్కును అందరికీ అందించే చర్యలు తీసుకునే విధంగా మరింత కృషి జరగాల్సి ఉంది.

*(రచయిత ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ రాష్ట్ర అధ్యక్షులు)* వీ

*మహిళలను ఉద్దేశించిన పత్రికల నుండి మహిళలు నిర్వహించిన, నిర్వహిస్తున్న పత్రికల చరిత్రను వివరిస్తున్నారు*

**ఎన్. యాకయ్య**

# తెలుగు పత్రికారంగంలో స్త్రీలు

స్త్రీల కోసం ప్రత్యేకంగా పత్రికలు ఉండాలనే మహత్తర ఆలోచన తెలుగు సమాజంలో దాదాపు నూట పాతిక సంవత్సరాల క్రితమే వచ్చింది. వాస్తవానికి క్రైస్తవ మత ప్రచారం కోసం తెలుగునాట తొలుత ప్రారంభమైన పత్రికలు ఆ తర్వాత కాలంలో సంఘ సంస్కరణకు ఆయుధంగా పనిచేశాయి. సంఘసంస్కరణను ఉద్యమంగా నడిపిన వీరేశలింగం పంతులు తెలుగు సాహిత్యంలో అనేక ప్రక్రియలకు శ్రీకారం చుట్టినట్లుగానే తెలుగు పత్రికా రంగానికి కూడా దిశానిర్దేశం చేశారు. అంతేగాక సాంఘిక దురాచారాల వల్ల ఒక హింసా వలయంలో ఉన్న స్త్రీ జనాభ్యుదయం కోసం 1883లో 'సతీహిత బోధిని' అనే మాసపత్రికను మూడేళ్లపాటు నిర్వహించారు. ఇలా పంతులుగారు అచ్చంగా మహిళల కోసం నడిపే పత్రికలకు జీవం పోశారు.

'తెలుగు దేశపు స్త్రీల కొరకును... బాల బాలికల కొరకును ప్రచురింబడు మాసపత్రిక' అని ముఖచిత్రంపై పేర్కొంటూ 'జనానా' అనే పత్రిక మల్లాది వెంకటరత్నం సంపాదకత్వంలో 1893లో వెలువడింది. రాయసం వెంకటశివుడు అనే ఉపాధ్యాయుడు 1894లో ఈ పత్రిక బాధ్యతలను స్వీకరించి 1907 వరకు నిర్వహించారు. ప్రత్యేకించి మహిళలే సంపాదకత్వం వహించి నడిపిన పత్రికల గురించి చర్చించాలనుకున్నప్పుడు డ్రైడన్ దొరసాని అనే బ్రిటిష్ మహిళ చేసిన కృషిని పేర్కొనాల్సి ఉంటుంది. ఆమె గుంటూరు కేంద్రంగా 1892లో ఉపాధ్యాయోపకారి అనే మాసపత్రికను వెలువరించారు. విద్యా బోధనకు సంబంధించిన వ్యాసాలు ఈ పత్రికలో ప్రచురించేవారు.

ఆ తర్వాత సరిగ్గా పదేళ్లకు 1902లో అప్పటికే ఏలూరు కేంద్రంగా 'దేశోపకారి' పత్రికలను నడుపుతున్న ఎన్. సీతారామయ్య స్త్రీలకు ప్రత్యేకించి ఓ పత్రిక అవసరమని భావించి 'హిందూ సుందరి'ని ప్రారంభించారు. దేశోపకారి ప్రెస్‌లోనే ఈ పత్రిక అచ్చయ్యేది. ఈ పత్రిక తొలిసంచికలో పతివ్రతాల ధర్మాలు, సంసార స్త్రీలు నేర్చుకోవాల్సిన నీతి సూత్రాలు, వినసొంపైన పాటలు, అలంకరణలు, శుభ్రత తదితర వ్యాసాలతో పాటు కథలు ప్రచురించేవారు. విద్య పట్ల అభిమానం, సాహిత్యం పట్ల ఆసక్తి కలిగించే వ్యాసాలకు ఇందులో ప్రాముఖ్యముండేది. అయితే స్త్రీల కోసం ప్రచురిస్తున్న పత్రికను స్త్రీలే నడిపితే బాగుంటుందన్న ఆలోచనతో ఆయన మొసలికంటి రాంబాయమ్మ, వెంపటి శాంతాబాయమ్మలను పత్రిక బాధ్యతలు స్వీకరించాల్సిందిగా కోరారు. ఆయన కోరిక మేరకు 1904లో వారిద్దరు 'హిందూ సుందరి' సంపాదక బాధ్యతలు చేపట్టారు. బహుశా వీరే తొలి తెలుగు మహిళా ఎడిటర్లు, జర్నలిస్టులు కావొచ్చు.

వీరు ఏడెనిమిది సంవత్సరాలు పనిచేశాక మాడభూషి చూడమ్మ, కళ్లేపల్లి వెంకటరమణమ్మ ఈ పత్రిక బాధ్యతలు స్వీకరించారు. అప్పటికే సంపాదకుడు అనే శబ్దం వాడుకలోకి వచ్చినందువల్ల వీరిద్దరు తాము సంపాదకురాండ్రుగా ప్రకటించుకున్నారు. 1917 నుంచి ఈ పత్రిక ప్రచురణ కాకినాడకు మారి తర్వాత ఆగిపోయింది.

1901 సెప్టెంబర్ 'జనానా' సంచికలో 'హిందూ సుందరి' అనే ఆంగ్ల పత్రికపై సమీక్ష ఉంది. 'ప్రాచీన, ప్రస్తుత కాలానికి చెందిన హిందూ కాంతలు', 'హిందూ దేశంలో స్త్రీ విద్య, ప్రస్తుత స్థితి' అనే వ్యాసాలు ఉన్న ఈ పత్రికను కమలాంబ సత్యనాథం అనే మహిళ నడిపినట్లు సమీక్షలో పేర్కొన్నారు. తెలుగు హిందూ సుందరికి ఈ పత్రికే స్ఫూరినిచ్చి ఉంటుందని సీనియర్ పాత్రికేయులు పొత్తూరి వెంకటేశ్వరరావు అభిప్రాయం.

సనాతన సంప్రదాయాన్ని ఎత్తిపడుతూ 1904లో కాకినాడ నుంచి 'సావిత్రి' అనే మాసపత్రిక వెలువడింది. పులుగుర్త లక్ష్మీనరసమాంబ సంపాదకత్వంలో వెలువడిన ఈ పత్రికలో వీరేశలింగం పంతులు సంస్కరణోద్యమాన్ని విమర్శిస్తూ వ్యాసాలు వస్తుండేవి. ఈమె సంఘ సంస్కరణకు వ్యతిరేకి అయినప్పటికీ స్త్రీకి విద్య అవసరాన్ని నొక్కి చెప్తూ వ్యాసాలు రాయడం గమనించాల్సిన విషయం. ఆమె 'జనానా', హిందూ సుందరి పత్రికల్లో ఇదే దృష్టితో వ్యాసాలు రాశారు. 1904 నుంచి 1911 వరకు ఈ పత్రికను నడిపినట్లు తెలుస్తోంది.

స్త్రీ విద్యకు, సమకాలీన సమస్యలకు ప్రాముఖ్యాన్నిస్తూ 1909లో గోదావరి జిల్లా నుంచి బి. నారాయణమ్మ సంపాదకత్వంలో 'సుందరి' అనే పత్రిక వెలువడింది. దేవులపల్లి కృష్ణశాస్త్రి సోదరి వింజమూరి వెంకటరత్నం సంపాదకురాలిగా ప్రత్యేకించి స్త్రీల కోసం 'అనసూయ' అనే మాసపత్రిక 1914లో ప్రచురితమైంది. అలాగే మాలతి పట్వర్ధన్ సతి సంపాదకత్వంలో 'స్త్రీ ధర్మ' అనే మాసపత్రిక చెన్నై నుంచి వెలువడింది.

గాడిచర్ల హరిసర్వోత్తమరావు భార్య రమాబాయి సంపాదకురాలిగా 1918లో సౌందర్యవల్లి (మాసపత్రిక) ప్రచురించారు. మహిళల పత్రిక అని ప్రకటించకపోయినప్పటికీ స్త్రీల విషయాలకు ప్రాముఖ్యమిస్తుండేవారు. స్త్రీలు తమ విద్యా వికాసం కోసం ఒక

విశ్వవిద్యాలయం కావాలని కోరుతున్నట్లు ఈ పత్రికలో 90 సంవత్సరాల క్రితమే ప్రచురించడం సంపాదకురాలి చైతన్యానికి, ముందు చూపుకు నిదర్శనం.

హిందూ సుందరికి సంపాదకురాలిగా పనిచేసిన కాళ్లేపల్లి వెంకటరమణమ్మ సంపాదకత్వంలో కాకినాడ కేంద్రంగా 'ఆంధ్రలక్ష్మి' అనే మాసపత్రిక 1921లో వెలువడింది. ఈ పత్రికను మూడేళ్లపాటు నిరాటంకంగా నిర్వహించారు. యామినీ పూర్ణతిలకమ్మ సంపాదకురాలిగా తొలి పక్షపత్రిక 'హిందూ యువతి' 1923లో చెన్నై నుంచి వెలువడింది. అలాగే 'భారత మహిళ' అనే మాసపత్రిక యు. సుందరమ్మ అనంతపురం నుంచి 1925లో ప్రచురించారు. స్త్రీల సమస్యలను చర్చించడంలో కేసరి సంపాదకత్వంలో వచ్చిన 'గృహలక్ష్మి' తనదైన పాత్ర పోషించింది. మహిళాభ్యుదయం లక్ష్యంగా, వారికోసం ప్రత్యేక శీర్షికలు నిర్వహించిన ఘనత గృహలక్ష్మిది. తొలిసారిగా ఓ మహిళను కాలమిస్ట్‌గా పరిచయం చేసింది కూడా ఈ పత్రికలోనే. తొలి తెలుగు మహిళా కాలమిస్ట్ కనపర్తి వరలక్ష్మమ్మ 'శారద లేఖలు' పేరిట గృహలక్ష్మిలో ప్రత్యేక శీర్షిక నిర్వహించారు. 1940 ప్రాంతంలో స్త్రీలు, బాలల కోసం రాజమండ్రికి చెందిన టి.కె. యశోదాదేవి 'యశోద' పత్రికను నడిపారు. ఇది వారానికి రెండుసార్లు వెలువడేది. అలాగే 'విశ్వజ్ఞాని' మాసపత్రికను మద్రాస్‌కు చెందిన ఎస్. యామిని పూర్ణతిలకమ్మ నిర్వహించారు. ఈ కాలంలో మద్రాస్ కేంద్రంగా ఆర్. రంగనాయకమ్మ సంపాదకత్వంలో హాస్య ప్రధానమైన 'వినోదిని' అనే మాసపత్రిక వెలువడింది. ఈ పత్రికలో జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు, మొక్కపాటి నరసింహశాస్త్రి, బివి టప్పయ్య రచనలు చేశారు.

## తెలంగాణలో తొలి మహిళా సంపాదకురాలు

ఆర్థిక, రాజకీయ, సామాజిక కారణాల వల్ల ప్రత్యేకించి స్త్రీల కోసం నడిపిన పత్రికలు, స్త్రీలు నడిపిన పత్రికలన్నీ ఎక్కువగా కాకినాడ, కొన్ని ఏలూరు, మద్రాస్ నుంచి వెలువడ్డాయి. తెలంగాణ ప్రాంతం నుంచి తొలిసారిగా ఓ మహిళ సంపాదకత్వం వహించి నడిపిన మాసపత్రిక 'తెలుగుతల్లి'. 1939లో సికింద్రాబాద్ నుంచి రాచమళ్ల సత్యవతీదేవి సంపాదకత్వంలో ఈ పత్రిక ప్రారంభమైంది. 1940 మార్చ్‌లో తెలుగుతల్లి 'పోతన' ప్రత్యేక సంచికను ముద్రించారు. ఇందులో పత్రికా రచనపై సురవరం ప్రతాపరెడ్డి, పి.వి. సుబ్బరాయుడు రాసిన విలువైన వ్యాసాలున్నాయి. మద్రాసాంధ్ర మహిళా సభ తరఫున 1944లో దుర్గాబాయి దేశ్‌ముఖ్ సంపాదకత్వంలో మద్రాస్ నుంచి 'ఆంధ్ర మహిళ' అనే పత్రిక వెలువడేది. దుర్గాబాయి తర్వాత ఈ పత్రికకు చిన్న ఘంటమ్మ, కొత్త లక్ష్మీరఘురామ్, కె. రామలక్ష్మి, మాలతీ చందూర్ సంపాదకీయ బాధ్యతలు చేపట్టారు. 1960 వరకు ఈ పత్రిక ప్రచురితమైంది.

స్వాతంత్ర్యానికి ముందుకాలం నాటి పత్రికల్లో స్త్రీవిద్య, ఆరోగ్యం, ఆచారాలు, వ్యవహారాలపైనే విస్తృత చర్చ జరిగినప్పటికీ స్త్రీ, పురుషులు సమానమనే భావన నిర్దిష్టమైన రూపం తీసుకోలేదు. స్త్రీ ఇల్లాలు, తల్లి, బిడ్డ, అక్కా, చెల్లి అని, ఆమెపై కరుణ చూపాలనే మానవీయ కోణంలోనే ఆ పత్రికల్లో ఎక్కువగా వ్యాసాలు ప్రచురితమయ్యేవి. స్త్రీ విద్యావంతురాలైతే కుటుంబాన్ని చక్కగా తీర్చిదిద్దుతుందనే భావన కూడా ఆ వ్యాసాల్లో కనిపిస్తుంది. బాల్య వివాహాలు, సతీసహగమనం, బాలవితంతువు, చిన్న వయస్సులోనే కాన్పులు తదితర అంశాలపై కూడా ఆ పత్రికల్లో చర్చ జగడం ఆ కాలానికి సంబంధించిన వరకు విప్లవాత్మకమే.

## స్వాతంత్ర్యానంతరం

కొమర్రాజు అచ్చమాంబ సంపాదకురాలిగా 1948లో 'ఆంధ్ర వనిత' పత్రికను కమ్యూనిస్టు పార్టీకి అనుబంధంగా ఉన్న మహిళా సంఘం ప్రారంభించింది. మూడు సంచికలు వెలువడిన తర్వాత ఈ పత్రికను ప్రభుత్వం నిషేధించింది. 1954లో 'కవిత' పత్రికకు, 1956లో ఆంధ్రా యువతీ మండలి ప్రచురించిన 'వనిత' పత్రికకు అబ్బూరి ఛాయాదేవి సంపాదకురాలిగా పనిచేశారు. 1977లో ప్రజాసాహితి (మాసపత్రిక)కి కొంతకాలం రంగనాయకమ్మ సంపాదకురాలిగా పనిచేశారు. ఆంధ్రజ్యోతి దినపత్రిక యాజమాన్యం 1978లో 'వనితాజ్యోతి' అనే మాసపత్రికను ప్రారంభించింది. ఇందులో కుట్లు, అల్లికలు, వంటావార్పు తదితరాలు ప్రచురితమయ్యేవి. ఈ పత్రికకు ఘంటశాల నిర్మల సంపాదకురాలిగా పనిచేశారు. వనితాజ్యోతి కంటే ముందు వనిత, మహిళతోపాటు మరికొన్ని పత్రికలు వెలువడేవి.

అచ్చమాంబ వారసత్వంలో ఆంధ్రప్రదేశ్ చైతన్య మహిళా సమాఖ్య ఆధ్వర్యంలో విష్ణుప్రియ, పవనల సంపాదకత్వంలో 'మహిళా మార్గం' (మాసపత్రిక), ప్రగతిశీల మహిళా సంఘం ఆధ్వర్యంలో కె. రమ సంపాదకత్వంలో 'మాతృక' (త్రైమాసిక పత్రిక), ఐద్వా ఆధ్వర్యంలో పుణ్యవతి సంపాదకత్వంలో 'మానవి' (మాసపత్రిక), కె. సత్యవతి సంపాదకత్వంలో 'భూమిక' లాంటి ప్రత్యామ్నాయ పత్రికలు వెలువడుతున్నాయి. రత్నమాల సంపాదకత్వం లో 'నూతన', కొండవీటి సత్యవతి, జయప్రభల సంపాదకత్వంలో వచ్చిన 'లోహిత', లక్ష్మి సంపాదకత్వంలో 'ఆహ్వానం', కాత్యాయని సంపాదకత్వంలో ప్రచురితమైన 'చూపు' (మాసపత్రిక) ప్రచురితమయ్యాయి. ఈ పత్రికలన్నీ స్త్రీల హక్కులను, ఉద్యమాలను కొత్త కోణంలో చూశాయి. ప్రధాన స్రవంతి పత్రికలతో పోల్చి చూస్తే వీటిలో స్త్రీల సమస్యలను చూసే విధానంలో వైవిధ్యం కనిపిస్తుంది. ఈ పత్రికలు మహిళా ఉద్యమాలకు తాత్విక భూమికను అందించాయి. కొత్త ఒరవడిని సృష్టిస్తూ ఎన్నో అవరోధాలను తట్టుకుని నిలబడ్డాయి. అయితే దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత సంపాదకురాళ్ల సంఖ్య పెరగాల్సినంతగా పెరగలేదు. అయితే పత్రికల్లో స్త్రీల కోసం కేటాయించిన ప్రత్యేక శీర్షికల నిర్వహణ కోసం మహిళా సబ్ ఎడిటర్లను, రిపోర్టర్లను యాజమాన్యాలు తీసుకున్నాయి. వర్ధమాన రాజకీయాలపై కూడా మహిళా జర్నలిస్టులు అవగాహన పెంపొందించుకుని ప్రధాన స్రవంతి జర్నలిజంపై తమదైన ముద్రవేశారు. ప్రధానస్రవంతి తెలుగు జర్నలిజంలో వేమన వసంతలక్ష్మి, ఓల్గా, సి. వనజ, నాగసుందరి, మంజరి, బైస, రమాదేవి, కాలమిస్టులు కాకాని కమల, తమ ప్రత్యేకతను చాటుతున్నారు. అఖిలేశ్వరి ఆంగ్ల జర్నలిజంలో విశేష కృషి చేస్తున్నారు.

*(రచయిత పరిశోధక విద్యార్థి)*

పాలకుల ప్రజా వ్యతిరేక విధానాల అమలులో, కొనసాగింపులో భాగమే మైక్రో ఫైనాన్స్ వ్యవస్థ అని అంటున్నారు
**సిలువేరు హరినాథ్**

# మైక్రో ఫైనాన్స్ సంస్థల పక్షమా? ప్రజల పక్షమా?

రాష్ట్రంలో తీవ్రమైన అలజడికి సూక్ష్మరుణ వ్యాపార సంస్థలు కారణమైన సందర్భంలో ఆర్థిక వ్యవస్థ తీరుతెన్నులు, మహిళల సాధికారికత, గ్రామీణ అభివృద్ధి వంటి అంశాలు ప్రధానంగా చర్చకు వచ్చాయి. మహిళల వికాసానికి అప్పులు అనివార్యమైన మార్గమని భావించినవారు వేధింపులకు పాల్పడుతున్న సంస్థల దుడుకుతనాన్ని, దురుసుతనాన్ని అదుపులో ఉంచాలని ప్రభుత్వానికి సూచనలు చేశారు. రోగి కోరిందే వైద్యుడు సెలవిచ్చాడనే చందంగా రాష్ట్రప్రభుత్వం హడావుడిగా ఒక ఆర్డినెన్స్‌ను తీసుకొచ్చింది. దానిలో ఉన్న అంశాల గురించి మేధావులంతా పెదవి విరిస్తే సూక్ష్మ రుణ వ్యాపార సంస్థలు మాత్రం న్యాయస్థానాన్ని ఆశ్రయించాయి. న్యాయవ్యవస్థ కూడా ఆయా సంస్థలకు వ్యాపారం చేసుకొనే స్వేచ్ఛ ఉందని స్వేచ్ఛామార్కెట్ సూత్రాన్ని సమర్థించింది. ప్రతిపక్ష పార్టీలు కాంగ్రెస్ పార్టీనీ, రాహుల్‌గాంధీ వ్యాపార స్నేహాలను ప్రజల్లో చర్చకుపెట్టి అధికారపార్టీని ఇరకాటంలో పెట్టాలని చూశాయి. ప్రతిపక్షాలు, అధికారపక్షమూ రెండూ పేదల నడ్డివిరిచే మైక్రోఫైనాన్స్ విధానానికి మాత్రం వ్యతిరేకం కాదని వాటి వ్యవహారశైలి గమనిస్తే బోధపడుతుంది. అందువల్ల సూక్ష్మరుణ వ్యాపారం అనివార్యమైన ఒక చారిత్రక అవసరంగా భావిస్తున్నారు. మైక్రోఫైనాన్స్ సంస్థలు కూడా ఇదే అభిప్రాయాన్ని శక్తివంచన లేకుండా ప్రచారం చేస్తున్నాయి. కాని, మైక్రో ఫైనాన్స్ వ్యవస్థ లేని స్థితిని ఊహించలేమా?

మైక్రో వేధింపులకు రాష్ట్రవ్యాప్తంగా వందకు పైగా స్త్రీ, పురుషులు ఆత్మహత్యలు చేసుకున్నారు. అనేకమంది బలవన్మరణాలకు ప్రయత్నించారు. ఈ వేధింపులకు ఆయా సంస్థలను మాత్రమే బాధ్యులను చేసే ఎత్తుగడ మీడియా అనుసరించింది. మీడియాలో జరిగిన చర్చ, ప్రచురించిన కథనాలు, ప్రసారం చేసిన ప్రత్యేక కథనాలు మైక్రోసంస్థలను బోనులో నిలిపేవిగా ఉన్నాయి. కాని మైక్రోఫైనాన్స్ విధానం తీసుకొచ్చిన ప్రభుత్వం మీద ఎలాంటి విమర్శలు మీడియా చేయలేదు. మైక్రో సంస్థలు మాత్రం తప్పంతా అప్పు తీసుకున్న వారిదే అన్నట్టు ప్రకటనలను జారీ చేశాయి. కొన్ని మీడియా సంస్థలు అత్యుత్సాహం ప్రదర్శించి బేరసారాలు సాగిస్తే వడ్డీరేటు తగ్గించేందుకు ఆయా సంస్థలు 'దయార్ద్రహృదయం'తో అంగీకరించాయి. మైక్రో సంస్థలను నియంత్రించాలే కాని నిర్వీర్యం చేయరాదు అని కొంతమంది సూచనలు చేశారు.

ఆర్థిక వ్యవస్థ పరిణామ క్రమంలో ఒక విలోమ ప్రతిక్రియ జరిగింది. నూతన ఆర్థిక విధానాలుగా ప్రసిద్ధి చెందిన ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ, సరళీకరణలు వ్యవస్థ తీరును సమూలంగా మార్చేశాయి. స్వేచ్ఛా మార్కెట్ పడగ చాపిన మేరా ఆత్మహత్యలు, ఆకలి చావులే సంభవించాయి. బ్యాంకింగ్ వ్యవస్థను జాతీయం చేసిన కాంగ్రెస్ పార్టీ ప్రైవేట్ మనీ లెండింగ్‌కు అనుమతిచ్చింది. రుణాలవల్ల మహిళల సాధికారికత సాధ్యమనే ఒక అబద్ధాన్ని అద్భుతమైన ఆయుధంగా ప్రచారం చేసిన వై.ఎస్. రాజశేఖరరెడ్డి అతిపెద్ద వినాశకర విధానానికి ఆద్యుడయ్యాడు. స్వయం సహాయక సముదాయాల నిర్మాణం ద్వారా మహిళలను అభివృద్ధి చేయాలనే ప్రణాళిక కాంగ్రెస్ పార్టీకి ఓట్లు కురిపించింది గానీ మహిళల జీవితంలో వెలుగులు నింపలేకపోయింది. పావలా వడ్డీ రుణాలు అందించేందుకు వందలకోట్లు కేటాయించిన ప్రభుత్వం అప్పులే పరమావధి అనే తీరుతో వ్యవహరించింది. కేంద్రప్రభుత్వం విధానపరమైన అనుమతి కల్పించడం వల్ల అనేక రాష్ట్రాలలో మైక్రో ఫైనాన్స్ సంస్థలు వ్యాపారం చేస్తున్నాయి. మైక్రో ఫైనాన్స్ సంస్థలకు అనుమతిచ్చిన కేంద్రం వాటి పర్యవేక్షణ, నియంత్రణకు అవసరమైన యంత్రాంగం ఏర్పాటును విస్మరించింది. ఆర్థిక లావాదేవీలు పరిశీలించే రిజర్వుబ్యాంక్ సైతం మైక్రో ఫైనాన్స్ సంస్థలను కట్టడి చేసే విధానమేదీ ప్రకటించలేదు. వడ్డీ వసూలు విషయంలో ఆయా సంస్థలకు పూర్తి స్వేచ్ఛను రిజర్వుబ్యాంకు కట్టబెట్టిందంటే దాని నిజాయితీ, పనివిధానం ఎలాంటిదో అర్థం చేసుకోవచ్చు. అయితే, అనేక రాష్ట్రాలలో ఈ వ్యాపారానికి అనుమతి లేదు. కేంద్రం అనుమతిచ్చినప్పటికీ కొన్నిరాష్ట్రాలు ప్రజల ప్రయోజనార్థం ఈ సంస్థలకు అనుమతివ్వలేదు.

ఒక్క వరంగల్ జిల్లాలోనే 500కోట్ల రూపాయల సూక్ష్మరుణ వ్యాపారం జరుగుతోందని ఒక అంచనా. స్టాక్ ఎక్స్ఛేంజ్ మార్కెట్‌లో విపరీతమైన డిమాండ్ ఉన్న సంస్థల జాబితాలో సూక్ష్మరుణ వ్యాపార సంస్థలు కూడా ఉన్నాయనేది వాస్తవం. రుణం తీసుకున్న పేద, మధ్యతరగతి మహిళల నుండి 26నుండి 50 శాతంవరకు వడ్డీ వసూలు చేస్తున్న సంస్థలు ఉన్నాయి. అవి 24 శాతం మాత్రమే వడ్డీ వసూలు చేస్తామని అంగీకరిస్తే వేధింపులు ఆగినట్టేనా? వేధింపులు ఆగితే ఆత్మహత్యలు ఆగుతాయా? అనే ప్రశ్న ఎవరికీ తోచడంలేదు. దేశంలోని 40 శాతం మంది ప్రజలు రోజుకు 20రూపాయల ఆదాయంతో బతుకీడుస్తున్నారని ప్రభుత్వ నివేదికలు తెలుపుతున్నాయి. ఇంతమంది ఆర్థిక బలహీనులై ఉంటే వారికి అప్పులిచ్చి బలం చేకూరుస్తామని నమ్మబలకడమే దుర్మార్గం. మద్యం, వైద్యం, విద్య అనే మూడు పద్ధతులు

*ప్రజల నిరుద్యోగం, ఆకలి, అనారోగ్యం, నిర్వాసిత్వం, ఆత్మహత్యలు కొలమానాలుగా దేశంలో జరిగిందంటున్న 'అభివృద్ధి' ఏపాటిదో వివరిస్తున్నారు* **డా. గోలక్ బీహారీనాథ్**

# భారత ఆర్థికాభివృద్ధి - సామాజిక న్యాయం

గడచిన దశాబ్ది నుండి భారతదేశం వేగంగా అభివృద్ధి చెందుతున్నదని, జి.డి.పి. వృద్ధి అభివృద్ధికి కొలమానంగా పేర్కొంటున్నారు. 1951 నుండి పంచవర్ష ప్రణాళికలు ప్రారంభించి ఇప్పటి వరకు పది పంచవర్ష ప్రణాళికలు పూర్తయి ప్రస్తుతం పదకొండవ పంచవర్ష ప్రణాళిక నడుస్తోంది. పంచవర్ష ప్రణాళికల లక్ష్యం ఆర్థిక అభివృద్ధిని వేగవంతం చేయడం, జాతీయ ఆదాయం, తలసరి ఆదాయం పెంచడం, ఆదాయం, సంపద పంపకాలలో వైషమ్యాలు లేకుండా చేయడం, ఎక్కువ మందికి ఉపాధి కల్పించడం, ప్రాంతీయ వైషమ్యాలను తగ్గించడం. పంచవర్ష ప్రణాళికల మొదటి మూడు దశాబ్దాలలో 1951 నుండి 1978 వరకు వృద్ధి 37 శాతం ఉంది. 1978 తర్వాత కూడా జాతీయ ఉత్పాదక వార్షిక వృద్ధి శాతం పెరుగుతోంది. ప్రత్యేకంగా 1991 నుండి ఆర్థిక సంస్కరణలు అమలు చేయడం తర్వాత క్రమంగా వృద్ధిరేటు పెరుగుతోంది. 2003-04 నుండి అభివృద్ధి రేటు 8 శాతం పైనే ఉంది. ప్రపంచ బ్యాంక్ 2010లో ప్రకటించిన వార్షిక వృద్ధి రేటు 9.7 శాతం.

భారత పాలకవర్గాలు జాతీయ ఆదాయ క్రమాగత అభివృద్ధి రేటు చూపించి భారత్ అభివృద్ధి వైపు ప్రయాణిస్తోందని ప్రచారం చేస్తున్నారు. ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, ఉదారవాద ఆర్థిక విధానాల వలన అభివృద్ధి రేటు పెరిగిందని, అందువలన ప్రభుత్వ ఆంక్షలను పూర్తిగా ఎత్తివేయాలని, మార్కెట్ అనుకూల ఆర్థిక విధానాలు అమలు చేయాలని చర్చిస్తున్నారు. వీటి వలన పేదలు నిరుపేదలుగా మారుతారు. ఆదాయం, ఉద్యోగ కల్పన, కొనుగోలు శక్తి కోల్పోతారు. వాళ్ల గురించి ప్రభుత్వం ఉపాధి కల్పన పథకం, పౌష్టికాహారం, విద్యా, వైద్యం కోసం కొంత ఆర్థిక కేటాయింపులు, శారీరక వికలాంగులకు, వృద్ధులకు, విధవలకు భత్యాలు ఇవ్వడం వలన మౌలిక సమస్యల పరిష్కారం అవుతుందా?

దేశంలో మొత్తం దేశీయ ఉత్పత్తి (జి.డి.పి.) వృద్ధి పెరిగి తలసరి ఆదాయం పెరుగుతోందని పాలకవర్గాలు ప్రచారం చేస్తున్నాయి. ఒక సంవత్సరం జాతీయ ఆదాయాలను ఆ సంవత్సరం జన సంఖ్యతో భాగిస్తే తలసరి ఆదాయం వస్తది. ప్రపంచంలో వివిధ దేశాలలో ఆదాయంతో పాటు అభివృద్ధి స్థాయిని ప్రపంచ ఆభివృద్ధి నివేదిక (వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్ట్) రిపోర్టు అనుసరించి వివిధ దేశాల ఆదాయాలను అమెరికన్ డాలర్లలో తెలియ చేస్తున్నది. 1960లో భారత దేశంలో తలసరి ఆదాయం 60 డాలర్లు, 1975లో 136 అమెరికన్ డాలర్లు, 1999లో 300 డాలర్లు, 2000లో 460 డాలర్లకు వృద్ధి అయింది.

**ఆర్థిక ప్రగతిలో పరిగణనలోకి తీసుకోవాల్సిన విషయాలు**

గడిచిన సంవత్సరాలలో సంచయం, పెట్టుబడులు వృద్ధి అయినాయి. 1951-52లో ఆంతరంగిక జమ రేటు మొత్తం జాతీయ ఆదాయంలో 6.87 శాతం ఉంది. 2001-02లో సంచయ రేటు మొత్తం జాతీయ ఆదాయంలో 24 శాతం అయింది. 2005-06 సంవత్సరానికి మొత్తం జాతీయ ఆదాయంలో 35 శాతం అయింది. అదే విధంగా

పేద, మధ్యతరగతి ప్రజానీకాన్ని, మరీ ముఖ్యంగా ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనార్టీ ప్రజలను ఆర్థిక సంక్షోభానికి గురిచేస్తున్నాయి. ఈ సంక్షోభానికి ప్రభుత్వమే బాధ్యత వహించాలి. అప్పులు తీసుకున్న వారిలో అత్యధికులు ఆరోగ్యం, విద్య అవసరాలకు వెచ్చించినవారే. అవి చాలా ఖరీదైన అంశాలుగా ప్రభుత్వమే మార్చేసింది. మగవాళ్లని తాగుడకు అలవాటుచేసి వారి రోజు కూలీని మద్యం వ్యాపారులజేబులోకి వెళ్లే మార్గం వేసింది కూడా ప్రభుత్వమే. వీటన్నింటికితోడు మహిళలు ఉత్పాదకరంగాలలో అత్యల్పంగా ఉన్నారు. నిరుద్యోగులైన గృహస్తురాళ్లు ఇంటి అవసరాల నిమిత్తం అప్పులను ఆశ్రయిస్తున్నారు. ఉత్పాదక రంగాలను, ఉద్యోగ రంగాలను నిర్వీర్యం చేసిన ప్రభుత్వం వ్యాపారుల దోపిడీకి మాత్రం అన్ని ప్రోత్సాహకాలు అందజేస్తుంది. అందువల్ల వడ్డీ తగ్గించినా మహిళల బలవన్మరణాలు ఆగవు. అప్పులు దొరకనినాడు ఆత్మహత్యలు చేసుకోని మహిళలు అప్పు తీర్చలేక ప్రాణాలు విడుస్తున్నారు.

అందువల్ల మైక్రోఫైనాన్స్ వ్యవస్థ ప్రజల రక్తమాంసాలను పీల్చి పిప్పి చేస్తుంది. దానిని సంస్కరించే ప్రయత్నాలన్నీ అంతిమంగా విఫలమవుతాయి. మైక్రో ఫైనాన్స్ వ్యవస్థను విధానపరంగా నిషేధిస్తేనే ఆత్మహత్యలు అపగలం. పేదల శ్రమ వ్యాపారసంస్థల పాలు కాకుండా అరికట్టగలం. మీడియా ప్రభుత్వం విధానం విడిచిపెట్టి మైక్రో ఫైనాన్స్ సంస్థల పనితీరుని విమర్శించే పద్ధతి సరికాదు. మీడియా, ప్రభుత్వం ప్రజలపక్షమో మైక్రోఫైనాన్స్ సంస్థల పక్షమో, తేలాలంటే వాటిని నిషేధించాలనే డిమాండ్‌ను సమర్థించాలి. కాని, కాకులను కొట్టి గద్దల కేసే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మైక్రోఫైనాన్స్ సంస్థలను నిషేధిస్తాయా?

*(రచయిత హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ రీసెర్చ్ స్కాలర్)* వీ

పెట్టుబడులు 1951-52లో 7.4 శాతం, 2001-02లో మొత్తం జాతీయ ఆదాయంలో 24 శాతం అయింది. 2005-06లో పెట్టుబడులు 33.8 శాతం పెరిగాయి. సంచయం, పెట్టుబడులు చెప్పుకోదగినంత పెరిగాయి. జాతీయ ఆదాయం పెట్టుబడి నిష్పత్తి క్రమాగతి అభివృద్ధి రాబోవు సంవత్సరాలలో మరింత అభివృద్ధి రేటు చూపించగలదు. పై గణాంకాలు చూపించి భవిష్యత్‌లో భారత్ సూపర్ దేశం కాగలదని కల్పనలు సృష్టిస్తున్నారు. మరి కొంతమంది చైనా అభివృద్ధి రేటును మించి పోగలదని ఉల్లేఖిస్తున్నారు. 2003-04 నుండి చైనా జి.డి.పి. (జాతీయ ఆదాయం) రేటు 10 శాతం పైనే వృద్ధి ఉంది.

### జాతీయ ఉత్పాదన, తలసరి ఆదాయం - గుణాత్మక అభివృద్ధి

పై విషయాలు అభివృద్ధిని వేగవంతం చేయడానికి, జి.డి.పి. వృద్ధి, తలసరి ఆదాయం వృద్ధి, సంచయం పెట్టుబడులు వృద్ధి భారత ఆర్థికాభివృద్ధికి తోడ్పడగలదు. కాని సాధారణ ప్రజల ఆర్థిక సామాజిక వ్యవస్థలలో చెప్పుకోదగిన మార్పు జరగలేదు. తలసరి ఆదాయం అభివృద్ధిలో ఆదివాసులు, గిరిజనులు, దినకూలీలు, చిన్నా నామ మాత్రపు రైతులు, మహిళలు, మైనారిటీ మతస్తులు, సాధారణ ప్రజలను పరిగణనలోకి తీసుకోలేదు. ఆంతరంగిక అభివృద్ధిలో సామాన్య ప్రజలను పట్టించుకోలేదు. భారత్ వంటి అర్ధభూస్వామ్య, అర్ధవలస దేశంలో సాధారణ ప్రజల వికాసం ఆలోచించడం స్వర్గంలో మెట్లు లెక్కించడం వంటిది. ఆర్థిక వికాస లక్ష్యాలలో తలసరి ఆదాయం వేగంగా పెరుగుతోంది. కాని మిగతా లక్ష్యాలు పూర్తి కావడం లేదు. ఫలవంతమైన జీవన ప్రమాణాలు, గుణాత్మక అభివృద్ధి లేవు. ఆదాయం, సంపద పంపకాలలో వైషమ్యాలు తొలగించలేదు. జి.డి.పి. వృద్ధి అయినా, నిరుద్యోగ సమస్య తగ్గలేదు. ప్రత్యేకంగా మహిళలు, ఆదివాసులు, గిరిజనులు, దళితులు, మైనారిటీలు స్వయం సమృద్ధి కాలేదు. అభివృద్ధి రేటు కొలమానంకు పై విషయాలను కూడా పరిగణనలోకి తీసుకోవాలి.

ఒక సంవత్సరంలో దేశంలో మొత్తం పౌరుల ద్వారా ఉత్పాదిత మొత్తం సామాగ్రికి, సేవలకు ద్రవ్య రూపంలో తెలియజేయడమే జాతీయ ఉత్పత్తి (జి.డి.పి.). జాతీయ ఆదాయం పరిగణనలోకి తీసుకొనేటప్పుడు అనేక విషయాల మీద దృష్టి పెట్టాలి. భారత్ వంటి దేశంలో అనేక ఉత్పత్తులు దేశంలో ఉపయోగించుకోవడం లేదు. దేశీయ మార్కెట్‌లోకి అవి రావడం లేదు. జాతీయ ఆదాయ గణనలోకి రావడంలేదు. ఇవి కాకుండా ఆదివాసీ, అటవీ ప్రాంతంలో రవాణా వ్యవస్థ సరిగా లేదు. అక్షరాస్యత రేటు తక్కువ. వ్యవసాయ రంగంలో వ్యవసాయ ఉత్పత్తుల అమ్మకం, కొనుగోలు లేకుండా ప్రత్యక్ష వినిమయం జరుగుతున్నది. ఇప్పటికి కొన్ని ప్రదేశాలలో ధాన్యం, మినుములు, శనగలు, ఉలవలు, ఇప్పపూవులు ఇచ్చి ఉప్పు, నూనె కొంటున్నారు. భూస్వామ్య ఆర్థిక వ్యవస్థలో కుటుంబ సభ్యుల ద్వారా జరిగిన ఉత్పత్తి సంపాదన ద్రవ్య రూపంలో కొలమానం లేదు. అందువలన అవి జాతీయ ఆదాయ గణనలోకి రావడం లేదు.

మానవ జీవన ప్రమాణాలు గుణాత్మక అభివృద్ధి లేకుండా అభివృద్ధి కొలమానం నిర్ధారించలేం. ఆర్థిక వికాసం అంటే మానవ కల్యాణం కూడా పరిగణనలోకి తీసుకోవాలి. ఆర్థిక విధానాలలో సామాన్య ప్రజల సంక్షేమమే వికాస వృద్ధి రేటు. పాకిస్తాన్ దేశ ప్రముఖ ఆర్థికవేత్త మొహమూద్ అల్ మానవ కల్యాణం గురించి మూడు విషయాలు చర్చించాడు. అవి, మనిషి ఆయుషు, అక్షరాస్యత రేటు, జీవించే పద్ధతులు.

ఆర్థిక విధానాలలో నోబల్ పురస్కార గ్రహీతలు, ప్రముఖ ఆర్థికవేత్తలు జోసెఫ్ స్టిగ్‌లిజ్, అమర్త్యసేన్ చెప్పినట్లు జి.డి.పి.లో మనిషి బతికే జీవనశైలిని పరిగణనలోకి తీసుకొని ఆర్థిక వ్యయం, సమృద్ధి కోసం ఆదాయం, సంపత్తి సరి అయిన పద్ధతిలో పంపకం జరిగినప్పుడే, సోషలిజం ప్రతిష్ఠించినప్పుడే అభివృద్ధి లక్ష్యం నెరవేరుతుంది. ఒకదేశ జాతీయ ఉత్పత్తి అధికంగా ఉన్నా, తలసరి ఆదాయం మిగతా దేశాలతో పోల్చితే అధికంగా ఉన్నా విద్యా, వైద్యం, సామాజిక రక్షణ విషయాలలో వెనుకబడిన దేశం అభివృద్ధి అయినట్లు చెప్పలేం. దేశంలో ఉత్పత్తి అవుతున్న భౌతిక ఉత్పత్తులు మొత్తం ప్రజలు పొందుతున్నారా లేదా అన్న విషయం కూడా పరిగణనలోకి తీసుకోవాలి.

ఐక్యరాజ్య సమితి ప్రస్తావించిన అభివృద్ధి సూచిక (యునైటెడ్ నేషన్స్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం - యు.ఎన్.డి.పి.) 1990 నుండి వివిధ దేశాల మానవ అభివృద్ధి సూచిక (హ్యూమన్ డెవలప్‌మెంట్ ఇండెక్స్ - ఎచ్.డి.ఐ.) కొలమానంగా ప్రకటించింది. ఆయుష్షు, విద్యా దేశీయ ఉత్పత్తి మొదలగు సామాజిక విషయాలు తీసుకొని అభివృద్ధి స్థాయి నిర్ధారించింది. 1998లో యు.ఎన్.డి.పి. 174 దేశాల మానవ అభివృద్ధి సూచిని ప్రకటించింది. ఆ దేశాలలో భారత్ స్థానం 138. 2006లో యు.ఎన్.డి.పి. ప్రకటించిన రిపోర్ట్‌లో భారత్ స్థానం 126. 2009లో ప్రకటించిన రిపోర్ట్‌లో 134వ స్థానం. గడచిన రెండు దశాబ్దాలలో భారత్ ఆర్థిక ప్రగతి వలన మానవ అభివృద్ధిలో గుణాత్మకమైన మార్పు రాలేదు. అభివృద్ధి ధార పేదలను విడిచి ప్రయాణిస్తోంది.

### జీవిత సంతోషమే ప్రగతికి కొలమానం

ప్రస్తుతం ఏయే దేశాలలో ప్రజలు జీవితకాలంలో ఎంత సంతోషం పొందుతున్నారు, సుఖ దుఃఖాల అనుభూతిని పరిగణనలోకి తీసుకొని ప్రగతికి కొలమానంగా నిర్ధారిస్తున్నారు. లండన్‌లోని లెగాతమ ఇన్‌స్టిట్యూట్ ఫర్ గ్లోబల్ డెవలప్‌మెంట్ సంస్థ యాభై దేశాలలో పరిశోధన చేసింది. వాటిలో భారత్ స్థానం 46. భౌతిక సంపద (మెటీరియల్ వెల్త్) జీవిత సంతోషం అంటే వస్తువుల వాడకంలో స్వతంత్రం, సుందరమైన ఆరోగ్యం, సమానత, మత స్వేచ్ఛ, ఆదాయం, తక్కువ నిరుద్యోగ రేటు, తక్కువ విడాకులు మొదలైన వాటితో కొలమానంగా పరిగణించింది. ప్రగతి కేవలం భౌతిక సంపద ద్వారా నిర్ణయించలేం. సంతోషం నిర్ణయించడంలో భౌతిక సంపద కూడా తప్పక తీసుకోవాలి. వీటి దృష్ట్యా భారత్ ఆధ్యాత్మిక దేశం అయిన ప్రజల ఉద్యోగ కల్పన, తక్కువ ఆదాయం, అనారోగ్య పరిస్థితులు, పెరుగుతున్న విడాకులు, మత కలహాలు, పంపకంలో అసమానతలు మొదలైనవి ప్రజలలో తీవ్ర అసంతృప్తిని తెలియజేస్తున్నాయి. ఫలితంగా జీవితాన్ని అనుభవించడం లో, సుఖ దుఃఖాలు తెలియజేయడంలో విఫలమవు తున్నారు. ప్రగతికి అర్థం జీవితాన్ని సంతోషంగా అనుభవించడం. దానిలో మనం చాలా వెనుకబడి ఉన్నాం.

పర్యావరణం, కాలుష్యం మీద వివిధ దేశాలలో తీవ్రమైన చర్చలు జరుగుతున్నాయి. ఇంగ్లండ్‌లోని రోమ్ క్లబ్ (క్లబ్ ఆఫ్ రోమ్) 1972లో ప్రపంచ ప్రజలకు ఆధునిక విజ్ఞానంతో కూడుకొన్న ప్రగతి పర్యావరణాన్ని కాలుష్యంతో కూడుకొన్నదని ప్రకటించింది. పర్యావరణ సంతులనంతో కూడుకొని ఉన్న ఉత్పాదక వృద్ధియే అభివృద్ధి. ప్రపంచంలో వేగంగా పారిశ్రామికీకరణ, భారీ నీటి పారుదల ప్రాజెక్టులు, విపరీతంగా ఖనిజాల వెలికితీత, థర్మల్ విద్యుత్ కేంద్రాల వలన పర్యావరణ అసంతుల్యత పెరిగింది. అత్యధికంగా ఖనిజ పదార్థాల దహనం చేయడం వలన జలవనరులు కుచించుకుపోవడం, అడవులు తరిగిపోవడంతో నీరు, వాయువులు కాలుష్యానికి గురి అవుతున్నాయి. ఆనకట్టల నిర్మాణం వలన అడవులు నశించిపోవడం, లవణాత్మక భూమిగా మారిపోవడం, నిర్వాసిత సమస్యలు మొదలైనవి ముందుకు వచ్చాయి. తాపక విద్యుత్ కేంద్రాల వలన జలాలు, వాయువులు కాలుష్యంతో పాటు వాతావరణాన్ని వేడిగా ఉంచడంలో ముఖ్యపాత్ర పోషిస్తున్నాయి. పర్యావరణాన్ని నష్టం కలిగించే గనుల తవ్వకం, భారీ పారిశ్రామిక సంస్థలు జీవిత శైలిలు మొదలగు వాటికి ప్రత్యామ్నాయం చూపించడం వాస్తవ అభివృద్ధి.

పై విషయాల నేపథ్యంలో భారత అభివృద్ధి దార నిర్ధారించాలి. అభివృద్ధి అంటే ఏమిటి? ఎవరి కోసం అభివృద్ధి? సాధారణ ప్రజలు అభివృద్ధిని ఎంతవరకు పొందుతున్నారు? భారత్‌లో సామాన్య ప్రజలు గుణాత్మక అభివృద్ధి చెందడంలో ఎందుకు విఫలమవుతున్నారు? ఈ మొత్తం ప్రశ్నలకు జవాబు వెతకడానికి ముందు రాజ్యచరిత్ర, సామ్రాజ్యవాద యుగంలో భారత దళారీ పెట్టుబడిదారుల చరిత్ర, పెట్టుబడిదారీ ఉత్పత్తి ప్రణాళిక, శ్రామిక వర్గ పాత్ర మొదలైన విషయాలు అధ్యయనం చేయాలి.

## విదేశాలకు ఖనిజాల ఎగుమతి అభివృద్ధి కాదు

ప్రపంచంలో సమృద్ధిగా ఖనిజ పదార్థాలు ఉన్న దేశాలలో ఏ ఒక్క దేశం అభివృద్ధి చెందలేదు. లాటిన్ అమెరికా, ఆఫ్రికాలో అనేక దేశాలు ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

విద్యుత్ రూపంలో సంస్కరణలు అమలు చేసిన మొదటి రాష్ట్రం విద్యుత్ ప్లాంట్‌లు ప్రైవేట్ రంగంలో నెలకొల్పడానికి వివిధ కంపెనీలతో ఒప్పందాలు చేసుకొన్నాయి. వీటిలో చెప్పుకోదగ్గవి స్టెర్‌లైట్ ఎనర్జీ, టాటా పవర్, సహారా ఇండియా పవర్, బీసా పవర్ మొదలైన సంస్థలు ఒక లక్ష కోట్ల రూపాయలు పెట్టుబడులు పెడతాయి.

1948–56లో కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన పారిశ్రామిక విధానం లో బొగ్గు, గ్యాస్, పెట్రోలియం, ఇనుపరాయి, సిసా, జింక్ మొదలైన ఖనిజాలు ప్రభుత్వ యాజమాన్యంలో ఉంటాయి. జనవరి 30, 1973న బొగ్గు ఖనిజాన్ని జాతీయీకరణ చేసారు. ఫిబ్రవరి 12, 1993న చారీ కమిటీ సిఫార్సులను అనుసరించి బొగ్గు గనులను పూర్తిగా ప్రైవేటీకరణ చేసింది. ఉదారీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ తర్వాత గనుల తవ్వకాలలో బహుళజాతి సంస్థలు ప్రవేశించాయి. కేంద్ర ప్రభుత్వం నియమించిన అబుదుత్ కమిటీ రిపోర్ట్ అనుసరించి గనుల రంగాన్ని ప్రైవేటీకరణ చేయాలి, యాభై హెక్టార్ల వైశాల్యం ఉన్న గనులకు పల్లీ సభ అనుమతి అవసరం లేదు, గనుల లీజు పది కిలోమీటర్ల నుండి యాభై, వంద కిలోమీటర్ల పరిధిలోకి పెంచాలి, గనుల లీజును పునరుద్ధరించాలి, గనుల ఆధారిత పరిశ్రమలు నెలకొల్పాలి అనే ఆదేశాన్ని ఎత్తివేయాలి. రాష్ట్ర ప్రభుత్వాలు నిర్దిష్ట సమయంలో గనులు లీజుకు ఇవ్వకపోతే కేంద్ర ప్రభుత్వాలు నేరుగా లైసెన్స్ మంజూరు చేయవచ్చు. అబుదుత్ హుడా కమిటీ రిపోర్ట్ వలన దేశీయ దలాల్ కంపెనీలు, విదేశీ కంపెనీలు (ఎం.ఎన్.సి., టి.ఎన్.సి.) ఒడిశా, ఛత్తీస్‌ఘడ్, జార్ఖండ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్ వంటి రాష్ట్రాలలో గనులు పెద్ద ఎత్తున తవ్వి ప్రకృతి సంపదను దోపిడీ చేయడానికి అధికారం పొందాయి. డిసెంబర్ 2007లో రాష్ట్ర ముఖ్యమంత్రులు గనుల రంగం లో కేంద్రం జోక్యాన్ని తీవ్రంగా నిరసిస్తూ డిమాండ్ పత్రాన్ని ఇచ్చాయి. డిమాండ్లలో ప్రైవేటీకరణను వ్యతిరేకించలేదు. వాటి లక్ష్యం, గనుల రంగం లూటీలో కేంద్ర ప్రభుత్వ భాగస్వామ్యాన్ని వ్యతిరేకిస్తున్నాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు గనులను ప్రైవేటీకరణ చేసి ఎక్కువ మొత్తంలో నల్లడబ్బు పోగేయడం ఒక పంథాగా మార్చాయి. జార్ఖండ్ ముఖ్యమంత్రి మధు కొడా రెండు సంవత్సరాలలో గనులు ప్రైవేటు వ్యక్తులకు కాంట్రాక్టుకిచ్చి నాలుగు వేల కోట్ల రూపాయల ఆస్తి పోగేసుకున్నాడు. కర్ణాటకలో రెడ్డీ బ్రదర్స్ బెలూరు ఇనుప ఖనిజాన్ని ఎగుమతి చేసి ఐదు వేల కోట్ల రూపాయల సంపత్తికి యజమానులు అయ్యారు. ఒడిశా గనుల చరిత్ర అంతా లూటీ చరిత్ర. బిజూ పట్నాయక్ ముఖ్యమంత్రి పరిపాలనలో సరజు ప్రసాద్ కమిషన్ గనుల అవినీతిలో ప్రభుత్వం నియమాలు ఉల్లంఘించినట్లు దోషిగా నిలిపింది. రాష్ట్ర అవినీతి విభాగం గనుల వ్యాపారంలో నియమాలు ఉల్లంఘన విస్తృతంగా జరిగినట్లు ఆరోపించింది. ప్రస్తుత నవీన్ పరిపాలనలో గనుల దుర్నీతి (అవినీతి) అంతిమ దశకు చేరుకుంది (అరవై వేల కోట్ల రూపాయలు). గనుల రంగంలో అవినీతిపై విధాన సభ, ఉభయ పార్లమెంట్ సభలు గందరగోళం ఏర్పడి వాయిదా పడ్డాయి. గనుల యజమానులు అనుమతులు లేకుండా క్రోమైట్, బాక్సైట్, మాంగనీసు, ఇనుపరాయి, సున్నపురాయి గనులు తవ్వి విదేశాలకు అమ్మి కోట్లాది రూపాయలు లూటీ చేసారు. కొందరు గనుల యజమానులు భారతీయ ఖనిజ బ్యూరో దగ్గర అనుమతి పొంది, అనుమతులకు మించి ఖనిజ వ్యాపారం చేసి కోట్లాది రూపాయలు గడించారు. ఒడిశా హైకోర్టు నియమించిన కేంద్రీయ కమిటీ సమాచారం ప్రకారం రాష్ట్రంలో నడుస్తున్న 341 గనులలో 215 గనులకు అంటే అరవై శాతం గనులకు కేంద్ర ప్రభుత్వం అనుమతి లేదు. ఈ అవినీతిలో భ్రష్ట రాజకీయ నాయకులు, దళారీలు, బ్యూరాక్రాట్లు, పోలీసు ఉన్నతాధికారులు, పర్యావరణం, గనుల విభాగాల ముఖ్యపాత్ర ఉంది. సుమారు మూడు లక్షల కోట్ల రూపాయల అవినీతి కేసులు రాష్ట్రంలోని వివిధ కోర్టులలో నడుస్తున్నాయి. పుష్కలంగా ఖనిజ సంపద ఉన్న ఒడిశా రాష్ట్రం వెనుకబడిన రాష్ట్రంగా పేరున్నది. దేశ, విదేశ పెట్టుబడిదారుల యాజమాన్యంలో గనులు ఉన్నంత కాలం ఒడిశా దోపిడీకి గురవుతుంది. ఉరుగ్వే, సుడాన్, సోమాలియా, బ్రెజిల్, చిలీ, నికరాగువా వంటి లాటిన్ అమెరికా, ఆఫ్రికా దేశాలు ఒడిశా రాష్ట్ర పరిస్థితిని ఎదుర్కొంటున్నాయి.

అభివృద్ధి పేరున నిర్వాసితుల సమస్య కార్మిక వర్గానికి జన్మ ఇస్తాయి. అభివృద్ధి అంటే ఖనిజ ఆధారిత భారీ పరిశ్రమలు, భారీ ఆనకట్టలు, ఓడరేవులు, రైలు మార్గాలు, హైవేల ఉద్యానవనాలు అని భావిస్తున్నాం. ఏ దేశంలోనైనా ఆర్థికాభివృద్ధికి అవి తోడ్పడతాయి. ఉత్పత్తి ఆదాయం పెరుగుతాయి. ప్రజలకు ఉపాధి దొరుకుతుంది. మరోవైపు పైన పేర్కొన్న ప్రాజెక్టుల వలన మాతృభూమి నుండి ప్రజలు తొలగింప

బదుతారు. గడిచిన అరవై సంవత్సరాల ఒడిశా చరిత్ర అంతా దళితులు, ఆదివాసులు, హరిజనులు మాతృభూమిని వదిలి నిర్వాసితులుగా తయారయ్యారు. పునరావాసం పెట్టుబడిదారీ చేతిలోకి వదిలిన చరిత్ర. బ్రిటిష్ సామ్రాజ్యవాద పాలనలో భూ సేకరణ చట్టం 1894, ఒడిశా ప్రభుత్వం పునరావాస చట్టం 2006, బ్రిటిష్ ప్రభుత్వ అటవీ విధాన చట్టాలు 1855, 1878, 1894, 1927, భారత ప్రభుత్వ 1952 అటవీ చట్టం, జాతీయ అడవి హక్కు చట్టం 2006, ఒడిశా ప్రభుత్వ 1972 అడవీ చట్టం, ఆదివాసీ ప్రాంతాల పంచాయితీ విస్తరణ చట్టం 1996, సెజ్ చట్టం 2005, చిన్న నామమాత్ర రైతులు, భూమిలేని వ్యవసాయ కూలీలు, దళితులు, ఆదివాసుల నుండి, జల్, జమీన్, జంగల్ తీసుకొని దళారీ పెట్టుబడిదారీ చేతిలోకి పెట్టాయి. 1990 తర్వాత వచ్చిన నూతన ఆర్థిక సంస్కరణలు వ్యవస్థను వేగవంతం చేసాయి. 1940 దశాబ్దంలో మాచ్‌ఖండ్ విద్యుత్ కేంద్రం, 80వ దశాబ్దంలో హిరాకుడ్ బహుళార్థ సాధక ప్రాజెక్ట్, రెంగాలీ బహుముఖ ప్రాజెక్ట్, గోహిర అపర్ కోలాబ్, అపర ఇంద్రావతి, బలిమెలా ప్రాజెక్ట్, రూర్కేలా స్టీల్‌ప్లాంట్, సునాబెడా మిగ్ అనుగుల్ దామన్ జోడి అలుమీనా ప్రాజెక్ట్ 90 దశాబ్ది నుండి 2010 వరకు భూషణ స్టీల్ కాశీపుర, లాంజిగడ్, ఝూర్సుగూడాలలో అలుమీనా ప్రాజెక్ట్, చిలికాలో టాటా రొయ్యల ప్రాజెక్ట్, గోపాల్‌పూర్‌లో టాటా ఇస్పాత్ ప్లాంట్, కళింగనగర్ టాటా స్టీల్‌ప్లాంట్, జగత్ సింహాపూర్ పోస్కో ఇస్పాత్ ప్లాంట్, ఝూరుసుగూడాలో వేదాంత అలుమీనాలకు స్పాంజ్ ఐరన్ ప్రాజెక్టులు, ఇంకా చిన్న తరహా, మధ్యతరహా పరిశ్రమల వలన ఇనుపరాయి, డోలమైట్, బాక్సైట్ గనుల తవ్వకం వలన వేలాది ప్రజల జీవనం విచ్ఛిన్నమైంది. ఒడిశాలో ప్రాజెక్ట్‌ల వలన నిర్వాసితులు అయిన మొత్తం ప్రజలలో ఎక్కువ భాగం అంటే 70 శాతం కుటుంబాలు ఆనకట్టల వలన నిర్వాసితులు అయ్యాయి. హిరాకుడ్ ప్రాజెక్ట్ వలన 22,144 కుటుంబాలు, రెంగాలీ ప్రాజెక్ట్ వలన 11,289 కుటుంబాలు, అపర ఇంద్రావతి ప్రాజెక్ట్ వలన 5,301 కుటుంబాలు నిర్వాసితులు అయినారు. మిగిలిన 12 శాతం ఫ్యాక్టరీల వలన నిర్వాసితులైనారు. కేవలం రూర్‌కేలా స్టీల్‌ప్లాంట్ వలన 4,251 కుటుంబాలవారు నిర్వాసితులైనారు. 1951 నుండి 1990 వరకు గనులు, కర్మాగారాలు, థర్మల్ విద్యుత్ కేంద్రాలు, నదీ ప్రాజెక్టులు, అభయారణ్యాల పట్టణ అభివృద్ధి పథకాలు వలన ఒక లక్ష కుటుంబాలు, ఐదు లక్షల ప్రజలు నిర్వాసితులయ్యారు. మొత్తం రెండు లక్షల కుటుంబాలు, పది లక్షల మంది ప్రజలు నిర్వాసితులవుతారు. నిర్వాసితులలో ఎక్కువ భాగం ఆదివాసులు, దళితులు జీవనం కోసం దేశం అంతా వలసలుగా వెళతారు. వాళ్ళు అభివృద్ధిలో భాగం కారు. వికాసం బదులు వినాశం పొందుతారు. బ్రిటిష్ వలసవాదుల నుండి భారత పాలకవర్గాలకు అధికార మార్పిడి జరిగిన తరువాత ఏప్రిల్ 12, 1948న మహానది మీద ఆనకట్ట నిర్మాణం శంకుస్థాపన చేస్తూ అప్పటి ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ అన్నమాటలు– 'మీరు కష్టాలు అనుభవించాలి. దేశస్వార్థం కోసం కష్టాలు అనుభవించక తప్పదు. అభివృద్ధి కోసం కొందరు త్యాగం చేయాలి'. హిరాకుడ్ వలన నిర్వాసితులైన బ్రజరాజ్‌నగర్‌లో నివసిస్తున్న ప్రజలు మహానది కోయల కంపెనీ ఎం.సి.ఎల్. వలన రెండవసారి నిర్వాసితులైనారు. వాళ్ళు మరల ఝూర్సుగూడా టెలా కులి ప్రాంతంలో నివాసమేర్పరుచుకున్నారు. భూషణ స్టీల్ ప్లాంట్ వచ్చి మూడవసారి నిర్వాసితులను చేసింది. మాచ్‌కండ్ జల విద్యుత్ ప్రాజెక్ట్ వలన నిర్వాసితులు అయినారు. సునబెడా మిగ్ విమాన ప్లాంట్ (ఎచ్.ఎల్.ఎల్.) మరొకసారి నిర్వాసితులను చేసింది. అభివృద్ధి పేరున ఎన్నిసార్లు నిర్వాసితులు కావాలి? దేశం కోసం వాళ్ళు ఎన్ని కష్టాలు భరించాలి? అభివృద్ధి స్రవంతిలో వాళ్ల భాగస్వామ్యం ఉన్నదా? ఒడిశా నిర్వాసితుల పునరావాస చట్టం 2006 వాళ్ల బతికే హక్కును గ్యారంటీ చేయగలదా?

## నయా సామ్రాజ్యవాద కానుక ప్రజా దారిద్ర్యం

దేశంలో ఐదు సంవత్సరాల పంచవర్ష ప్రణాళిక ప్రారంభించిన రోజు నుండి ఆర్థిక వృద్ధి రేటుకు, తలసరి ఆదాయం వృద్ధి రేటుకు ప్రాధాన్యత ఇచ్చింది. అభివృద్ధి రేటు, తలసరి ఆదాయం పెరిగినా పరోక్షంగా దేశ ఆదాయం, సంపద పంపకం సామాజిక న్యాయం ప్రతిష్టించవచ్చు. అభివృద్ధి చెందిన దేశం పై వాటిని సాధించగలదు. అర్ధవలస, అర్ధభూస్వామ్య దేశం పై లక్ష్యాలు సాధించలేదు. జాతీయ ఆదాయం పెరిగినా పేదరికం పెరుగుతుంది. భారతదేశం వంటి వర్గ సమాజ వ్యవస్థలో అసమాన అభివృద్ధి తప్ప సమగ్ర అభివృద్ధి లేదు. దేశంలో పేదలుగా ఎవరిని పరిగణించగలం? కార్ల సంఖ్య ఎంత? ఏ రకమైన ఆర్థిక వ్యవస్థ పేదలను విముక్తి చేయగలదు?

ప్రపంచ బ్యాంక్, భారత ప్రభుత్వం, ప్రణాళిక కమిషన్, కొద్దిమంది సంస్కరణవాదులు, ఆర్థికవేత్తలు భారత్‌లో పేదరికం రాను రాను తగ్గుతోందని చర్చిస్తున్నారు. ఆర్థికవేత్తలైన వి.ఎం. దాండేకర, నీలకంఠ్ రథ్‌లు పేదరికానికి సూచించిన కొలమానాలు, మనిషికి అవసరమైన 2250 కాలరీల ఆహారం కోసం 1968–69 రేట్లను అనుసరించి గ్రామీణ ప్రాంతంలో సంవత్సర తలసరి ఆదాయం 324 రూపాయలు, పట్టణ ప్రాంతంలో 486 రూపాయల కన్న తక్కువ ఆదాయం గలవారిని పేదవారిగా నిర్ధారించారు. 1968–69లో వారి గణాంకాలను అనుసరించి గ్రామీణ ప్రాంతంలో 40 శాతం, పట్టణ ప్రాంతంలో 50 శాతం ప్రజలు దారిద్ర్య రేఖ దిగువ బతుకుతున్నారు. 1989లో ప్రపంచ బ్యాంక్ భారత్‌లో పేదరికం గురించి ప్రకటించిన గణాంకాల ప్రకారం 1970, 1973, 1988లలో 52.4, 42.5, 40 శాతం ప్రజలు అతి పేదరికంలో బతుకుతున్నారు. 70, 80 దశాబ్దంలో పేదరికం తగ్గింది అని ప్రపంచబ్యాంక్ తెలియజేసింది.

1989 ప్రణాళికా కమిషన్ నియమించిన నిపుణుల కమిటీ గణాంకాల ప్రకారం 1973–74లో భారత్‌లో 54.9 శాతం ప్రజలు పేదరికం కింద ఉంటే, 1987–88కు వారి సంఖ్య 39.3 శాతానికి తగ్గింది. ప్రణాళిక కమిషన్ చెప్పినట్లు గత పద్నాలుగు సంవత్సరాలలో పేదరికం నిర్మూలన పథకాలు సఫలం అయినాయి. 1973–74లో ఒడిశాలో 66.28 శాతం ప్రజలు దారిద్ర్యరేఖ దిగువ బతికితే 1987–88లో 55.61 శాతంకు తగ్గిందని భారత ప్రభుత్వ గణాంకాలు సూచించిన భారత్‌లో 25వ వెనుకబడిన పేద రాష్ట్రంగా ఒడిశాను పేర్కొన్నారు. యు.ఎన్.డి.పి. పేదరికం గురించి ప్రకటించిన గణాంకాలను అనుసరించి 1992లో భారత్‌లో 40 శాతం ప్రజలు దారిద్ర్యరేఖ దిగువున ఉంటే చైనాలో 9 శాతం, పాకిస్తాన్‌లో 28 శాతం, ఇండోనేసియాలో 25 శాతం ప్రజలు దారిద్ర్యరేఖ దిగువున బతుకుతున్నారు. ప్రణాళికా కమిషన్ వేరే గణాంకాలు అనుసరించి

1993-94లో గ్రామీణ ప్రాంతంలో 37.6 శాతం నుంచి పేదరికం తగ్గి 1999-2000లో 27.7 శాతంకు చేరింది. పట్టణ ప్రాంతంలో 32.4 నుంచి 25.2 శాతంకు తగ్గింది.

జాతీయ సర్వేక్షణ సంస్థ (ఎచ్.ఎస్.ఎస్.) సరాసరి రోజుకు తలసరి ఖర్చు తీసుకొని అర్జున్ సేన్ గుప్తా, పి.కె. కానన్, జి. రవీంద్రన్ ప్రకటించినట్లు 1993-94, 1999-2000, 2004-05 సంవత్సరాల లో 81.8, 80.7, 76.7 శాతం ప్రజలు దారిద్ర్య రేఖ దిగువున బతుకుతున్నారు. అంతర్జాతీయ దారిద్ర్యరేఖతో పోల్చితే భారతీయులు సరాసరి, రోజువారి తలసరి ఖర్చు రు.15 లేదా డాలర్ కంటే తక్కువ. 2004-05లో 23.3 శాతంగా ఉన్న మధ్యతరగతి, ధనిక వర్గాల దినసరి ఖర్చు 5.1 దాలర్ల కంటే ఎక్కువ. 2006లో ప్రపంచ బ్యాంక్ ప్రకటించిన అభివృద్ధి రిపోర్ట్‌లో 35 శాతం భారతీయులు అతి దయనీయమైన పరిస్థితిలో అంటే ఒక డాలర్ కంటే తక్కువ ఖర్చు పెడుతూ బతుకుతున్నారు.

పేదరికం పెరుగుతోంది. పేదలలో తారతమ్యం పెరుగుతోంది. సంస్కరణలు ప్రారంభించిన తరువాత పేదరికం భయంకర రూపం దాల్చింది. ప్రపంచ అభివృద్ధి సంస్థను అనుసరించి 1992లో పది శాతం ప్రజల దగ్గర ఆదాయంలో 28.4 శాతం ఉంటే, 1997 కల్లా 33.5 శాతం అయింది. ఆదాయంలో అతి తక్కువ 20 శాతం ప్రజల ఆదాయం 1992లో 8.5 శాతం ఉంటే, 1997 సంవత్సరానికి 8.2 శాతం తగ్గింది. 1999 యు.ఎన్.డి.పి. ప్రకటించిన లెక్కల ప్రకారం 1960 జన సంఖ్యలో ధనికుల ఆదాయం పేదల ఆదాయంతో పోల్చితే 30 రెట్లు అధికం. 1991కి 60 రెట్లకు పెరిగితే 1998 కల్లా 78 రెట్లు పెరిగింది.

### వస్తు వ్యామోహం, సాంస్కృతికదాడి, విద్యా ఆరోగ్యాలకు ఆర్థికలేమి

మార్కెట్‌లో డిమాండ్ ఉన్నా లేకున్నా నూతన ఉత్పత్తులు వస్తున్నాయి. ప్రలోభపరిచే ప్రకటనలతో డిమాండ్‌ను సృష్టిస్తున్నాయి. నయా సామ్రాజ్యవాద ఆర్థిక విధానాలు మార్కెట్‌పై ఆధారపడినవి. వలస, అర్ధవలసపై ఆధారపడి ప్రపంచ మార్కెట్ నడుస్తోంది. 80 శాతం పేదరికం ఉన్న భారతదేశం వంటి దేశాల ప్రజలు ఆర్థికలేమి వలన నూతన ఉత్పత్తుల కొనుగోలుదారులుగా కాలేకపోతున్నారు. 20 శాతంగా ఉన్న మధ్యతరగతి, ధనిక శ్రేణి మొత్తం నెలసరి ఖర్చులో ఎక్కువ భాగం విలాస వస్తువులకు ఖర్చు పెడుతున్నారు. 20 శాతంగా ఉన్న ధనికుల కోసం విలాస సామగ్రి అయిన కారు, ఫ్రిజ్, ఎయిర్‌కూలర్, టెలివిజన్, మొబైల్ ఫోన్, సినిమా, హోటల్, విమానయానం, పార్కు మొదలైన వాటికి ఖర్చు పెడుతున్నారు. వీటిని కొంతమంది అభివృద్ధి అని చెపుతున్నారు. సమాజంలో ఒకరు అన్ని రకాల వస్తు వినియోగ దారుడుగా ఉండడం చెడుగా భావించనక్కర లేదు. సాధారణ ప్రజలకు ఉండడానికి ఇల్లు, చాలినంత ఆహార పంట, బట్టలు, పాఠశాల, కళాశాల, ఆస్పత్రి, రహదారి, తాగునీరు మొదలైనవి కొరత ఉన్నప్పుడు ధనికవర్గం విలాస వస్తువులకు ఖర్చు పెట్టడం సరి కాదు.

విద్య వలన మానవుడు తన ఉపాధి కల్పన, ఆదాయాన్ని గ్యారంటీ చేసుకోగలడు. 2004-05 ఎన్.ఎస్.ఎల్. రిపోర్ట్‌ను అనుసరించి 86.1 శాతం పేదలు నిరక్షరాస్యులు. మధ్యతరగతి, ధనిక శ్రేణిలో నిరక్షరాసులు ఉన్నారు. వారి శాతం 13.9. వాళ్లు విద్యలు పొందుతున్నారు. పేదరికం నుండి రక్షింపబడుతున్నారు. అగ్రవర్ణాలు, అగ్రవర్గాలు, ధనిక శ్రేణులు విద్య వలన ఉన్నత ఆదాయాన్ని పొందుతున్నాయి. ప్రపంచంలో అనేక దేశాలు జాతీయ ఆదాయంలో 6 శాతం విద్యకు ఖర్చు చేస్తున్నాయి. భారత్‌లో మాత్రం 3 శాతమే. విద్యను ప్రభుత్వం ప్రైవేటీకరణ చేయడం వలన ఖర్చు పెరిగి సామాన్య ప్రజలు చదువుకు దూరమవుతున్నారు.

విద్య వలె మనిషి ఆయుషు కూడా అభివృద్ధిలో ఒక భాగంగా పరిగణించాలి. 1995లో భారత్‌లో సరాసరి ఆయుషు 60 సంవత్సరాలు. కెనడాలో 79, ఫ్రాన్స్‌లో 78, అమెరికాలో 76, చైనాలో 69, శ్రీలంకలో 72 సంవత్సరాలు. ఆరోగ్యం, సేవా ఉపాధి కల్పన, ఆదాయంపై ఆధారపడి ఆయుషు ఉంటుంది. ఒక సంవత్సరంలో వెయ్యి మంది శిశువులలో ఎంత మంది మృత్యువాత పడుతున్నారు. 2005లో చూస్తే భారత్‌లో శిశు మృత్యు రేటు 58. అభివృద్ధి చెందిన దేశాలలో శిశు మృత్యు రేటు 10 కంటే తక్కువే. పేదరికం, వైద్య కొరత స్త్రీలకు ఆరోగ్యం చైతన్యం లేకపోవడం వలన దేశంలో శిశు మృత్యు రేటు అధికం. ఒడిశాలో అత్యధికంగా 75 ఉంది. ప్రపంచ ఆరోగ్య సంస్థ (డబ్ల్యు.ఎచ్.ఒ.) 2010 ఆరోగ్య రిపోర్ట్ ప్రకారం భారత్‌లో క్షయతో 23 శాతం, డిప్‌తేరియాతో 86 శాతం, కుష్టుతో 54 శాతం, పోలియోతో 47 శాతం, ధనుర్వాతంతో 22 శాతం, మలేరియా 55 శాతం మంది వ్యాధిగ్రస్తులు ఉన్నారు. భారత ప్రభుత్వం జాతీయ ఆదాయంలో 20 శాతం ఖర్చు చేస్తున్నది. దానిలో పట్టణ ప్రాంతంలో ఎక్కువ భాగం ఖర్చు వైద్యానికి చేస్తున్నారు. 74 శాతంగా ఉన్న గ్రామీణ ప్రాంతంలో వైద్య సేవలు తక్కువే. వైద్యాన్ని ప్రైవేటీకరణ చేయడం ఫలితంగా రాజధానిలో కార్పొరేట్ హాస్పిటల్స్ వెలిసాయి. రాయగడ్, కోరాపుట్, మల్కన్‌గిరి జిల్లాల్లో వందలాది మంది హైజా (వాంతులు, విరోచనాలు)కు గురై మరణిస్తున్నారు.

జాతీయ ఆదాయం వృద్ధి రేటు పెరుగుతున్నది. మరో పక్క 1997 నుండి 2006 మధ్యలో భారత్‌లో ఒక లక్షా ఇరవై వేల మంది రైతులు ఆత్మహత్యలతో మరణించారు. పేదలు పెరుగుతున్నారు. 1980ల లెక్కల ప్రకారం ప్రపంచంలోని పేదలలో 25 శాతం ప్రజలు భారత్‌లో ఉన్నారు. 2010 సంవత్సరానికి వీరి సంఖ్య 40 శాతంకు పెరిగింది. భారత ప్రభుత్వం మహారాష్ట్ర నుండి ఆంధ్రప్రదేశ్, ఛత్తీస్‌ఘడ్, ఒడిశా, మధ్యప్రదేశ్, జార్ఖండ్, బీహార్, పశ్చిమ బెంగాల్ వరకు బహుళజాతి కంపెనీలకు దళారీ బూర్జువాల కోసం ఖనిజ పదార్థాలు ఇతర ప్రకృతి సంపదను దోపిడీ చేయడానికి విశాల పారిశ్రామిక కారిడార్ నిర్మిస్తున్నది. పోస్కో, రియోటింటో, బి.ఎచ్.సి. వేదాంత, ఆర్.ఐ.ఎల్., మిత్తల్, ఎస్.ఆర్, టాటా, బిర్లా, దాల్మియా, రిలయెన్స్, భూషణ, జిందాల్ మొదలైన కంపెనీలకు లీజుకు దారాధత్తం చేసింది. విదేశీ, దేశీ గుత్త సంస్థల దోపిడీని ప్రజలు ప్రతిఘటిస్తే భారత ప్రభుత్వం గ్రేహౌండ్స్, కోబ్రా, సర్ఫకచ్, సి.ఆర్.పి.ఎఫ్., బి.ఎస్.ఎఫ్. నాగా బెటాలియన్ వంటి బలగాలతో నిర్బంధకాండ కొనసాగిస్తోంది. దళారీ రాజకీయ నేతలు, బ్యూరాక్రాట్లు, దేశ విదేశీ గని యజమానుల చేతిలో సంపద పోగు బడుతోంది. ఇది సాధారణ ప్రజల గుణాత్మక అభివృద్ధి కాదు. దీని మూలాలు సామ్రాజ్యవాద ప్రపంచీకరణలో ఉన్నాయి. దీనికి మానవాది ముఖం తొడిగినా మనిషి కనిపించదు.

*(రచయిత సామాజిక కార్యకర్త)*

*(ఒడియా నుంచి తెలుగు అనువాదం : సలీం)* వీ

*మానవ హక్కుల ఉద్యమ నేత బుర్రా రాములు జీవితం, విలువలు, ఆరాట పోరాటాలు, జ్ఞాపకాలను వివరిస్తున్నారు* **సాదు రాజేష్**

# హక్కుల చిరునామా.. బుర్రా రాములు

**రా**జ్యంపై ప్రశ్నలు సంధించి, ఆధిపత్యం, అణిచివేతను ఎదుర్కొంటూ నిర్బంధమనే కత్తుల వంతెనపై నిటారుగా నిలబడి హక్కుల గానం చేసిన ప్రొఫెసర్ బుర్రా రాములు అకాల మరణం అణగారిన వర్గాలకు తీరని లోటు. ముఖ్యంగా హక్కుల కార్యకర్తలకు ఇదో పెద్దషాక్. దేశ వ్యాప్తంగా, మరీ ముఖ్యంగా తెలుగు నేల నలు చెరుగులా నడయాడి, హక్కుల పరిరక్షణ కోసం అహర్నిశలు కృషి చేసిన డాక్టర్ బాలగోపాల్, ఆ తర్వాత కన్నబిరాన్ మరణం అందరినీ షాక్‌కు గురి చేసింది. ఆ షాక్ నుంచి తేరుకోకముందే బుర్రా రాములు ఇలా శాశ్వతంగా సెలవు తీసుకోవడం హక్కుల ఉద్యమానికి పూడ్చలేని లోటు.

1954 జూన్ 10న ఖిలా వరంగల్‌లో జన్మించిన బుర్రా రాములుకు విద్యార్థి దశలోనే విప్లవ రాజకీయాలతో పరిచయమేర్పడింది. ఆ ఖిలా వరంగల్‌నే ప్రయోగశాలగా చేసుకుని ఆయన ఎన్నో ఉద్యమాలు నడిపారు. విద్యార్థి దశలోనే పిడిఎస్‌యు, ఆర్ఎస్‌యు ఐక్య సంఘటనగా ఏర్పడి 1980లో కాకతీయ యూనివర్సిటీ విద్యార్థి సంఘాల ఎన్నికల్లో అధ్యక్షుడిగా ఎన్నికయ్యారు. పరిశోధక విద్యార్థిగా ఉండగానే ఎపిసిఎల్‌సి లో సభ్యత్వం తీసుకున్నారు.

వరంగల్ లాంటి ప్రాంతాల్లో హక్కుల సంఘంలో పని చేయడమంటే మృత్యువుతో సహవాసం చేయడమే.. ఓరుగల్లు పోరుగడ్డపై హక్కుల కోసం గొంతెత్తి నినదించిన పిల్లల డాక్టర్ రామనాథం, న్యాయవాది నర్రా ప్రభాకర్ రెడ్డి ఒక్కొక్కరుగా నల్లదండు ముఠాల చేతిలో ఘాతుకానికి బలైన సమయంలో కూడా ఆయన గుండెనిబ్బరంతో హక్కుల ఉద్యమంలోనే కొనసాగారు. రాజ్యం రాక్షస నిర్బంధం వల్ల వరంగల్‌లో నివాసం హక్కుల సంఘాల నాయకులకు, మేధావులకు జీవన్మరణ సమస్యగా పరిణమించిన సందర్భంలో కూడా ఆయన మొండి ధైర్యంతో ఉద్యమాన్నే అంటిపెట్టుకుని ఉన్నారు. మనోధైర్యం కోల్పోకుండా మూడు దశాబ్దాలు రాజ్యంతో కలబడ్డారు.. నిలబడ్డారు. కోబ్రాల బుసలను, టైగర్ల ఘీంకరింపులను గుండె నిబ్బరంతో ఎదుర్కొన్నారు.

తెలంగాణ జిల్లాల్లో జరిగిన ఎన్‌కౌంటర్‌ల నిజనిర్ధారణల కోసం, ఉత్తరాంధ్రలో భూనిర్వాసితుల సమస్యలు తెలుసుకునేందుకు మరే ఇతర సమస్య మీదనో బాలగోపాల్ హైదరాబాద్ నుంచి బయల్దేరగానే టీంలో కలిసేందుకు రాములు రాత్రి ఏ టైమైనా వరంగల్‌లో రెడీగా ఉండేవారు. వారితో కలిసి నేను కూడా అనేక నిజనిర్ధారణలకు వెళ్లి రావడం జరిగింది. కడుపు నిండా తిండి, కంటి నిండా నిద్ర, అనుభవించడానికి అందుబాటులో ఉండే సౌకర్యాలన్ని వినియోగించు కోవాలనుకునే సగటు యూనివర్సిటీ ప్రొఫెసర్‌లా ఆయన ఎప్పుడూ ఆలోచించలేదు. అమాయకులైన ఆదివాసీల గురించో.. నిర్వాసితులవుతున్న మత్స్యకారుల గురించో.. ఇంటాబయట హింసను అనుభవిస్తున్న మహిళల గురించో, అణచివేతకు గురవుతున్న అణగారిన వర్గాల గురించో.. ఈ ప్రాంతంలోని, ప్రాంతేతర రాజకీయ నాయకుల చేతుల్లో దగాపడ్డ తెలంగాణ గురించో ఆయన చాలా రాడికల్‌గా ఆలోచించేవారు. సమకాలీన అంశాలపై తనకున్న అభిప్రాయాన్ని నిక్కచ్చిగా చెప్పేవారు. వ్యక్తీకరణ ముక్కు సూటిగా ఉండేది.

మనల్ని విమర్శించేవారి గొంతును మనం వినాల్సిందేనని బుర్ర రాములు ఎప్పుడూ అంటుండేవారు. ఏ అంశంపైనైనా ప్రజాస్వామిక చర్చ జరగాలని భావించేవారు. ఆ ప్రయత్నంలో భాగంగానే ఆయన యూనివర్సిటీలో విప్లవ విద్యార్థి ఉద్యమంలో క్రియాశీలకంగా పని చేస్తున్న కాలంలో 'సమాజ మార్పునకు ఆయుధం అవసరమా?' అనే అంశంపై క్యాంపస్‌లో సదస్సు ఏర్పాటు చేసి వక్తలుగా ఆర్ఎస్‌యు, పి.డి.ఎస్.యు., డి.ఎస్.ఒ. సంఘాలను బలపరిచే మేధావులతో ఈ రాజకీయాలను వ్యతిరేకించే ఎ.బి.వి.పి. ప్రతినిధిని కూడా ఆహ్వానించారు. ఇదే తరహాలో గత ఏడాది కాశ్మీర్ అంశంతోపాటు ఒడిశా (కొందమాల్), కర్ణాటకలో జరిగిన మత ఘర్షణలపై హన్మకొండలో రెండుసార్లు సదస్సులు ఏర్పాటు చేసి భిన్నాభిప్రాయాలు ఉన్న వ్యక్తులను ఒకే వేదికపైకి తీసుకొచ్చి మాట్లాడించారు.

1969 ఉద్యమంలో యువకుడిగా పాల్గొన్న ఆయన ప్రస్తుతం జరుగుతున్న ఉద్యమంలో కూడా అదే ఉత్సాహం, ఊపుతో పాల్గొని యూనివర్సిటీ విద్యార్థుల్లో ఉద్యమస్ఫూర్తిని రగిలించారు. ఆయన ప్రతి సభలో తెలంగాణలోని రాజకీయ నాయకుల గులామీ స్వభావాన్ని ఎండగట్టేవారు. ప్రజలు నడిపే తెలంగాణ ఉద్యమంపై పెత్తనం వద్దనే వారు. తన శక్తినంతా క్యాన్సర్ సోకిన ఈ వ్యవస్థపై పోరాటానికే ఖర్చుచేసి చివరికి తన శరీరానికి సోకిన క్యాన్సర్ ముందు నిస్సహాయుడయ్యారు.

రాములు దగ్గర పి.జి., పిఎచ్.డి. విద్యార్థిగా హక్కుల కార్యకర్తగా ఎనిమిదేళ్ల కాలంలో అనేక అనుభవాలు. ఎకానమిక్స్‌లో పి.జి. అయిపోగానే పి.ఎచ్.డి. కోసమని ఆయన దగ్గరికి వెళ్లాను. విశ్వవిద్యాలయంలో జరిగే పరిశోధన సమాజానికి ఉపయోగపడాలని, సిద్ధాంత గ్రంథాలు లైబ్రరీ ర్యాకులకే పరిమితం కావొద్దని, అలాంటి అంశాన్ని ఎంచుకుని పిఎచ్.డి. చేయాలని ఆయన ఆ సందర్భంలో

**స్త్రీ సమస్యను మార్క్సిస్ట్ దృక్పథంతో విశ్లేషించిన డా. నళిని 'స్త్రీవాద సాహిత్యం ఒక పరిశీలన' వ్యాస సంకలనాన్ని సమీక్షిస్తున్నారు ఆశాలత**

# స్త్రీ విముక్తి మరో కోణం

డాక్టర్ నళిని రాసిన 'స్త్రీవాద సాహిత్యం – ఒక పరిశీలన' వ్యాస సంకలనం 1989 నుండి 2009 వరకు స్త్రీ సమస్యపై జరిగిన విస్తృత చర్చను ప్రతిఫలిస్తుంది. దీనిలో ఇరవై మూడు వ్యాసాలు, సైద్ధాంతిక వ్యాసాలు, పుస్తక సమీక్షలు, ప్రతిస్పందనలు ఉన్నాయి. ఇవన్నీ మార్క్సిస్ట్ దృక్పథంతో స్త్రీ సమస్యను విశ్లేషించి, స్త్రీవాద సాహిత్యాన్ని సునిశితంగా విమర్శించిన వ్యాసాలు.

స్త్రీ సమస్యల మూలాలను, స్త్రీలపై అణచివేతకు కారణాలను వివరిస్తూ నళిని 'స్త్రీ సమస్య వ్యక్తిగతం కాదు, అది సమాజంతో ముడిపడి ఉంది. వ్యక్తిగత ఆస్తి అమలులోకి రాకముందు మాతృస్వామ్య వ్యవస్థలో స్త్రీ గౌరవప్రదమైన ఉన్నతస్థానంలో ఉండేది. ఆనాడు కూడా స్త్రీ పురుషుల మధ్య శారీరక భేదాలున్నాయి. కాని అవి పురుషాధిపత్యానికి దారి తీయలేదు. శ్రమవిభజన జరిగి సంపద పెరిగి, వ్యక్తిగత ఆస్తి అమలులోకి వచ్చిననాడే స్త్రీలతోపాటు మెజారిటీ పురుషులు కూడా అణచివేతకు గురయ్యారు. స్త్రీలు అప్పుడు మాత్రమే పురుషాధిపత్యమనే అదనపు అణచివేతకు గురయ్యార'ని అంటుంది.



| | | |
|---|---|---|
| రచయిత | : | **డా. నళిని** |
| వెల | : | **రు. 70** |
| ప్రతులకు | : | హైదరాబాద్‌లోని నవోదయ బుక్‌హౌస్, దిశ పుస్తక కేంద్రం, ప్రజాశక్తి బుక్‌హౌస్, విశాలాంధ్ర బుక్‌హౌస్, తెలుగు బుక్‌హౌస్, నవయుగ బుక్‌హౌస్ వాటి బ్రాంచీలలో |

పై విశ్లేషణను, ఎంగెల్స్ చెప్పిన ఈ వాక్యాలతో కలిపి చదువుకుంటే స్త్రీ సమస్య కూలంకషంగా అర్థమవుతుంది – 'స్త్రీ పురుషుల మధ్య ప్రప్రథమంగా జరిగిన శ్రమ విభజన సంతానోత్పత్తి కోసం... దంపతి వివాహంతో స్త్రీ పురుషుల మధ్య పెంపొందిన వైషమ్యాలు, మొట్టమొదటి వర్గవైషమ్యం చరిత్రలో ఏక కాలంలో తలెత్తాయి. స్త్రీ జాతిని పురుషజాతి అణచివేయడమే మొట్టమొదటి వర్గపీడనం.'

ఇంకా ఆగస్ట్ బెబెల్ స్త్రీ సమస్య గురించి రాస్తూ, 'మానవులలో బానిసత్వాన్ని మొట్టమొదటి చవిచూసింది మహిళే.. బానిస ఉనికిలోకి రాకముందే స్త్రీ బానిస అయింది.'

జనాభాలో సగభాగంగా ఉన్న మహిళలలో అధికశాతం శ్రామిక మహిళలే. వారు అడుగడుగునా దోపిడీ, అణచివేతలకు గురవుతున్నారు. శ్రామిక స్త్రీల పీడన మొదటగా వర్గపీడనే. లైంగిక అసమానత వర్గ అసమానత వెంబడే వచ్చింది. అందుకే వర్గ దృక్పథంతో వ్యక్తగత ఆస్తి – యాజమాన్యాన్ని వర్గ దోపిడీని అంతమొందించే సామాజిక విప్లవోద్యమంలో భాగంగానే స్త్రీ సమస్య పరిష్కారమవుతుందని నళిని చెబుతుంది.

ఈ పుస్తకంలోని వ్యాసాలలో ఆసాంతం ఫెమినిస్టు భావాలను తీవ్రంగా విమర్శించడం జరిగింది. సామాజిక వ్యవస్థను మార్చే కర్తవ్యాన్ని నిరాకరిస్తూ ఫెమినిస్టులు

---

అన్నారు. ఇలా పరిశోధనాంశం విషయంలో జరిగిన సుదీర్ఘ చర్చ తర్వాత ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్యేక ఆర్థిక మండలాలు – పరిశీలన అనే అంశాన్ని సూచించారు.

సికింద్రాబాద్ యశోదా ఆస్పత్రిలో సర్జరీ కాగానే ఆయనను చూసేందుకు కేయూ ఎకానమిక్స్ ప్రొఫెసర్ విజయతో కలిసి నేను కూడా వెళ్లాను. ఆ తర్వాత ఇంటి వద్ద విశ్రాంతి తీసుకుంటున్న ఆయనను అప్పుడప్పుడు కలిసినప్పుడల్లా తెలంగాణ ఉద్యమం గురించే మాట్లాడేవారు. ఆయన సలహాతోనే కేయూ విద్యార్థి జాక్ ఆధ్వర్యంలో గద్దర్, వరవరరావు, కోదండరాం, హరగోపాల్, ఈటెల రాజేందర్, బూర్గుల ప్రదీప్ తదితరులను ఏప్రిల్ నెలలో యూనివర్సిటీకి ఆహ్వానించి సెనేట్ హాల్‌లో పెద్ద ఎత్తున 'ఉద్యమం – ఆచరణ' అంశంపై సదస్సు నిర్వహించడం జరిగింది. అనారోగ్యంలో కూడా ఆయనకు ఉద్యమం పట్ల ఉన్న ఆరాటానికిదే నిదర్శనం.

ఇక ఆయన ఆరోగ్యం కుదుటపడ్డట్లే అనుకున్న కొద్దిరోజులకే మళ్లీ ఆయన పరిస్థితి విషమంగా మారింది. చివరగా హన్మకొండ వెంకటరమణ ఆస్పత్రిలో చికిత్స పొందుతున్న ఆయన నాతో ఏదో మాట్లాడబోయారు. కానీ ఆ గొంతు పెగల్లేదు. నోరులేని అమాయక ప్రజలకు గొంతుకనిచ్చిన ఆ మానవీయమూర్తి స్వరం మరుసటి రోజు మే 14న శాశ్వతంగా మూగబోయింది.

*(రచయిత రీసెర్చ్ స్కాలర్)* వీ

అనుక్షణం పురుషాధిక్యతను అసహ్యించుకుంటూ దాన్నే తమ ప్రధాన కార్యరంగంగా ఎంచుకున్నారని, వివాహ వ్యవస్థ స్త్రీని బానిసగా మార్చివేస్తుంది కాబట్టి అసలు పెళ్లే చేసుకోకూడదనే విపరీత ధోరణులతో స్త్రీకి పురుషులే ప్రధాన వర్గశత్రువులని, అందుకే స్త్రీలు తమ పోరాటాన్ని పురుషాధిక్యత పైనా, పితృస్వామ్యం పైనా కేంద్రీకరించాలనడం సరైనది కాదని అది అశాస్త్రీయమైందని నళిని వాదిస్తుంది.

ఎందుకంటే పురుషులందరి చేతిలో రాజకీయ అధికారం లేదు, వర్గసమాజం ఏర్పడిన నాటి నుండి రాజకీయాధికారం దోపిడీ చేసే వర్గాల చేతుల్లోనే ఉంది. పితృస్వామిక విధానపు అస్తిత్వం కుటుంబ సంబంధాల్లో వర్గదోపిడీకి ప్రతిబింబం. ఉత్పత్తి సంబంధాలు మారి ప్రజాస్వామిక విప్లవ దశలో పితృస్వామిక విధానం కూలిపోవడమనేది నిజమైన, సంపూర్ణమైన స్త్రీ విముక్తిని సూచిస్తుందని రచయిత్రి బలంగా అభిప్రాయపడింది.

అయితే స్త్రీవాద సాహిత్యం పేరుతో వెల్లువలా వచ్చిన, వస్తున్న సాహిత్యం, అశాస్త్రీయమైన ఫెమినిస్టు భావాలను అధిగమిస్తూ ఫ్యూడల్ నిరంకుశ భావాల మీద ఎక్కుపెట్టబడిందని, అది కాలం చెల్లిన ఫ్యూడల్ అభివృద్ధి నిరోధక భావాలను తిప్పికొట్టి ప్రజాస్వామిక ఆకాంక్షలను బలంగా వ్యక్తం చేస్తోందని నళిని అభిప్రాయం.

ఐతే ఈ విషయాలను మరింత లోతుగా పరిశీలించాల్సిన అవసరముంది. యూరప్‌లోని ఫెమినిజం పుట్టిన పరిస్థితులు వేరు, మన రాష్ట్రంలో స్త్రీవాదం తలెత్తిన పరిస్థితులు వేరు. 1980వ దశకంలో ఇక్కడ విప్లవోద్యమం తీవ్రతరమైన నేపథ్యంలో స్త్రీవాదం, దళితవాదం రెండూ ముందుకొచ్చాయి. దళితవాదులు కుల సమస్యను ప్రధాన సమస్యగా ముందుకు తీసుకురాగా స్త్రీ వాదులు పురుషాధిక్యత పైనా, లింగ వివక్షతపైనా తమ దాడిని ఎక్కుపెట్టారు. ఇది కాకతాళీయం కాదు. స్త్రీ సమస్య, కుల సమస్య వర్గ సమస్యలో భాగమేననే వాస్తవాన్ని ఈ ఉద్యమాలు మరో కోణం (నెగటివ్) నుండి ప్రతిబింబించాయి. ఈ రెండు ఉద్యమాలు కూడా విప్లవోద్యమానికి నాయకత్వం వహించిన పార్టీలు స్త్రీ సమస్యను, కుల సమస్యను అసలు పట్టించుకోలేదని విమర్శించాయి. అగ్ర కులాలకు అణచివేయబడే కులాలకు మధ్య వైరుధ్యమే ప్రధాన వైరుధ్యమని దళిత ఉద్యమ నాయకులు, స్త్రీ పురుషుల మధ్య ప్రధాన వైరుధ్యమని స్త్రీవాదులు సిద్ధాంతీకరించారు. వర్గవైరుధ్యం పరిష్కారమై వర్గదోపిడీ నశించినప్పుడే అందులో భాగమైన కులసమస్య, స్త్రీ సమస్య పరిష్కారమవతాయన్న విప్లవ పార్టీ సిద్ధాంతాలను స్త్రీవాదులు, దళితవాదులు తిరస్కరిస్తూ వచ్చారు.

మన దేశంలో వర్గం, కులం, జెండర్ ఈ మూడు ఒక దానితో మరొకటి కలగలసి ఒకదానిపై మరొకటి ఏ విధంగా ప్రభావం చూపుతున్నాయో అర్థం చేసుకోకపోతే దోపిడీ అణచివేతలను, పేదరికాన్ని పూర్తిగా అర్థం చేసుకోలేం అని మనోరంజన్ మహంతి 'ది క్లాస్ అండ్ జెండర్' అనే పుస్తకం ఉపోద్ఘాతంలో చెబుతారు. ఆయన ఇంకా ఇలా వివరించారు – 'అధికారం సంపాదించడానికి ముఖ్యమైన వనరు వర్గానికి సంబంధించినదే అనడంలో సందేహం లేదు. అంటే భూమి, పరిశ్రమల వంటి ఉత్పత్తి సాధనాలపై ఆధిపత్యం కలిగి ఉండడమే అధికారం కైవసం చేసుకోవడానికి దారితీస్తుంది. కాని సామాజిక స్థితిగతులలో వేళ్లూనుకున్న కొన్ని విలువలు, నమ్మకాల ఆధారంగా సామాజిక చరిత్ర కొన్ని రకాల సంబంధాలను సృష్టించింది. కుల వ్యవస్థ, పితృస్వామ్యం, సామాజిక చట్రంలో పనిచేసే విలువలు, నమ్మకాలను ప్రతిబింబిస్తాయి. వీటిని కేవలం భావజాలాలుగా పరిగణించే మనుషుల చైతన్యంలో మార్పు వస్తే వీటిని మార్చవచ్చు అని భావిస్తే వాటి సామాజిక పునాదిని కాలదన్నడమే అవుతుంది.

కులానికి, వర్గానికి, జెండర్‌కు ఉన్న చలనశీలమైన అంతః సంబంధాన్ని గుర్తించడం చాలా ముఖ్యం. కులంలో వర్గముంది, అలాగే వర్గం, కులంతో జెండర్‌కు సంబంధముంది. ఈ మూడు అంశాలకు ప్రాంతీయత (ఎత్నిసిటి) ని కూడా కలపాలి. తెలంగాణ రాష్ట్ర సాధన కోసం జరుగుతున్న ఉద్యమం ప్రాంతీయ వైరుధ్యాల పరిష్కారం కోసం జరుగుతున్నదే. అన్ని రకాల సామాజిక అణచివేతల నుండి విముక్తి లభించకుండా ఏదో ఒక రకమైన అణచివేత నుండి విముక్తి పొందడం సాధ్యంకాదు. దళిత, స్త్రీవాద ఉద్యమాలు కుల సమస్యను, స్త్రీ సమస్యను ప్రధాన అంశాలుగా ముందుకు తెస్తున్నప్పటికీ, నేటి ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ నేపథ్యంలో వర్గదోపిడీ, వర్గ పీడన కేంద్ర అంశంగా గుర్తించాల్సి ఉంటుంది. ఎందుకంటే పెట్టుబడిదారీ విధానం ప్రపంచ వ్యాప్తంగా అన్ని సామాజిక రంగాలలో మానవ సంబంధాలను ఒక బలమైన శక్తిగా ప్రభావితం చేస్తున్నది. ఒక వర్గ వ్యవస్థగా పెట్టుబడిదారీ విధానం నేటి ప్రపంచంలో ఎంత శక్తివంతమైనదంటే అన్ని రకాల దోపిడీ అణచివేతలకు గురవుతున్న సెక్షన్లు తమ స్వయం ప్రతిపత్తి ఉద్యమాలు, ప్రత్యేకతలకు అతీతంగా దాని బారి నుంచి తప్పించుకోలేని స్థితిలో ఉన్నాయి. ప్రస్తుత ప్రపంచీకరణ దశలో దాని శక్తి మరింత క్రూరంగా ముందుకొస్తోంది. అందుకే అన్ని రకాల దోపిడీ అణచివేతలను రూపమాపడానికి విముక్తి కోసం పోరాడుతున్న సెక్షలన్నిటినీ ఒక విశాల సామాజిక విప్లవోద్యమంలో కలగలుపుకు రావడం నేటి అవసరం.

ఈ అంశాలపై మరింతగా విస్తృతమైన చర్చ జరగాలి. 'స్త్రీవాద సాహిత్యం – ఒక పరిశీలన' ఈ చర్చకు దోహదపడుతుంది.. ఇది అందరూ చదవవలసిన పుస్తకం.

*(రచయిత 'యాక్షి' పశు ఆరోగ్య స్వచ్ఛంద సంస్థ కార్యకర్త)* వీ

**రాబోయే సంచికలలో...**

- **ప్రాణహిత - చేవెళ్ల పేరుతో... - తోటపల్లి జగన్మోహన్ రావు**
- **వ్యవసాయ రంగానికి ఉపాధి హామీ పథకం వర్తింపజేయాలి - బండారి ఐలయ్య**
- **ప్రణాళికా వ్యవస్థకు మంగళం పాడాలి - వి. హనుమంతరావు**
- **సాయిబాబా పుట్టుపూర్వోత్తరాలు - గోగినేని బాబు**
- **సోషలిజం స్వప్నం అయితే అవినీతి వాస్తవం - వీర బ్రహ్మచారి**

*శాస్త్రీయ దృక్పథాన్ని అలవరుచుకునే దార్శనికత అందించే పుస్తకంగా ఆర్.ఎస్. రావు వ్యాస సంకలనం 'కొత్తచూపు'ను సమీక్షిస్తున్నారు* **విద్యాభూషణ్**

# నిర్దిష్ట దృక్పథానికి పునాది ఈ 'కొత్తచూపు'

'రెండు రెళ్లు నాలుగు' అన్నందుకే గూండాలు గండ్రాళ్లు విసిరే నేల ఇదని మహాకవి ఏనాడో వక్కాణించారు. కేవలం పద బంధాన్ని విడగొట్టి, ఎవరికి కావలిసిన ధోరణిని వారు ప్రకటించుకునే అవకాశవాద వ్యవస్థ ఇది. మరోవైపు ప్రజల అవగాహనా రాహిత్యాన్ని, కడకు మూఢ విశ్వాసాలను మూటగట్టుకుని సంఘ పురోభివృద్ధిని ఎవరికి వారు అనువుగా మార్చుకో చూస్తున్న రాజకీయ వ్యవస్థ ఇది. వర్తమాన సమాజంలో, విజ్ఞానం ఆకాశమే హద్దుగా విస్తరిస్తున్న వేళ, జీవితాలను వికసింప చేసుకోవడానికి ప్రతి మనిషికి శాస్త్రీయ ఆలోచనా ధోరణి అత్యంత అవసరం. ఈ అవసరాన్ని పరిపూర్తిగా కల్పించేది ఆర్.ఎస్.రావు 'కొత్తచూపు' పుస్తకం.




| | | |
|---|---|---|
| రచయిత | : | ఆర్.ఎస్. రావు |
| వెల | : | రు. 100 |
| ప్రతులకు | : | 301, మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029 |

కొన్ని శతాబ్దాలకు పూర్వమే 'జ్ఞానమే శక్తి' అని ప్రకటించాడు బేకన్. అయితే ఈ జ్ఞానాన్ని పక్కతోవ పట్టించి ప్రజల అమాయకత్వమే 'పెట్టుబడి'గా భావించి, అంతస్తులు పెంచుకోజూసే వాళ్లే ఈనాటి రాజకీయాన్ని కైవసాన్ని చేసుకుని పబ్బం గడుపుకుంటున్న సమకాలీన వ్యవస్థ ఇది. సంఘ శ్రేయస్సు దృష్ట్యా తన రుతు ధర్మాన్ని తూచా తప్పక పాటిస్తున్న 'ప్రకృతి'ని సైతం ప్రతిఘటించి అవాంఛనీయ పరిస్థితుల్ని నెలకొల్పుంతోందీ నేటి మానవుడే. గతంలో అయితే శాస్త్రీయ విజ్ఞాన దృక్పథాన్ని మతాధిపతులు వారి మనుగడ కోసం ఆటంక పరిచేవారు. ఆ క్రమంలో ఈనాటికీ మతాధిపతులూ పాలకవర్గాలూ మమేకమై సామాజిక అభివృద్ధిని వెనక్కి నెట్టేస్తున్న పరిస్థితి. ఇందుకు తాజా ఉదాహరణ ప్రకృతి వైపరీత్యాలను నిలువరించేందుకై కప్పల పెళ్లిళ్లు, యజ్ఞాలు నిర్వహిస్తున్న నేటి పాలకులు. వర్షాభావ పరిస్థితుల నెదుర్కోవడం కోసం అభిషేకాలు చేయిస్తూ బాబాలను ఆశ్రయిస్తున్న వాస్తవమూ మనముందు ఉంది. ఈ విపరీత ధోరణులకు అడ్డుకట్ట వేసేందుకు, ఓ శాస్త్రీయ దృక్పథాన్ని అలవర్చుకునేందుకు ఈ 'కొత్తచూపు' ఓ దార్శనికతను అందిస్తుంది.

ఇందుకు ఉదాహరణగా 'అభివృద్ధి - మార్క్సిస్ట్ దృక్పథం' అన్న వ్యాసం. ప్రతి సమాజమూ దశాబ్దాలుగా 'అభివృద్ధి' దిశగానే పయనిస్తుందనేది అందరూ అంగీకరించే వాస్తవం. అయితే ఆర్.ఎస్. రావు విశ్లేషణ ద్వారా నిజమైన 'అభివృద్ధి' ఎవరి పరం అవుతుందనేది స్పష్టం అవుతోంది. శ్రమశక్తి ద్వారానే అభివృద్ధి సాధ్యమౌతున్నప్పటికీ, భూస్వామ్యమెలా కైవసం చేసుకుంటుందీ విశ్లేషిస్తారు. శ్రమశక్తిని నమ్ముకున్న నిరుపేదలు అభివృద్ధికి దరిదాపుగా చేరుకోలేని వాస్తవికతను మన ముందుంచుతారు.

తనదైన రుతుధర్మాన్ని క్రమం తప్పక పాటిస్తున్న ప్రకృతిని అటకాయించి అతివృష్టికీ - అనావృష్టికీ దారితీయిస్తున్న పరిస్థితుల్ని విపులీకరించారు ఆర్.ఎస్. రావు. 'కరువు వల్ల నష్టపోయేది చిన్న రైతులు - రైతు కూలీలే' అన్న వ్యాసంలో. పర్యావరణాభివృద్ధి సామ్రాజ్యవాదంతో మమేకమై వినాశనానికి ఎలా హేతువవుతుందీ సాధికారికంగా వివరిస్తారు - కరువుని సైతం భూస్వామ్య వర్గాలు - పాలకవర్గాలు - దళారీ కాంట్రాక్టర్లు ఎలా లాభాలు చేసుకుంటారో సోదాహరణంగా దృశ్యమానం చేస్తారు ఆర్.ఎస్. రావు.

'శాస్త్రవేత్తలు ప్రజల్లోకి రావాలి' అన్న వ్యాసంలో శాస్త్రీయ దృక్పథానికి, సుస్పష్టమైన నిర్వచనాన్ని ఇచ్చి, అది మార్క్సిస్టులలో సైతం కొరవడుతున్న వాస్తవాన్ని విడమర్చి చెప్తారు. జ్ఞానం తమ గుత్తాధిపత్యంగా చెప్పుకునే అగ్రవర్ణాల వారి బారి నుండి పదార్థ విజ్ఞానం అదే భౌతిక శాస్త్ర జ్ఞానం బలం పుంజుకుని మానవ భాషలోకి తర్జుమా అయిపోతే దాని బండారం బైట పడిపోతుందని స్పష్టం చేస్తారు. ఈ విశిష్ట ప్రయత్నం కోసం శాస్త్రవేత్తలు ప్రజల్లోకి రావాలని డిమాండ్ చేస్తారు.

సమకాలీన వ్యవస్థలో 'అభివృద్ధి' ఆకాశమే హద్దుగా విస్తరిస్తుందన్న కుహనా మేధావుల సూత్రీకరణల నేపథ్యంలో, 'అభివృద్ధి వెలుగు నీడలు' అన్న ఆర్.ఎస్. రావు విశ్లేషణ ఓ చెంప పెట్టు. హీరాకుడ్ ప్రాజెక్టు సమిధలైన కుగ్రామాల్లో నేటికీ విద్యుత్ సౌకర్యానికి నోచుకోని వాస్తవాన్ని చెప్తూ, 'దీపపు సెమ్మ చుట్టూ వెల్తురు ఉన్నా, దాని కింద కొంత భాగం అది సృష్టించిన నీడలో ఉండాల్సిందే కదా' అన్న తాత్వికతను ఓ గిరిజనుడు చెప్పిన ఉదంతాన్ని పేర్కొంటారు. 'అభివృద్ధి' ఎంత సులభంగా

అవగత మౌతున్నప్పటికీ, అది సృష్టించే నీడల్ని అర్థం చేసుకోవడంలో అంతే క్లిష్టతా దాగి ఉంటుందని పేర్కొంటారు ఆర్.ఎస్. రావు.

అలాగే 'పర్యావరణం – మార్క్సిస్ట్ దృక్పథం' అన్న వ్యాసంలో 'ప్రకృతి' నిరంతరం మార్పుకు గురవుతూ చలన స్థితిలోనే ఉంటుంది. దీన్ని అధ్యయనం చేయడమే మానవుని జ్ఞాన విస్తరణా లక్ష్యం. ఈ క్రమంలోనే ప్రకృతికి – మానవునికీ వైరుధ్యం తలెత్తుతుందంటారు. ఈ వైరుధ్యం వ్యక్తిగతానికీ, సామాజిక పునాదికీ ఆలంబనగా నిలవాలంటారు. ఈ జ్ఞాన ఫలాలు వ్యక్తిపరం కావడాన్ని ప్రశ్నించాలనీ సూచిస్తారు.

ప్రస్తుతం ఆర్థిక వ్యవస్థ పరిణామ క్రమంలో ఎంతమంది ప్రజలు అలక్ష్యానికి గురౌతున్నారో విశ్లేషిస్తూ, ఈ అలక్ష్య ప్రజానీకమే విజ్ఞాన శాస్త్ర అధ్యయనానికీ, అభివృద్ధి బృందాల పనికీ ప్రేరణగా నిలుస్తారనడం నూటికి నూరు పాళ్లు వాస్తవం. అంతటితో ఆగిపోకుండా పార్లమెంటరీ ఎన్నికలకు ఓటు బ్యాంకులుగా నిలిచేదీ ఈ ప్రజానీకమే అని తేల్చి చెప్పడం ముదావహం. కడకు చరిత్ర నిర్మాణం – రచన సైతం ఈ ప్రజానీకం చుట్టూనే తిరుగుతుందని చెపుతారు. 'అచారిత్రక ప్రజల చరిత్ర రచన' వ్యాసం ఆర్.ఎస్. రావు విశ్లేషణా నైపుణ్యాన్ని, లోతైన పరిశీలనను మనకు పరిచయం చేస్తుంది.

ఈ తరహాలో విద్యా విధానం మీద – సామ్యవాదం మీద హక్కులు, మార్క్సిస్టు లెనినిస్టు ఉద్యమాలు, విప్లవ సంస్కృతి వంటి అనేకానేక సంక్లిష్ట అంశాలపై తనదైన విశ్లేషణను సూటిగా, నిర్ద్వంద్వంగా పేర్కొన్నారు. అన్ని చదవాల్సినవే, చదివి అందులోని తాత్వికతను అలవర్చుకోవాల్సినవే.

అనేకానేక అంశాలపై భిన్న విశ్లేషణలను ఇదివరకు చదివి ఉన్నప్పటికీ, ఆర్.ఎస్. రావు లేవనెత్తిన అంశాలు అత్యంత సహజమైనవిగా, కీలకమైనవిగా అనిపిస్తాయి. పాత ప్రశ్నలకు సమాధానాలు కొత్త రీతిలో చెప్తూనే కొత్త ప్రశ్నలను సంధించడం ఆర్.ఎస్. రావు ప్రత్యేకత. యథాలాపంగా మాటాడుతున్న ధోరణిలోనే చెప్పుకుపోవడం ఆయన సహజశైలి. ఈ యథాలాప ధోరణిలోనే భూసంస్కరణలు. భూస్వామ్య సంస్కృతీ, పర్యావరణం, సామ్రాజ్యవాద విస్తరణ, ఆర్థిక వ్యవస్థ పరిణామం విదేశీ సాంకేతిక పరిజ్ఞానం – మార్కెట్ వ్యవస్థ వంటి అనేక కీలకాంశాలపై 'కొత్తచూపు'ను సంధిస్తారు. ఈ కొత్తచూపు అంతా పేదరైతులు – వ్యవసాయ కూలీలను ఇరుసుగా చేసుకునే సాగుతుంది. సామాజిక ఆలోచన కలవారంతా తప్పక చదవాల్సిన పుస్తకం 'కొత్తచూపు'.

భిన్న అంశాలపై ఈ విశ్లేషణలను ఏర్చికూర్చి పాఠకులకందించిన వీక్షణం పబ్లికేషన్స్ వారు అభినందనీయులు.

*(రచయిత పాత్రికేయులు)* వీ

---

*(... 4వ పేజీ తరువాయి)*

చదవాల్సిన అవసరం ఉంది. ఇలాంటి వ్యాసాన్ని అందరి చేత పనిగట్టుకొని చదివించాలి. 'ఈ ఆకలి పాలక విధానాల సృష్టే' వ్యాసం మన పాలకుల విధానాల డొల్లతనాన్ని చక్కగా వివరించింది.

**– కడియాల సుబ్బనాచారి**
*దుత్తలూరు, నెల్లూరు*

**మ**న దేశంలోనే కాదు. ప్రపంచదేశాలన్నిటా మతం, నమ్మకాలు, తెచ్చిపెట్టుకున్న విశ్వాసాలు వగైరాల ప్రభావంతో వెలసిన సంస్థలు, ట్రస్టులు,ఆలయాలు మొదలైన ధార్మిక సంస్థలు గా చెప్పుకునేవన్నీ చివరకు (మొదలు లో కూడా) వాటికి సంబంధించి పోగుపడిన కోట్లమంది అమాయక భక్తుల విరాళాలు, నిధుల పరిరక్షణ పేరుతో పెద్ద నాయకులతో, అధికారులతో కుమ్మక్కయ్యి, ఆర్థిక నేరాలకు, హత్యోదంతాలకూ, ఇంకా చెప్పనలవి కాని కుంభకోణాలకు పాల్పడుతున్నవి శతాబ్దాలుగా కళ్ళకు కడుతున్న చరిత్ర. ఆదిశంకరాచార్య, మహమ్మద్ ప్రవక్త, బుద్ధుడు, ఏసుక్రీస్తు,శ్రీరామకృష్ణ పరమహంస వంటి మహాత్ములు అప్పటి దీనజన విముక్తికోసం, జ్ఞానం పట్ల వారిని జాగృతం చెయ్యడం కోసం కృషి చేస్తే, చుట్టూ చేరిన ప్రజాద్రోహులు, సామ్రాజ్యవాదులు, పాలకులు మహాత్ములకు అండదండగా ఉన్నట్టు నటిస్తూ, మందిరాలు కట్టి, విగ్రహాలు పెట్టి, శిలవేసి ప్రజాబాహుళ్యానికి అందకుండా చేసి, లేనిపోని మహత్తులను, మత్తులను అంటగట్టి, వారి ఉన్నతాశయాల్ని మూఢనమ్మకాలుగా తర్జుమా చేసేసి ప్రజల్ని అసలు జ్ఞానం వైపుకు మళ్లకుండా మూర్ఖంగానే ఉంచి, బానిసత్వాన్ని కొనసాగించే కుట్రలే చరిత్ర మొత్తం కనిపిస్తున్న దాఖలాలు. ఇప్పుడు మహాత్ముల పర్వం ముగిసినట్టనిపిస్తోంది. మతం ముసుగులో అవే మూఢనమ్మకాల్ని మరింత సాంకేతికత జోడించి వాడుకుంటూ వారే సొంత సామ్రాజ్యాలు నెలకొల్పుకొనే స్థాయికి స్వాములు,అమ్మలు, బాబాలుగా పరిణతి చెందారు. ప్రజలు కూడా తమను తాము తెలుసుకొనే ప్రయత్నం చెయ్యకుండా పూర్తి ఆర్థికపరమయిన అంశంగా లాభాల కోరికలతో కొంతమంది, బాధల అసలు కారణం కనుక్కోలేక వీళ్ళ దగ్గరే పరిష్కారం వెతుక్కునే కొంతమంది అమాయకులు కలిసి జేజేలు కొట్టుకుంటూ కొండనక, ఎండనక వారి వెంటబడడం– వారేమో దొంగ వేషధారణలతో భక్తులకు మాత్రం వర్తించే నియమాలను పెట్టి, నిండిన బొక్కసంతో ఏ సి మందిరాలలో స్పెషల్ భక్తులకు స్పెషల్ దర్శనం, ప్రయివేటు ఉపదేశాలు సంభాషణలు – ఎందుకిలా? ఆశ్రమంలోనే నలుగురి కాల్చివేత (హత్యలు), నిగమాగమ ప్రారంభసంరంభంలో జారిన గొలుసుల మహత్తులు వంటి సంఘటనల తరువాత పాపపరిహారంగా చేసిన మంచినీటి వసతి,విద్య,వైద్య సేవలు అందరికీ విదితమే! ఇక్కడ అసలు వైచిత్రి ఏమిటంటే ప్రభుత్వం చెయ్యాల్సిన పనులను ఈ మతసంస్థలు తలకెత్తుకోవడం. మతాతీత గణతంత్ర రాజ్యాంగ రక్షకులేమో ఆశ్రమాలలో పాదాభివందనాలు, పోలీసు రక్షణలు! ఏమి జరుగుతోందసలు?

'మనం' ఏమిటో 'ఆదాని' నుంచి పారిపోవడానికి ఉపయోగించుకున్నంత కాలం దేవుడు, తాగుడు స్థాయి ఒక్కటే. ఒక మహానుభావుని పలుకు. ఆయనను ఈ రొంపిలోకి దించదలుకున్నా సందర్భంగా గుర్తొచ్చి రాసేశాను.

మళ్ళీ అసలు విషయానికి వస్తే, సాక్షాత్తూ భగవాన్ కి వైద్య సేవలందించ డానికి తుచ్ఛ మానవుల అవసరం ఉంటుందా? ప్రభుత్వ, పోలీసు వలయాలు ఎందుకు అక్కడ? మీడియా కథనాలు ఈ రోజు కొత్తగా శోధించిన వేమున్నాయి? మనసు తెరిచి చూసుకుంటే అందరికీ అంతా స్పష్టమే. అక్కడ చేరినవాళ్ళు అప్పటికే బలిసి పులిసి ఉన్నవాళ్ళు ఒకరకం. అమాయక భక్తులొక రకం. ఇప్పుడు జరుగుతున్న అసలు వ్యవహారమంతా డబ్బు,ఆస్తులు,ట్రస్టు, బిల్డింగులు, భూమి పుత్రా, నగా నట్రా వాటిలో వాటాలు, పంపకాలు, తరలింపులు, బుజ్జగింపులు, పందేరాలు : ఇక చెప్పలేనంత. ఇలాంటి సంస్థల పుట్టుకే ఇదయినప్పుడు, ముగింపు కూడా ఇలాగే ఉంటుంది. ఎటొచ్చీ అమాయక భక్తుల్ని మినహాయిస్తే, అక్కడ చేరిన, చేరుకుంటున్న వాళ్ళంతా ఎంతటివారయినా తుచ్ఛులే! దొంగలే!

ఆలోచించవలసింది సామాన్యులు, మేధావులు మాత్రమే! ప్రతీ దానికి అన్నలో, అన్నా హాజరేలో వస్తారని ఎదురు చూడడం అవివేకం, బాధ్యతా రాహిత్యం. ఈ అవ్యవస్థల్ని సమూలంగా నాశనం చేసే వ్యక్తులెవరైనా సరే! అసలంటూ పూనుకుంటే ,భావి తరాలను కాపాడినవారవుతారు.

**– రాజా**
*http://gksraja.blogspot.com* వీ

*ఐక్య రాజ్య సమితి మానవాభివృద్ధి సూచీని రూపొందించడంలో అనేక కొత్త అంశాలను కూడా పరిగణనలోకి తీసుకుందని అంటున్నారు* **చీకోటి శ్రీనివాస్**

# మానవాభివృద్ధి నివేదిక

ఆర్థికాభివృద్ధి పరంగా ప్రపంచ దేశాల మధ్య, దేశంలో వివిధ వర్గ ప్రజల మధ్య గల తారతమ్యాలను మరింత లోతుగా, సమగ్రంగా అధ్యయనం చేసే దిశగా అభివృద్ధి కొలమానాల ప్రమాణాలలో విప్లవాత్మక మార్పులను జోడించి ఐక్యరాజ్య సమితి అభివృద్ధి కార్యక్రమం (యు.ఎన్.డి.పి.) తన 20వ వార్షిక నివేదికగా మానవాభివృద్ధి నివేదిక 2010ని విడుదల చేసింది. విద్య, ఆరోగ్య ప్రమాణాలు, జాతీయాదాయ ప్రగతి, ఉత్పత్తి, వినియోగ సంబంధిత అసమానతలను లోతుగా అధ్యయనం చేసేందుకు సాంప్రదాయ సూచికలకు అదనంగా మూడు నూతన కొలమానాలతో పాటు ప్రతి ఏడాదికి బదులు ప్రతి ఐదేళ్లకొకసారి ర్యాంకింగ్ పద్ధతిని ప్రవేశపెట్టి తద్వారా తులనాత్మకంగా వాస్తవ పరిస్థితుల అంచనాకు శ్రీకారం చుట్టింది.

మానవాభివృద్ధి సూచిక భావనను రూపకల్పన చేయడంలో పాకిస్తాన్ ఆర్థికవేత్త మహబూబ్ – ఉల్ – హక్, భారత ఆర్థికవేత్త, సంక్షేమ ఆర్థికవేత్త, నోబుల్ బహుమతి గ్రహీత అమర్త్యసేన్ కీలకపాత్ర పోషించారు. ఆయుఃప్రమాణం, వయోజన అక్షరాస్యతరేటు, తలసరి స్థూల దేశీయోత్పత్తి ఆధారంగా రూపొందించిన మానవాభివృద్ధి నివేదికను ఐక్యరాజ్య సమితి అభివృద్ధి కార్యక్రమం మొట్టమొదటిసారిగా 1990లో విడుదల చేసింది.

**మానవాభివృద్ధి కొలమానం**

| సూచిక | గరిష్ట విలువ (సంవత్సరాలు) | కనిష్ట విలువ (సంవత్సరాలు) |
|---|---|---|
| ఆయుఃప్రమాణం | 85 | 25 |
| వయోజన అక్షరాస్యతరేటు | 100 | 0 |
| స్థూల నమోదు నిష్పత్తి | 100 | 0 |
| తలసరి స్థూల దేశీయోత్పత్తి | 44,000 | 1000 |

యు.ఎన్.డి.పి. తన 2010 – మానవాభివృద్ధి నివేదికలో కొత్తగా మూడు సూచీలను ప్రవేశపెట్టి అభివృద్ధిని, అసమానతలను మరింత విపులీకరించడానికి దోహదపడే పరిస్థితులను సృష్టించింది.

మానవాభివృద్ధి సూచీ, ఇంటర్నేషనల్ హ్యూమన్ డెవలెప్‌మెంట్ ఇండెక్స్ (ఐ.ఎచ్.డి.ఐ.)ల మధ్య గల వ్యత్యాసాల ఆధారంగా దేశంలోని విద్య, ఆరోగ్యం, ఆదాయ అసమానతలను సమగ్రంగా పరిశీలించడం సాధ్యమవుతుంది. ఎచ్.డి.ఐ. విలువ ఐ.ఎచ్.డి.ఐ. సమానంగా ఉంటే దేశంలో పరిపూర్ణ సమానతలు ఉన్నట్లుగా, ఎచ్.డి.ఐ. విలువ కన్నా ఐ.ఎచ్.డి.ఐ. విలువ తక్కువగా ఉంటే అసమానతలు పెరుగుతున్నట్లుగా, ఎచ్.డి.ఐ. విలువ కన్నా ఐ.ఎచ్.డి.ఐ. విలువ అధికంగా ఉంటే అసమానతలు తగ్గుతున్నట్లు తెలియజేస్తూ ఈ సూచీ ద్వారా 139 దేశాల తులనాత్మక అధ్యయనం చేపట్టింది. 0.62గా ఉన్న ప్రపంచ మానవాభివృద్ధి సూచీ ఐ.ఎచ్.డి.ఐ. అధ్యయన ప్రభావం వల్ల 0.49కి తగ్గి 22 శాతం నష్టాన్ని పొందినట్లు 2010 నివేదిక వెల్లడించడం కచ్చితత్వ అంచనాలకు తార్కాణం. అసమానతల సమ్మిళిత మానవాభివృద్ధి సూచీలో 0.876 విలువతో నార్వే దేశం మొదటి స్థానాన్ని పొందింది.

ప్రపంచదేశాల స్త్రీ, పురుషుల మధ్య లింగ సంబంధిత అసమానతలను అధ్యయనం చేయడం ద్వారా మానవాభివృద్ధి పంపిణీలోని అసమానతలను గుర్తించడానికి ఈ కొలమానం దోహద పడుతుంది. ఈ సూచీ విలువ అధికంగా ఉంటే మానవాభివృద్ధిలో ఎక్కువ అసమానతలున్నట్లు, తక్కువగా ఉంటే అసమానతలు తగ్గుతున్నట్లు తెలియజేస్తుంది. ఈ సూచీలో 0.174 విలువలో నెదర్లాండ్ మొదటి స్థానం పొందగా, డెన్మార్క్, స్వీడన్, స్విట్జర్లాండ్ తర్వాతి స్థానాలు పొందాయి. అత్యధిక లింగ అసమానతలు యెమెన్‌లో అత్యల్ప అసమానతలు నెదర్లాండ్‌లో ఉన్నట్లు 2010 నివేదిక వెల్లడించింది.

పేదరికంతో పాటు కనీస జీవన ప్రమాణాలు, పాఠశాలలు, రక్షిత మంచినీరు, నాణ్యమైన ఆరోగ్య సంరక్షణ సౌకర్యాల లభ్యతను కూడా ప్రామాణికంగా తీసుకొని సమగ్ర పేదరిక అధ్యయనం కోసం ఈ బహుముఖ పేదరిక సూచీని యు.ఎన్.డి.పి. తన 2010 నివేదికలో ప్రవేశపెట్టింది. 104 దేశాలకు వర్తింపజేసి తయారు చేసిన ఈ సూచీ ప్రకారం, అంచనా వేసిన దేశాలలో మూడో వంతు ప్రజానీకం పేదరికంలో మగ్గుతున్నట్లు, పద్నాలుగు కోట్ల నలభై లక్షల మంది ప్రజలు రోజుకు సగటున 1.25 డాలర్ల కంటే తక్కువ వినియోగ వ్యయంతో జీవిస్తున్నట్లు వెల్లడి కావడమే కాకుండా ఈ దేశాలలో అత్యల్ప స్థాయి ఆరోగ్యం, విద్య, జీవన ప్రమాణాలున్నాయని ముప్పై శాతం అధ్యయనాలు వెల్లడించాయి.

మానవాభివృద్ధి నివేదిక 2010 ప్రకారం, భారతదేశం 0.519 విలువతో 119వ స్థానంలో ఉంది. మన దేశంలో సగటు ఆయుః ప్రమాణం 64.4 సంవత్సరాలు, స్థూల దేశీయోత్పత్తి 3337 డాలర్లుగా నమోదయింది. అసమానతల సమ్మిళిత మానవాభివృద్ధి సూచీలో 0.365

*స్వాతంత్ర్యం వచ్చి ఆరు దశాబ్దాలు గడిచినా అక్షరాస్యత వంద శాతం దరిదాపులకి కూడా చేరలేదని అంటున్నారు*

**ఎం. సంజీవరెడ్డి, ఎం. రాజేందర్ రెడ్డి**

# విద్యా హక్కు చట్టం 2009

మనదేశంలో ఏప్రిల్1, 2010 నుండి విద్యా హక్కు చట్టం అవలులోకి వచ్చింది. ఈ చట్టం ఉచిత, నిర్బంధ విద్యపట్ల బాల బాలికలకున్న హక్కు 2009 అనే పేరిట విద్యా హక్కు చట్టం ఆరు నుండి పద్నాలుగు హక్కుగా చేసింది. మన దేశంలో బడికి దూరంగా ఉన్న సుమారు 1.80 లక్షల మంది బడి ఈడు పిల్లలకు ఈ చట్టం వల్ల మేలు కలుగుతుంది. అదే సమయంలో విద్యను హక్కుగా చేసిన ప్రపంచ దేశాలలో మన దేశం 135వ స్థానంలో ఉంది. ఈ చట్టంవల్ల 1వ తరగతి నుండి 8వ తరగతి వరకు చదువుకోవడాన్ని ప్రాథమిక హక్కుగా చేసింది. మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చి 62 సంవత్సరాలు గడిచినా కూడా అక్షరాస్యత వందశాతం దరిదాపులోకి కూడా వెళ్లలేక పోవడం ఈ చట్టం చేయడానికి ఒక కారణంగా చెప్పవచ్చు.

అనేక చారిత్రక దశలను అధిగమించి ఎలిమెంటరీ విద్య 2009 నాటికి రాజ్యాంగ బద్ధమైన ప్రాథమిక హక్కుగా మారింది. బ్రిటిష్ వలస ప్రభుత్వం ఏర్పాటు చేసిన భారత విద్యా కమిషన్ (హంటర్ కమిషన్) కు మహాత్మా జ్యోతిరావు పూలే క్రి. శ. 1886లో బ్రిటిష్ ఇండియాకు ఒక మెమోరాండం సమర్పిస్తూ దేశంలోని కులీన వర్గాల విద్యా ప్రయోజనాలను ఈడేర్చడం కొరకే ప్రభుత్వ విద్యారంగం పాటు పడుతున్నదని విమర్శించి దళిత, బలహీన వర్గాలు విద్యపైకి ఎక్కువ దృష్టి సారింపచేసే ప్రయత్నం చేశారు. ఇంపిరియల్ లెజిస్లేటివ్ అసెంబ్లీలో క్రీ.శ. 1911లో గోపాలకృష్ణ గోఖలే ఎలిమెంటరీ ఎడ్యుకేషన్ బిల్లును ప్రవేశపెట్టారు. కాని అసెంబ్లీలో ఉన్న సభ్యులు దేశంలోని పరిస్థితులు ఆ బిల్లుకు అనుకూలంగా లేవని బిల్లును తిరస్కరించారు. భారత చట్టం 1935 ప్రకారం జరిగిన ఎన్నికల్లో రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. గాంధీ నయా తాలమ్ (బేసిక్ ఎడ్యుకేషన్) అమలు చేయాలని కోరగా బ్రిటిష్ (వైస్రాయ్) వారు అవసరమైన నిధులు ఇవ్వలేని కారణంగా ఈ చట్టం ఆనాడు అమలులోకి రాలేదు. ఆనాటి బూర్జువా నాయకులు కూడా దీనిపై దృష్టి సారించలేదు.

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత 14 ఏళ్ల వయస్సు నిండే వరకు దేశంలోని బాల, బాలికలందరికి నిర్బంధోచిత విద్యను అందించాలనే ఆర్టికల్ 45కు మన రాజ్యాంగ నిర్మాతల పట్టుదలే కారణం అని చెప్పవచ్చు. 1980 దశకంలో వచ్చిన ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో వచ్చిన మార్పుల కారణంగా నిరక్షరాస్యత తగ్గించినప్పుడే దేశం అన్ని రంగాలలో ముందుకు వెడుతుంది. అందులో భాగంగానే 'ఆపరేషన్ బ్లాక్ బోర్డ్' 8 మొదలుకొని విద్యా హక్కు చట్టం వరకు పథకాలు ప్రవేశపెట్టింది.

క్రీ. శ. 1993 సంవత్సరంలో జీవించె హక్కు కేసులో భారత సుప్రీంకోర్టు సంచలనమైన తీర్పునిస్తూ విద్యా హక్కు జీవించే హక్కులో ఇమిడి ఉందని, విద్య లేకుండా జీవించే హక్కుకు అర్థం లేదని అందువల్ల దేశంలోని బాలబాలికలు 14 ఏళ్ల వయస్సు తరువాత కూడా విద్య హక్కు ఉంటుందని నొక్కి చెప్పారు. సుప్రీంకోర్టు తీర్పు ప్రకారం తపస్ మజార్ కమిటీ రానున్న పదేళ్ల కాలంలో రు. 1,37,000 కోట్ల ఖర్చు పెట్టాలని సిఫారసు చేయడం జరిగింది. విద్యా హక్కు చట్టం 2009 ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యకు బాలల హక్కు చట్టం 2009 (135/ 2009) అనే పేరుతో పార్లమెంట్ చట్టం చేసింది. ఈ చట్టం ఆగస్టు 26, 2009న కేంద్ర ప్రభుత్వం గెజిట్‌లో ప్రచురింప బడింది. 6-14 సంవత్సరాల మధ్యనున్న బాలబాలికలు విద్యకు ప్రాథమిక హక్కుగా పేర్కొన్న ఈ చట్టం 1 తరగతి నుండి 8 తరగతి విద్య ఎలిమెంటరీ విద్యగా నిర్వహించి ఈ ఎలిమెంటరీ విద్యను ఉచితంగా నిర్బంధంగా ఇవ్వడానికి ఉద్దేశించింది.

6-14 మధ్య పిల్లలందరు బడిలో చేరి ఉచితంగా

---

విలువ, బహుముఖ పేదరిక సూచీలో 0.296 విలువతో పాటు లింగ సంబంధిత అసమానతల సూచీలో 0.748 విలువతో 122వ స్థానంలో ఉన్నట్లు వెల్లడైంది. అంతే కాకుండా మన దేశంలో పురుషుల్లో 66 శాతం, స్త్రీలలో 60 శాతం సాధికారత సాధించినట్లు 2010 నివేదిక స్పష్టం చేసింది.

విద్య, ఆరోగ్యం, పేదరికం, అక్షరాస్యత రేటు, తలసరి ఆదాయాలే కాకుండా మారుతున్న సమాజ అవసరాలకు అనుగుణంగా పర్యావరణం, సుస్థిర అభివృద్ధి, రాజకీయ సాధికారత, లింగ వివక్ష వంటి వర్తమాన అంశాలను అధ్యయనం నిమిత్తం పరిగణనలోకి తీసుకోవడం ప్రపంచ ఆర్థిక వ్యవస్థ సమగ్ర అధ్యయనంలో ఐక్యరాజ్య సమితి కార్యక్రమం తన 2010 - మానవాభివృద్ధి నివేదికతో నూతన శకానికి నాంది పలికిందని భావించవచ్చు. భవిష్యత్‌లో కూడా అభివృద్ధి చెందుతున్న దేశాలు ఎదుర్కొంటున్న వివిధ సవాళ్లను అధ్యయనం చేసి సంబంధిత ప్రభుత్వాలకు సూచనలను, పరిష్కారాలను యు.ఎన్.డి.పి. అందిస్తుందని ఆశిద్దాం.

*(రచయిత అర్థశాస్త్ర ఉపన్యాసకులు)* వీ

చదువుకోవడానికి ఉద్దేశించిన చట్టం 'ఉచిత నిర్బంధ విద్యకు బాలల హక్కు చట్టం–2009'. 2009 ఆగస్టు 27వ తేదీన పార్లమెంట్ ఆమోదించింది. దీనినే ఆర్.టి.ఇ. అని కూడా అంటారు. 6–14 మధ్య పిల్లలందరూ పరిసర ప్రాంత పాఠశాలల్లో విద్య (1–8 తరగతులు) పూర్తి చేసేంత వరకు ఉచిత, నిర్బంధ విద్య పొందే హక్కు కలిగి ఉంటారు.

పాఠశాలల ఏర్పాటు బోధన పరికరాలతో సహా మౌలిక సదుపాయాలను కల్పించడానికి ప్రభుత్వం ఒప్పుకొంది. మూడు సంవత్సరాలు నిండిన బాలలను ప్రాథమిక సంసిద్ధులను చేయడానికి ఉచిత పూర్వ పాఠశాల విద్యను అందించడానికి అవసరమైన ఏర్పాటు చేపడుతుంది. ఏయిడెడ్ పాఠశాల, అన్ ఎయిడెడ్ పాఠశాలల్లో చేర్చుకున్న పిల్లలు కనీసం 25 శాతానికి తగ్గకుండా ఒకటవ తరగతి పేద పిల్లలను చేర్చుకోవాలి. ఎలమెంటరీ వరకు ఉచితంగా విద్యనందించాలి. అందుకయ్యే ఖర్చును అన్ ఎయిడెడ్ పాఠశాలకు రాష్ట్ర ప్రభుత్వం చెల్లిస్తోంది. బడి పిల్లల ప్రవేశం, ఎంపిక విధానం క్యాపిటేషన్ రుసుం ఉండదు. ఒకవేళ క్యాపిటేషన్ ఫీజు రుసుం వసూలు చేస్తే దానికి 10 రెట్ల వరకు జరిమానా విధించడం జరుగుతుంది.

బాలలను శారీరకంగా శిక్షించడం, మానసికంగా శిక్షించడం నేరం. ఈ విధంగా ప్రవర్తించే వారిపై చర్యలు తీసుకుంటారు. సంబంధిత అధీకృత సంస్థ నుండి గుర్తింపు, ధృవీకరణ పత్రం లేకుండా పాఠశాలను ప్రారంభించరాదు. ఈ చట్టం ప్రకారం 'నియమాలు' ప్రమాణికాలు పూర్తి చేసి పాఠశాల సంబంధిత అధికృత సంస్థ నుండి గుర్తింపు ధృవీకరణ పత్రం జారీ చేయరాదు. ఒకవేళ ఇప్పటికీ నడుస్తున్న పాఠశాలల్లో ప్రమాణాలు సరిగ్గా లేకున్నా చట్టం అమలులోకి వచ్చిన 3 సంవత్సరాలలోపు ఖర్చులతో ఏర్పాటు చేయాలి. ఇలా సరైన ప్రమాణాలు, నియామకాల ప్రకారం లేకుంటే పాఠశాల గుర్తింపు రద్దు చేయాలి. గుర్తింపు రద్దు అయిన తరువాత కూడా పాఠశాల నడిపితే 10 వేల నుండి 1 లక్ష వరకు జరిమాన విధిస్తారు. ప్రైవేట్ అన్ ఎయిడెడ్ పాఠశాలలు అన్ని పాఠశాలల్లో స్థానిక ప్రభుత్వానికి ఎంపికైన ప్రజా ప్రతినిధులతో ఆ పాఠశాలల్లో చదువుతున్న పిల్లల తల్లిదండ్రులు లేదా పరిరక్షకులతో నిర్వహిస్తుంది. నిర్ధారించిన కనీస అర్హతలు ఉన్న వారిని ఉపాధ్యాయులుగా నియమించాలి.

ఉపాధ్యాయులు సమయపాలన పాటించడం సకాలంలో పాఠ్యాంశాలు బోధించడం, పిల్లల సామర్థ్యాలను అంచనావేయడం. తల్లిదండ్రులతో క్రమం తప్పకుండా సమావేశాలను నిర్వహించడం పిల్లల ప్రగతి గురించి సమాచారం ఇవ్వడం వంటి విధులను నిర్వహించాలి. ఏ ఉపాధ్యాయుడు కూడా ప్రైవేట్ ట్యూషన్లు, ప్రైవేట్ బోధన పనులను చేపట్టరాదు.

జనాభా గణన, వైపరీత్య సహాయ విధులు, ఎన్నికలకు సంబంధించిన విధులు మినహాయింపు – టీచర్లను ఏ ఇతర విద్యేతర పనులకు పంపకూడదు. 1 నుండి 5 తరగతులు బోధించడానికి ప్రతి తరగతికి ఒక ఉపాధ్యాయుడితో పాటు సైన్స్, లెక్కలకు ఒక ఉపాధ్యాయుడు, సామాన్య/సాంఘిక శాస్త్రానికి ఒక ఉపాధ్యాయుడు, భాషలు బోధించడానికి ఒక్కొక్క భాషకు కూడా ఒక ఉపాధ్యాయుడు ఉండాలి. 6 నుండి 8వ తరగతి వరకు చేర్చుకున్న పిల్లల సంఖ్య వందకు మించి ఉంటే పూర్తికాలం తాత్కాలిక బోధకులను నియమించాలి. అన్ని పాఠశాలలు ప్రతి టీచరుకి ఒక తరగతి గది, ప్రధానోపాధ్యాయుడికి ఒక గది, వంట గది, మంచి నీటి సౌకర్యం, ఆడ పిల్లలకు, మగ పిల్లలకు వేర్వేరుగా మరుగుదొడ్లు, ఆట స్థలం, ప్రహరీగోడ లేదా కంచె, గ్రంథాలయం వంటి సౌకర్యాలు ఉండాలి. క్రీడా సామాగ్రి, ఆట స్థలం ఉండాలి.

ఈ చట్టం పై భిన్నాభిప్రాయాలు : ఈ చట్టం అమలు అయినా కూడా ఈ చట్టంలోని కొన్ని అంశాల్లో లోపాలు ఉన్నాయి. సామాజిక వేత్తలైన ప్రొ. హరగోపాల్, జీవన్ కుమార్, బుర్రా రాములు వంటి వారి అభిప్రాయాల ప్రకారం 1964–66 నాటి కొఠారీ కమిషన్ సూచించిన 'కామన్ స్కూల్' విధానాన్ని ఈ హక్కులో చేర్చాలని, అంతే కాకుండా 0–5 సంవత్సరాల మధ్య పూర్వ ప్రాథమిక విద్యను ప్రభుత్వాలు ఈ చట్టం నుంచి తప్పించాయని వారి వాదన. ఎయిడెడ్, అన్ ఎయిడెడ్ పాఠశాలల్లో తమ పాఠశాలలో చేర్చుకున్న పిల్లల్లో కనీసం 25 శాతం తగ్గకుండా పిల్లలను చేర్చుకోవడం అనేది ప్రభుత్వ పాఠశాలలను మూసివేయడమేనని సామాజికవేత్తల వాదన.

విద్యాహక్కు చట్టం కావలసిన నిధులు: కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన విద్యా హక్కు చట్టాన్ని రాష్ట్రంలో అమలు చేయడానికి వచ్చే ఐదేళ్లకు 16 వేల కోట్లు అవసరమని రాష్ట్ర ప్రభుత్వం అంచనా వేసింది. 1 నుండి 8 వ తరగతి వరకు చదివే విద్యార్థులను దృష్టిలో పెట్టుకొని విద్యా హక్కు చట్టానికి 16 వేల కోట్ల రూపాయలకు అంచనా వేయబడింది. 65 లక్షల మంది విద్యార్థులు 86,768 ప్రభుత్వ పాఠశాలల్లో చదువుతున్నారు. విద్యా హక్కు చట్టం అమలులో భాగంగా ప్రతి పాఠశాలలో 4.5 లక్షల రూపాయల వ్యయంతో అదనపు గదిని నిర్వహించాలి. వికలాంగుల కోసం ర్యాంకు రైలింగ్ ఏర్పాటు చేయాలి. ఇంకా మంచినీటి సదుపాయం, మరుగుదొడ్ల నిర్మాణం, ప్రహరీగోడ, వంట గదులు, విద్యార్థుల యూనిఫాం (ఉచితంగా), పుస్తకాలు ఇచ్చేందుకు రు. 1953 కోట్లు అవసరం. ఇవి కాకుండా విద్యా ప్రమాణం పెంపు, ఉపాధ్యాయులకు గ్రాంట్, గ్రంథాలయాలకు పుస్తకాలు సమకూర్చడం లాంటివి అవసరం. అయితే వీటిని సమకూర్చడం అసాధ్యం అని విద్యావేత్తల వాదన. అనేక పార్శ్వాలుగా ఉన్న సామాజిక జీవితంలో విద్య కీలకమైంది. విద్య ఎందుకు అవసరం? సంపదను ఉత్పత్తి చేసే నైపుణ్యం మనుషులకు ఇచ్చేదే ఈ విద్య. మానవ సంబంధాలను అర్థవంత రీతిలో కొనసాగించడంలో విద్య పాత్ర చాలా ఉంది. ప్రజలకు నిజంగా ఉపయోగపడగల విద్యారంగం గురించి మనం ఆలోచించాలి. సామాజిక అంతరాలు లేని, పేదలు, సంపన్నులు ఒక రకమైన వసతులతో చదువుకోగలగాలంటే 'కామన్ స్కూల్' విద్యావిధానం అమల్లోకి రావాలి. బడ్జెట్‌లలో విద్యారంగానికి కనీసం 6 శాతం నిధులను కేటాయించాలి. రాష్ట్ర ప్రభుత్వం తమ నిధులను 30 శాతం కేటాయించాలి. +2 స్థాయి వరకు బాల బాలికలకు ఉచితంగా విద్యను అందించాలి. అదే విధంగా చదువుకున్న వారికి ఉద్యోగాల విషయాలలో ప్రాధాన్యత ఉండాలి. ఒక తరగతి గదికి ఒక ఉపాధ్యాయుడు ఉండాలి. మధ్యాహ్న భోజన పథకం మరింత విస్తరించాలి. విద్యా వ్యాపారం అరికట్టాలి. సామాజిక అంతరాలకు తావులేని ఒకే రకమైన అవకాశాలతో వసతులతో చదువుకోగలిగితే కామన్ స్కూల్ ఉండాలి. నిధుల కేటాయింపు కొరకు అన్ని విధాల ప్రయత్నం చేయాలి.

*(రచయితలు అసిస్టెంట్ ప్రొఫెసర్, రీసెర్చ్ స్కాలర్*
*కాకతీయ విశ్వవిద్యాలయం)*

వీ

*భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వాపరాల చరిత్రను వివరిస్తున్నారు*

**ఎస్. సరళా వందనం**

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన - 6

*(గత సంచిక తరువాయి...)*

**కొ**న్ని శతాబ్దాల నుంచి వస్తున్న జమీందారీ, జాగీర్దారీ, సైన్యాధికారులు, చిన్న చిన్న రాజుల ఆధీనంలో తరతరాల నుంచి పని చేస్తున్న రెవెన్యూ యంత్రాంగం తమపాలనకు అడ్డుగా ఉంటుందని ఈస్ట్ ఇండియా కంపెనీ భావించింది. ఈ రెవెన్యూ యంత్రాంగం పాత జమీందార్లకు, తదితరులకు అండగా ఉండి తమ రాజకీయ ప్రాబల్యానికి, ఆదాయానికి అడ్డుగా రావడానికి అవకాశం లేకుండా ప్రభుత్వం అధికారుల (అధికార దుర్వినియోగం) క్రమబద్ధీకరణ చట్టంను 1822లో చేశారు. 1802 నుండి భూముల పై కొత్తగా రిజిస్ట్రేషన్‌లు జరగడం, మిలిటరీ అధికారుల ఆధీనంలోని భూమిని క్రమబద్ధీకరించడం, జమీందార్లు తమ ఆధీనంలోని భూమికి శిస్తును క్రమబద్ధంగా కట్టని పక్షంలో వీళ్లందరి దగ్గర నుంచి భూమి స్వాధీనం చేసుకోవడం జరిగింది. ఇది నిరంతర ప్రక్రియగా మారి ప్రభుత్వ ఆధీనంలోకి కొత్తగా వచ్చిన భూములను పంపిణీ చేయడం, వాటిపై అధికారాన్ని తిరిగి ప్రజలకు కొత్తగా కల్పించడం, జమీందారీ, పాలెగాళ్ల పన్ను వసూలు చేసే వ్యవస్థ రద్దు చేయడం వలన ఉత్పన్నం అయ్యే తగాదాలను పరిష్కరించడానికి గాను తమ ఆధీనంలో రెవెన్యూ కోర్టులు ఉండాలని బ్రిటిష్ వారు భావించారు. అందుకే మద్రాసు కలెక్టర్ల, సబ్ కలెక్టర్ల క్రమబద్ధీకరణ చట్టం VII ను తీసుకొచ్చి కలెక్టర్లకు, సబ్ కలెక్టర్లకు భూ తగాదాలు తీర్చే అధికారాన్ని సంక్రమింపజేశారు. అప్పట్లో గ్రామాధికారి ఉద్యోగం వారసత్వంగా రావడం కోసం వారసులు ఒకరి కన్నా ఎక్కువ ఉండడంతో చాలా ఎక్కువ పోటీ ఉండేది. ఇందులో వచ్చే తగాదాలను పరిష్కరించ డానికి 1831లో 'గ్రామాధికారుల వారసత్వ క్రమబద్ధీకరణ చట్టం' చేశారు. ఈ చట్టం ప్రకారం బ్రిటిష్ వారు గ్రామాధికారుల బదిలీ పద్ధతిని రద్దుచేసి, వంశపారంపర్యంగా నియమించే ఆనవాయితీని పునరుద్ధరించి, హిందూ ధర్మ శాస్త్రం ప్రకారం ఆస్తిని, ఇతరత్రా ఏ విధంగా పంచుకుంటారో అదే పద్ధతిలో గ్రామాధికారులను కూడ నియమించారు.

థామస్ మన్రో 1821లో గవర్నరు జనరల్‌గా మళ్లీ నియమింపబడి వచ్చిన తరువాత తను ఇంతకు ముందు 1807లో సిఫారసు చేసిన భూమిశిస్తు క్రమబద్ధీకరణను అమలులోకి తీసుకొచ్చాడు. మెట్ట భూములకు పండిన పంటలో నాలుగో వంతు శిస్తును (25 శాతం అంటే చాందాయి), తోటలకు మూడో వంతు శిస్తును (తీజాయి అంటే 33 శాతం), ప్రభుత్వ నీటి పారుదల కింద వ్యవసాయం చేసుకొనే వాళ్లకు కూడా వారు పండించిన పంటలో 33 శాతం పన్నుగా వసూలు చేయాలని నిర్ధారించాడు. ఇదే పన్ను వసూలు విధానం థామస్ మన్రో తరువాత సెటిల్‌మెంట్ జరిగేవరకు అంటే 1873 వరకు కొనసాగింది. థామస్ మన్రో సాగుచేసే విస్తీర్ణాన్ని బట్టి రైతుల దగ్గర నుండి శిస్తు వసూలు చెయ్యాలని ప్రామాణికంగా పెట్టుకున్నాడు. ఇందుకోసం 1821 నుంచి 1825 వరకు భూ సర్వే 'పైమాష్' పద్ధతి ద్వారా జరిపించాడు. ఈ పద్ధతి ద్వారా 24 అడుగుల గొలుసుకల భూమిని కొలిచి ఆ విస్తీర్ణానికి ఒక నెంబరు ఇచ్చి, ఒక వ్యక్తి ఆధీనంలో ఉన్న భూమిని ఉత్తర దక్షిణ తూర్పు పడమరల చుట్టు కొలతను చూపిస్తూ, ఒక ఉలిపిరి కాగితం పై ఆ మొత్తం భూమి ఆకారాన్ని గీసేవారు. కాని భవిష్యత్తులో ఈ సర్వే పటాలలో సదరు భూమికి చుట్టు పక్కల ఏముందో గుర్తుపెట్టకపోవడం వలన అవి పనికి రాకుండా పోయాయి.

బ్రిటిష్ వారు రాజ్యాధికారం సాధించడం కోసం పరిపాలనపై పూర్తి పట్టు కోసం తమ అధికార కేంద్రీకరణకు దీని ద్వారా తమకు సమకూరే ఆదాయనికి అడ్డుగా ఉన్న వాటన్నింటినీ తొలగించుకోవడం కోసం రాష్ట్రంలో ముందుగా 1786 నుంచి రకరకాల చట్టాలు చేయడం మొదలుపెట్టారు. వాళ్లకు ఆదాయం రావడానికిగాను చేసిన చట్టాలలో తమకు అడ్డుగా ఉన్నవాటిని సవరించడానికి సవరణలు కూడా చేశారు. 1822లో చేసిన రెవెన్యూ అధికారుల దుర్వినియోగ చట్టంలో ఉన్న లోపాలను సవరిస్తూ తిరిగి 1823లో రెవెన్యూ అధికార దుర్వినియోగ క్రమబద్ధీకరణ (సవరణ) చట్టాన్ని చేశారు. భారతదేశాన్ని పాలించిన ఇతర పాలకులు (స్వదేశీ, విదేశీ) అనేక లోపాలతో పరిపాలించారని బ్రిటిష్ వారు ఏ లోపాలు లేని పాలన అందించారని చాలామంది భావిస్తుంటారు. కాని వాళ్ల పరిపాలనలో లోపాలు చాలా సహజం అని ఈ కింది విషయం చూస్తే తెలుస్తుంది. థామస్ మన్రో మద్రాస్ గవర్నర్ జనరల్ హోదాలో 1827లో ప్రస్తుత కర్నూలు జిల్లాలోని ప్రత్తికొండ పట్టణానికి వచ్చి కలరా వ్యాధితో 6 జూన్ 1827న అక్కడే చనిపోయాడు. ప్రత్తికొండలోనే ఆయనను సమాధి చేసి, పెద్ద మంటపం నిర్మించి చుట్టూ చింత చెట్ల తోట పెంచారు. 1858లో ప్రత్తికొండలో చింతచెట్ల వేలం జరిగినప్పుడు మన్రో సమాధి ఉన్న తోపును కూడా అమ్మివేశారు. పది సంవత్సరాల తరువాత కాని అంటే 1868లో ఈ విషయాన్ని కనుక్కొని అప్పుడు ఆ వేలాన్ని రద్దు చేశారు. కనీసం పది సంవత్సరాల వరకూ బ్రిటిష్ వారు ఆ విషయం కనుక్కోలేక పోయారు. 1800లో చేసిన కొత్త పన్ను విధానం వలన ఇంతకు ముందు ఉన్న పన్ను కన్నా ఏ రకం పంట పండే భూమిలోనైనా (మెట్ట, తరి) పూర్వం వసూలు చేసే దానికన్నా వంద శాతం పన్ను అధికంగా అవటం వలన వ్యవసాయం

బాగా దెబ్బతింది. అయినా 1821 వరకూ ఈ పన్ను విధానాన్ని మార్చ లేదు. ఇక 1825 వరకూ చేసిన పైమాష్ సర్వే వలన ఈస్ట్ ఇండియా కంపెనీకి కొద్దిగా కూడా ఉపయోగం అనేది లేకుండా పోయింది.

బ్రిటిష్ వారు పరిపాలనలో పట్టుకోసం, రాజ్యాధికారం తమ చేతిలోకి రావడానికి 1800 నుంచి 1840 వరకూ శిస్తు గ్రహీతలైన జమీందార్లు, జాగీర్దార్లూ, పాలెగాండ్ల దగ్గర నుంచి వారి ఆధీనంలో ఉన్న భూములను స్వాధీనం చేసుకొని వారికి పెన్షన్ ఏర్పాటు చేసారు. అప్పట్లో పెద్ద వ్యతిరేకత రాలేదు. కాని దీని తర్వాత బ్రిటిష్ వారు ఒక పద్ధతి ప్రకారం అప్పటి వరకు గ్రామ రెవెన్యూ యంత్రాంగం ఉండి గ్రామ సేవలో భాగమైన గ్రామాధికారులు, తలారులు, పోలీసు ప్యూనులు, కట్టుబదులు, మంగలి, వడ్రంగి, కమ్మరి, కుమ్మరి, బేగారి, కటిక, తోటి, పాకీ పని చేసేవారు. సాగుచేసుకొనే భూములను (ఇనాము భూములను) వారి వద్ద నుంచి స్వాధీనం చేసుకొని వారికి జీతం ఇచ్చే పద్ధతిని దఫాల వారీగా అమలు చేయాలని నిర్ణయించారు. ఈ విషయాన్ని తెలుసుకున్న కర్నూలు జిల్లా కోయిలకుంట్ల తాలూకా నొస్సం జమీందారు నరసింహారెడ్డి (ఇతనికి నెలకు పెన్షన్‌గా పదకొండు రూపాయలుగా నిర్ణయించారు.) 1847లో కట్టుబడి ఇనాముదారులందరిని కలుపుకొని కోయిలకుంట్ల ట్రెజరీ మీద దాడిచేసి బ్రిటిష్ వారి మీద యుద్ధాన్ని మొదలుపెట్టాడు. అక్కడి నుండి ఎర్రమల, నల్లమల కొండల్లో ఉంటూ కంభం తహసిల్దార్‌ను చంపాడు. కొంతకాలానికి కోయిలకుంట్ల దగ్గరలో ఉన్న పేరుసోముల కొండల్లో బ్రిటిష్ సేనలు నరసింహారెడ్డిని పట్టుకొని ఉరి తీశాయి. నరసింహారెడ్డి తలను అందరికీ కనపడేలా కోట గుమ్మానికి వేలాడదీశారు. వేలాడదీసిన స్తంభం 1877 లో పూర్తిగా చివికిపోయి కిందపడిపోయే వరకూ నరసింహారెడ్డి తల అలానే ఉంచారు. గ్రామ రెవెన్యూ యంత్రాంగం, ఇతర గ్రామ సేవకులు సాగు చేసుకొనే ఇనాము భూముల రద్దు విధానం తరువాత కూడ చాల విమర్శలకు దారి తీసింది. ఈ రద్దు వలన తరతరాల నుంచి ఉన్న, అధికారంలో ఉన్న ప్రభుత్వాల ద్వారా ప్రోత్సహించబడుతున్న గ్రామీణ స్వయం పోషక వ్యవస్థ దాదాపు రద్దయ్యే పరిస్థితి ఏర్పడింది.

## సెటిల్‌మెంట్, రిసెటిల్‌మెంట్, పన్ను నిర్ధారణ

1825 వరకూ 'పైమాష్' పద్ధతి ద్వారా జరిగిన సర్వేలో లోపాలు సరిదిద్దడానికి, తమ ఆధీనంలో రాష్ట్రంలో ఉన్న మొత్తం భూమిని (అంటే సాగు భూములు, సాగుకు పనికొచ్చే భూములు, ఇతర అవసరాలకు ఉపయోగపడే భూములు, ఖాళీగా ఉన్న భూములు మొదలైనవి) ఒక క్రమబద్ధమైన రీతిలో కొలవడానికి బోర్డ్ ఆఫ్ రెవెన్యూ ఆధీనంలో ఒక ప్రత్యేక శాఖ అవసరం అని బ్రిటిష్ వారు నిర్ధారించుకొన్నారు. అందుకే 1856లో ఈస్ట్ ఇండియా కంపెనీ ఆధ్వర్యంలో కొత్తగా మద్రాస్ ప్రెసిడెన్సీ ప్రభుత్వం సెటిల్‌మెంట్ శాఖను నెలకొల్పింది. ఈ శాఖలో రైతు ఆధీనంలో ఉండే భూమి శిస్తు నిర్ధారించడానికి, సమగ్రమైన ఆధారాలు ప్రాతిపదికగా తీసుకోవాలని నిర్ణయించి మట్టి రకాన్ని, సాంద్రతను అంచనా వేయడానికి జియాలజిస్టులను కూడా నియమించారు. ఈ సర్వే శాఖ మట్టి రకాల్ని బట్టి, అందులో పండే మెట్ట, తరి పంటల దిగుబడిని బట్టి పంట దిగుబడిపై ఒక అంచనాకు వచ్చింది. ఆ తరువాత పన్ను నిర్ధారణ కోసం రకరకాల తగ్గింపులను పరిగణనలోకి తీసుకున్నారు. అవి 1) పంట పండించడానికి విత్తనం వేయబోయే ముందు నుంచి పంట కోసే వరకూ అయ్యే ఖర్చును పంట దిగుబడిలో నుంచి తీసి వేయడం; 2) అనుకోకుండా వాతావరణంలో వచ్చే అననుకూల మార్పులకు గాను 15 నుండి 25 శాతం ఖర్చు తీసి వేసేవారు; 3) రైతు మార్కెట్టులో అమ్ముకోవడానికి తీసుకెళ్లడానికి అయ్యే ఖర్చు, వ్యాపారస్తుడికి రైతు దగ్గర నుంచి కొనుగోలు చేయడానికి వచ్చే ఖర్చు లాంటి వాటికన్నింటికీ 8 నుండి 20 శాతం వరకూ పంట దిగుబడిలోనే మినహాయింపు ఇచ్చారు. ఈ మూడు రకాల మినహాయింపులు పోను మిగిలిన పంట దిగుబడిలో సగం పంటను ప్రభుత్వ భాగంగా పరిగణించి భూమికి శిస్తుగా నిర్ధారించారు.

నీటిపారుదలతో వ్యవసాయం చేసే భూములను స్థూలంగా ఐదు రకాలుగా విభజించారు.

1వ తరగతి – సంవత్సరం పొడవునా నీరు పారే నదులు, కాలువలు.
2వ తరగతి – 8 నెలలు నీరు పారే నదులు, కాలువలు.
3వ తరగతి – 5 నుంచి 8 నెలలు నీరు పారే నదులు, కాలువలు.
4వ తరగతి – 3 నుంచి 5 నెలలు నీరు పారే నదులు, కాలువలు.
5వ తరగతి – చిన్న చిన్న చెరువులు, నాలాలు, కాల్వలు మూడు నెలల లోపు పారేవి.

(1856లో తయారు చేసిన ఈ ఐదు రకాల నీటిపారుదల తరగతుల విభజన ఆంధ్రప్రదేశ్ నీటిపన్ను (సవరణ) చట్టం 1997 అమలులోకి వచ్చే వరకూ, పంట పండించుకోన్నందుకు వసూలు చేసే నీటి పన్నుకు ప్రాతిపదికగా తీసుకొన్నారు.)

అనంతపురం లాంటి కరువు జిల్లాల్లోనయితే ఐదు నెలలు నీరుపారే నదులు, కాలువలు ఉన్నా కూడా రైతులు నీరు పారించుకోవడం చాల ఖర్చుతో కూడిన పని కాబట్టి వీటిని ఐదవ తరగతి నీటిపారుదల భూముల కిందికే తీసుకువచ్చి, పంట నికర విలువలో భూమి శిస్తు నిర్ధారింపునకు పరిగణనలోకి తీసుకొనే తగ్గింపుకు కొలమానంగా తీసుకున్నారు.

### తరం

ఒకేరకమైన మట్టి కలిగిన నేలలను, అదే రకానికి దగ్గరగా ఉన్న నేలను ఒక గ్రూపుగా తయారుచేసి, దానిని ఒక తరంగా గుర్తించి రేటును నిర్ణయించేవారు. ఈ తరం రేటును తరి భూములకు, మెట్ట భూములకు పంట దిగుబడి వేరుగా ఉంటుంది కాబట్టి, ఒకే రకమైన నేల అయినప్పటికీ వేరు వేరు రేట్లు నిర్ణయించేవారు.

ఈ సర్వేకు ముప్పై సంవత్సరాలు తీసుకొన్నారు. ఒకసారి సర్వే చేసి, నెంబర్లు ఇచ్చిన తరువాత రెండోసారి ముప్పై ఏళ్లలో రిసెటిల్‌మెంట్ చేసి కొత్త నంబరు ఇచ్చి పన్ను నిర్ధారణ చేసారు. ఈ వివరాలతో కూడిన రికార్డును తమ ఆధీనంలో ఉన్న కోస్తా రాయలసీమ ప్రాంతాలలోని ప్రతి గ్రామానికి, పట్టణానికి తయారు చేశారు. ఈ రిజిష్టరునే రిసెటిల్‌మెంట్ రిజిష్టరు (ఆర్.ఎస్.ఆర్.) అంటారు. ఈ ఆర్.ఎస్.ఆర్. ఇప్పటికీ కూడ ఏదైనా భూమి ప్రభుత్వ భూమిలేని వ్యక్తులకు భూమి ఏ విధంగా సంక్రమించింది అనే దానిని నిర్ణయించ డానికి ప్రాతిపదికగా ఉంది.

## అసఫ్ జాహీల పాలనలో (1748 నుండి 1853)

1748లో మొదటి నిజాం చనిపోయిన తరువాత సింహాసనం కోసం జరిగిన పోరాటాల వలన రెవెన్యూ పరిపాలన కుంటుపడింది. నిజాం అలీ పరిపాలన కాలం నుంచి కొంత కుదుటుపడినా పూర్తిగా బ్రిటిష్ వాళ్లకు నిజాం అలీ తన పరిపాలనలోని రాష్ట్రంలో 3/4 వంతు

భూమిని, వారి ప్రత్యక్ష స్వంత పరిపాలనకు అప్పగించాడు. ఒకవైపు బ్రిటిష్ వారు రకరకాల చట్టాలు చేస్తూ రెవెన్యూ పరిపాలనను క్రమబద్ధీకరిస్తుంటే తరువాత పరిపాలించిన నిజాములు తమ ఆధీనంలో ఉన్న భూమిపై హక్కులు అంటే సర్ఫ్-ఇ-ఖాస్ భూముల పై కానీ, పాయిగా భూములపై కానీ, ముందుగా కొంత మొత్తం చెల్లించి శిస్తు వసూలు చేసుకొనే హక్కు పొందడం ద్వారా పెద్ద విస్తీర్ణాలలో భూములు పొందే విధానంలో కాని ఎలాంటి మార్పు తీసుకురాలేదు.

అసఫ్ జాహీల పాలనలో ఉన్న హైదరాబాద్ రాష్ట్రంలోని భూమిలో 80 శాతం భూమి ప్రభుత్వం ఆధీనంలోనే ఉండి, ఈ భూములపై విధించే పన్ను ప్రభుత్వానికే జమ అయ్యేది. ఈ భూములనే దివాని లేదా ఖల్సా భూములు అంటారు. ఈ భూములు కాకుండా మిగిలిన భూములు సర్ఫ్-ఇ-ఖాస్, పాయిగా భూములు (సైన్యాన్ని పోషించడానికి ఇచ్చేవి. నిజాం దగ్గర ఉన్న సైన్యంతో పాటు అవసరమైనప్పుడు యుద్ధం చేయడానికి, ఇతర అవసరాలకుగాను పోషించే సైన్యాలు), ఇనాం భూములు. వీటిని కొన్నిసార్లు షరతులతోనూ, కొన్నిసార్లు ఎలాంటి శిస్తు లేకుండా, లేదా చాల తక్కువ పన్ను విధింపుతోను కేటాయించేవారు.

ఖల్సా భూములంటే రైతువారీ ఆధీనంలోని భూములు. మొదటి నిజాం పాలనలో వాటిలో నుంచి సాధారణంగా రైతులను ఖాళీ చేయించే ఆనవాయితీ ఉండేది కాదు. ఒకవేళ ముసలితనంతో సాగు చేయలేక పోతేనో, వారసులు లేకపోతేనో, బాకీలు ఉండటం వలనో, రైతు భూమి ఉన్న చోటుకి చాలా దూరంగా నివసిస్తుంటే, చాల పెద్ద పెద్ద విస్తీర్ణంలో భూములు ఉంటేనో, రైతు వ్యవసాయం కాకుండా వేరే వృత్తిని ఎంచుకొంటేనో తప్ప ప్రభుత్వం ఈ భూములను స్వాధీనం చేసుకొని వేరేవారికి అప్పగించేదికాదు. వారసత్వంగా భూమి శిస్తు వసూలుకు అధికారం పొందిన వారు స్థిరమైన రాజకీయ పరిపాలన 1748 తరువాత లేకపోవడం వలన రెవెన్యూ యంత్రాంగాన్ని అదుపు చేసేవారు లేక రెవెన్యూ పరిపాలన అక్రమ మార్గాలు చేపట్టడం జరిగింది. ముఖ్యంగా ఎక్కువగా పలుకుబడి ఉన్న దేశ్‌ముఖ్‌లు, దేశపాండ్యాలు లాంటి భూమి శిస్తు వసూలు చేయడమే వృత్తిగా ఉన్నవారు కేవలం భూమి శిస్తు వసూలు చేయడానికి వందల వేల ఎకరాలు, గ్రామాలకు గ్రామాలు తమ ఆధీనంలోకి సంపాదించారు.

వీరు ఎక్కువ మొత్తంలో భూమి శిస్తు వసూలు చేయడమే కాకుండా, అబ్కారీ పన్ను (ఎక్సైజ్), వృత్తులు చేసేవారి దగ్గర నుంచి పన్ను, తోటలపై పన్ను, చెట్ల మీద పన్ను, మామిడి పంట మీద పన్ను ఇలా రకరకాల పన్నుల రూపంలో ప్రజల నుంచి అధిక మొత్తంలో గుంజేవారు. తరువాత కాలంలో వీరే దశాబ్దాల తరబడి ధాన్యం వ్యాపారాలుగా (ధాన్యానికి రేటు కూడా వీరే నిర్ణయించేవారు), మద్యం తయారీదారులుగా, వ్యాపారులుగా, కల్లు కాంట్రాక్టర్లుగా, వడ్డీ వ్యాపారులుగా నిలదొక్కుకొని, పూర్తిగా గ్రామాలకు గ్రామాలపైనే పట్టు సాధించారు. ఇందుకు ఉదాహరణ పింగళి వెంకటరామారెడ్డి (వడ్డేపల్లి, వరంగల్ తాలూకా దేశ్‌ముఖ్) తుంగతుర్తి నరసింహారావు (ములుగు తాలూకా, వరంగల్ సుభాలో భూస్వామి) లాంటి వాళ్లు వేల ఎకరాలు తమ ఆధీనంలో వివిధ చోట్ల సంపాదించారు.

దేశ్‌ముఖ్‌లు, దేశపాండేలతో పాటు గ్రామ రెవెన్యూ అధికార యంత్రాంగంలోనే భాగమైన పటేల్‌లు, పట్వారీలు వందల వేల ఎకరాలు తమ ఆధీనంలో ఉంచుకొని కొత్తగా 'భగేలాలు' (జీతగాళ్లు) అనే పేరుతో కేవలం వ్యవసాయం చేయడానికి, కొంత మొత్తం డబ్బు/ధాన్యం ముట్ట చెపుతామనే మిషతో వెట్టి చాకిరీ చేయించుకొనే, ప్రజలను నియమించుకొనే ఒక కొత్త వ్యవస్థ మొదలయింది. వీరంతా కూడా తరచుగా భూమి లేనివారికి భూమి కౌలుకివ్వడం, వారు 12 సంవత్సరాలు వరుసగా ఒకే భూమిపై వ్యవసాయం చేస్తే ఆ వ్యక్తి భూమికి రక్షిత కౌలుదారు (ప్రొటెక్టెడ్ టెనెంట్) అవుతాడు కాబట్టి పదే పదే వ్యవసాయం చేసే భూముల నుంచి ఎక్కువ మొత్తంలో కౌలు (డబ్బు) డిమాండ్ చేసి భూస్వాములతో పాటు రైతులను భూముల నుంచి వెళ్లగొట్టడం చేస్తుండేవారు. వ్యవసాయం చేస్తున్న కౌలుదార్ల / ఆక్రమణదార్ల పేర్లు గ్రామ రెవెన్యూ రికార్డులలో నమోదు చేయకుండా వేధించడం, లేదా అందుకోసం డబ్బులు గుంజడం చేస్తుండేవారు. తమ మాటవినని రైతుల వద్ద నుండి ఏదో ఒక సాకుతో భూములను స్వాధీనం చేసుకొని వాటిని వేలం వేయడం, ఇప్పటి వరకూ వ్యవసాయం చేయని భూముల వేలం జరిగేటప్పుడు తమకనుకూలంగా ఉన్న వారికి 'లావుని పట్టా'లు మంజూరు చేయడం లాంటి రైతు వ్యతిరేక వ్యవహారాలు తరచుగా చేస్తుండేవారు. గ్రామాధికారులతో రైతులకు ముఖ్యంగా తక్కావి రుణాల (వ్యవసాయం చేయడానికి లేదా బావులు తవ్వుకోవడానికి ఇచ్చే రుణాలు) మంజూరులోనూ, తలాఫ్-మాల్ (వర్షం ఇతర ప్రకృతి వైపరీత్యాల వలన పంటలు పాడైతే శిస్తు మాఫీ చేయడం) లాంటి వాటిపై అధికారం ఉండడం వలన ఈ గ్రామాధికారులకు కూడా గ్రామాలపై పట్టు బాగా ఉండేది.

1853 తరువాత సుభాలలోని మొత్తం తరి భూమిలో 1/4 వంతు కౌలుదార్ల సాగులోనూ, మిగిలిన మొత్తం భూమి 'భగేలాల'లతోనూ వ్యవసాయం చేయించారంటే వారసత్వంగా వస్తున్న రెవెన్యూ యంత్రాంగమైన దేశ్‌ముఖ్‌లు, దేశ్‌పాండ్యాలు, పటేల్‌లు, పట్వారీలు సామాన్య ప్రజల పక్షాన కాకుండా తమ ఆధీనంలో ఎక్కువ భూములను ఉంచుకోవడం వలనా, జమీందార్లు, జాగీర్దార్ల ఆధీనంలో వందల వేల ఎకరాలు ఉండడం వలనే జరిగింది. ఇంతకు ముందు గ్రామ ప్రజలకు సక్రమ పాలన అందించడంలో సహాయపడిన రెవెన్యూ యంత్రాంగం చాలా చోట్ల పలు రకాలుగా రైతులను పీడించడం మొదలయింది.

సంస్థానాధీశుల ఆధీనంలో (పూర్వం హిందూ రాజులు, తరువాత ముస్లిం పాలనలో ఢిల్లీ సుల్తానుకు తరువాత నిజాంలకు ప్రతి సంవత్సరం కొంత మొత్తం చెల్లించేవారు.) గ్రామాలకు గ్రామాలే ఉండేవి. వీరి ఆధీనంలోని భూమిపై పూర్తి పరిపాలనే కాకుండా, స్వతంత్రంగా కోర్టులు కూడా ఉండేవి. హైదరాబాద్ రాష్ట్రంలో 14 సంస్థానాలు ఉండేవి. ఉదాహరణకు పాల్వంచ సంస్థానంలో (69 గ్రామాలు, రెండు పట్టణాలు 3,090 చదరపు మైళ్ల విస్తీర్ణంలో ఉండేది) భూమి శిస్తుతో పాటు అడవి నుంచి కట్టెలు తెచ్చుకుంటే వాటిపై పన్ను, కొత్తగా పోడు వ్యవసాయం చేసుకుంటే ఆ భూమికి దగ్గరలో ఇళ్లు కట్టుకుంటే వాటిపై పన్ను, ఇప్ప పూల మీద పన్ను కోయల నుంచి, కొండ రెడ్ల నుంచి వసూలు చేస్తుండేవారు. కొన్నిసార్లు కోయలు మంచి కలపను సేకరించినందుకు బదులుగా, పంటలు పండించుకోవడానికి కొద్దిగా భూమిని పంచేవారు. దేశ్‌ముఖ్‌లు, దేశ్‌పాండ్యాల అండతో వ్యాపారులు, కోయిల దగ్గరనున్న కలపను తక్కువ మొత్తానికి కొనుగోలు చేసి, చాల ఎక్కువ లాభాలకు ఎగుమతులు చేసుకొనేవారు.

*(ఇంకావుంది)*

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)*
*saralareddy007@gmail.com*

వీ

## పైలెట్ల సమ్మె

అధిక వేతనం, మెరుగైన పని పరిస్థితులు కల్పించాలనే డిమాండ్‌తో ఏప్రిల్ 27 అర్ధరాత్రి నుంచి ఇండియన్ కమర్షియల్ పైలెట్స్ అసోసియేషన్ (ఐసిపిఎ) 800 మందితో సమ్మెకు దిగింది. వేతనంలో తమ మధ్య ఉన్న వ్యత్యాసాన్ని సరిచేయాలన్నది ఐసిపిఎ చేస్తున్న డిమాండ్లలో ప్రధానమైనది. ఎయిర్ ఇండియా నష్టాలకు నిర్వాహణ లోపాలే కారణమని, దీనిపై సిబిఐ చేత దర్యాప్తు జరిపించాలని కూడా సంఘం కోరింది. పలు కీలక డిమాండ్లపై కేంద్రం ప్రభుత్వం దిగిరావడంతో పైలెట్లు సమ్మె విరమించి మే 6 నుంచి విధుల్లో చేరారు.

## భోపాల్ దుర్ఘటన హంతకులకు ఊరట

భోపాల్ గ్యాస్ దుర్ఘటన కారకులపై అభియోగాల తీవ్రతను తగ్గిస్తూ 1996లో ఇచ్చిన తీర్పును నిలిపి వేయడానికి సుప్రీంకోర్టు మే 11న నిరాకరించింది. తీర్పును నిలిపివేయాలని సిబిఐ, మధ్యప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం వేసిన పిటిషన్‌లో పేర్కొన్న విషయాలు సంతృప్తికరంగా లేవని కోర్టు వ్యాఖ్యానించింది. భోపాల్ ప్రమాదానికి సంబంధించి మరిన్ని నిజాలు వెల్లడవుతున్నందున ఈ కేసును విచారిస్తున్న సెషన్స్ కోర్టు 1996 నాటి మా తీర్పును పాటించాల్సిన అవసరంలేదు. నిందితులపై తీవ్రమైన అభియోగాలను పునరుద్ధరించే విషయంలో సెషన్స్ కోర్టుకు పూర్తి స్వేచ్ఛనిస్తున్నామని సుప్రీం కోర్టు న్యాయమూర్తులు పేర్కొన్నారు.

## ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు

పశ్చిమ బెంగాల్‌లో తృణమూల్ కాంగ్రెస్ పార్టీ 294 స్థానాలకు గాను 227 స్థానాలో గెలిచి సిపిఎం పార్టీని ఓడించి అధికారాన్ని దక్కించు కుంది. తమిళనాడులో అన్నాడిఎంకె పార్టీ 234 స్థానాలకు గాను 202 స్థానాలో గెలిచి అధికార డిఎంకె పార్టీని ఓడించి అధికారంలోకి వచ్చింది. అస్సాంలో కాంగ్రెస్ పార్టీ 126 స్థానాలకు గాను 78 స్థానాల్లో గెలిచి తిరిగి అధికారంలోకి వచ్చింది. పుదుచ్చేరిలో ఆల్ ఇండియా ఎన్ఆర్ కాంగ్రెస్ పార్టీ 30 స్థానాలకు గాను 20 స్థానాల్లో నెగ్గి కాంగ్రెస్ పార్టీ కూటమిని ఓడించింది. కేరళలో కాంగ్రెస్ నేతృత్వంలోని యుడిఎఫ్ కూటమి 140 స్థానాలకుగాను 72 స్థానాలో నెగ్గి అధికార వామపక్ష నాయకత్వంలోని ఎల్‌డిఎఫ్‌పై విజయం సాధించింది. ఎన్నికల ఫలితాలు మే 13న వెలువడ్డాయి.

## అరుణాచల్‌ప్రదేశ్ సిఎం మరణం

అరుణాచల్‌ప్రదేశ్ ముఖ్యమంత్రి దోర్జీ కండూ, మరో నలుగురుతో కలిసి తవాంగ్ నుంచి ఇటానగర్‌కు మే 30న హెలికాప్టర్‌లో బయలుదేరిన 20 నిమిషాలకే బేస్ సెంటర్‌తో కమ్యూనికేషన్ కోల్పోయింది. తవాంగ్‌కు 20 కిలోమీటర్ల దూరంలోని క్యేలా ప్రాంతం సేలా కనుమల్లో హెలికాప్టర్ పేలిపోయింది. ప్రమాదంలో కాలిపోయిన మృత దేహాలను మే 4న గుర్తించారు. దోర్జీ ఖండూ స్థానంలో జోర్బమ్ గామ్లిన్ (50) ముఖ్యమంత్రిగా ఎంపికయ్యారు.

## నోయిడా రైతాంగ పోరాటం

దేశ రాజధాని ఢిల్లీ నుంచి గ్రేటర్ నోయిడా వరకు నిర్మిస్తున్న యమునా ఎక్స్‌ప్రెస్ హైవే కోసం తమ భూములను బలవంతంగా తీసుకున్నారంటూ రైతాంగం ఆందోళన చేస్తోంది. తీసుకున్న భూములకు పరిహారాన్ని పెంచాలని, సేకరించిన భూమిలో సగ భాగాన్ని ఉచితంగా తిరిగి ఇవ్వాలని ఆందోళన చేస్తున్న రైతులపై మే 7న పోలీసులు జరిపిన కాల్పుల్లో మృతి చెందిన వారి సంఖ్య నాలుగుకు చేరుకుంది. ఈ ఆందోళన ఇప్పుడు ఆగ్రా, అలీగడ్ ప్రాంతాలకు కూడా విస్తరించింది. భూసేకరణకు విడుదల చేసిన నోటిఫికేషన్‌ను నిలిపివేసి, యుపి సర్కారు ఇప్పటి వరకు సేకరించిన రైతుల భూములను యజమానులకు తిరిగి అప్పగించాలని, అలహాబాద్ హైకోర్టు వెల్లడించింది. గ్రేటర్ నోయిడాలో జరిగిన హింస తమను బాధిస్తోందని జాతీయ మానవ హక్కుల కమిషన్ ఆవేదన వ్యక్తం చేసింది. బాధిత గ్రామాలకు ప్రత్యేక దర్యాప్తు బృందాన్ని పంపిస్తున్నట్లు ప్రకటించింది. నోయిడాలో మహిళలపై అకృత్యాలకు పాల్పడ్డారని, వాటిపై సిబిఐ విచారణకు ఆదేశించాలని జాతీయ మహిళా కమిషన్ డిమాండ్ చేసింది.

## అయోధ్య తీర్పుపై సుప్రీం స్టే

అయోధ్య కేసులో లక్నో బెంచ్ ఇచ్చిన తీర్పుపై సుప్రీం కోర్టు స్టే విధించింది. వివాదస్పద స్థలమైన 2.77 ఎకరాలతోపాటు... పక్కనే ఉన్న 67 ఎకరాల స్థలంలో కూడా యథాతథ స్థితి కొనసాగించాలని ఆదేశించింది. దీనిపై జస్టిస్ అఫ్తాబ్ ఆలమ్, జస్టిస్ ఆర్.ఎం. లోధాలతో కూడిన ధర్మాసనం మే 8న విచారణ జరిపింది. వివాదస్పద స్థలాన్ని విభజించి, పంచాలని పిటిషనర్స్ ముగ్గురిలో ఏ ఒక్కరూ కోరలేదు. ఇది కొత్తగా ఉంది. కొత్త కోణమూ ఉంది. ఇలాంటి డిక్రీలను అనుమతించలేం అన్నారు.

## నకిలీ ఎన్‌కౌంటర్లకు మరణదండనే

ఎన్‌కౌంటర్‌లను అత్యంత అరుదైన నేరంగా పరిగణిస్తూ విచారణలో పోలీసు సిబ్బంది నేరం రుజువైతే అందులో పాల్గొన్న పోలీసు సిబ్బందికి మరణ శిక్ష విధించాల్సిందేనని సుప్రీం కోర్టు రూలింగ్ ఇచ్చింది. పోలీసు అధికారులు చేసుకున్న బెయిల్ పిటిషన్లను తోసిపుచ్చుతూ జస్టిస్ మార్కండేయ కట్జు, జస్టిస్ జ్ఞానసుధా మిశ్రాలతో కూడిన బెంచ్ ఈ తీర్పు వెలువరించింది. 'సామాన్యులు సాధారణ నేరాలకు పాల్పడితే సాధారణ శిక్షలు విధించొచ్చు. 'పోలీసులే నేరాలకు పాల్పడిన పక్షంలో వారికి విధించే శిక్ష కఠినంగా ఉండాలి అని కట్జు తీర్పు వెలువరించారు. గుప్తా అనే రియల్ ఎస్టేట్ వ్యాపారిని 2006 నవంబర్ 11న అపహరించి, ఎన్‌కౌంటర్ పేరుతో కాల్చిచంపిన కేసులో ఈ తీర్పు వెలువరించారు.

## రైతు నాయకుడు తికాయత్ మృతి

రైతుల పక్షాన పోరాడిన భారతీయ కిసాన్ యూనియన్ (బికెయు) నాయకుడు మహేంద్ర సింగ్ తికాయత్ (76) మృతిచెందారు. సంవత్సర కాలంగా ఎముకల కేన్సర్‌తో బాధపడుతున్న ఆయన మే 15న ముజఫర్‌నగర్‌లో మరణించారు. రైతులకు ఇచ్చిన పంట రుణాలను మాఫీ చేయాలని, చెరుకుకు మద్దతు ధర కల్పించాలని, వ్యవసాయ విద్యుత్ చార్జీలను తగ్గించాలన్న డిమాండ్లతో 1988లో తికాయత్ నాయకత్వంలో మీరట్‌ను ముట్టడించారు. రైతుల పక్షం వహించినందుకు ఆయన అనేక సార్లు జైలుకు వెళ్లాల్సి వచ్చింది.

## ఆజాద్ ఎన్‌కౌంటర్‌పై సి.బి.ఐ. దర్యాప్తు

మావోయిస్టు అగ్రనేత ఆజాద్, జర్నలిస్ట్ హేమచంద్రపాండేల ఎన్‌కౌంటర్‌పై సిబిఐ దర్యాప్తు బృందం విచారణ ప్రారంభించింది. మే 24న జాయింట్ డైరెక్టర్ లక్ష్మీనారాయణ ఆధ్వర్యంలో 15 మంది సభ్యుల సిబిఐ బృందం ఎన్‌కౌంటర్ సంఘటన స్థలంలో జరిగాయంటున్న కాల్పులపై దర్యాప్తు చేపట్టనున్నారు. సుప్రీంకోర్టు ఆదేశాల మేరకు ఎన్‌కౌంటర్‌లో పాల్గొన్న పోలీసులపై 120బి, 302 సెక్షన్ల కింద కేసులు నమోదయ్యాయన్నారు. వీ

## టిబెట్ ప్రధానిగా ప్రవాస భారతీయుడు

టిబెట్ ప్రభుత్వానికి కొత్త ప్రధానిగా లోత్సాంగ్ సాంగే ఎన్నికయ్యారు. టిబెట్ ప్రవాస పార్లమెంట్‌కు జరిగిన ఎన్నికల్లో నెగ్గిన సాంగేను ప్రధాన మంత్రిగా ప్రకటిస్తున్నట్లు ఎన్నికల కమిషనర్ జాంపాల్ చోసాంగ్ తెలిపారు. సాంగే తన సమీప ప్రత్యర్థి తెతాంగ్ తెంజిన్‌ను 8,646 ఓట్ల తేడాతో ఓడించారు. ప్రవాసంలో జీవిస్తున్న లక్షా 50 వేల మంది టిబెటన్లలో 85 వేల మంది సాంగేకు ఓటువేసి ఉంటారని రాజకీయ విశ్లేషకుల అభిప్రాయం.

## లిబియాలో 600 మంది జల సమాధి

అంతర్గత తిరుగుబాట్లతో అట్టుడుకుతున్న లిబియా నుంచి ఇటలీకి నౌకలో పారిపోవడానికి యత్నించిన 600 మంది సముద్రంలో జరిగిన ప్రమాదంలో జలసమాధి అయినట్లు అనుమానాలు వ్యక్తమవుతున్నాయి. లిబియా రాజధాని ట్రిపోలి సమీపంలోని తీర ప్రాంతం నుంచి బయలుదేరిన నౌక కొద్దిసేపటికే సముద్రంలో మునిగి పోయినట్లుగా ప్రత్యక్ష సాక్షులు తెలిపారని ఐక్యరాజ్య సమితి శరణార్థి సంస్థ ప్రతినిధి లారాబోల్డ్రిని పేర్కొన్నారు.

## గడాఫీ కుమారుడి ఇంటిపై నాటో దాడి

లిబియా అధ్యక్షుడు మౌమర్ గడాఫీ ఇంటిపై నాటో బలగాలు వైమానిక దాడుల చేశారు. ఈ దాడి నుంచి గడాఫీ తప్పించుకున్నా ఆయన చిన్న కొడుకు, ముగ్గురు మనుమలు చనిపోయారు. ఏప్రిల్ 30న నాటో యుద్ధ విమానాలు ప్రయోగించిన శక్తివంతమైన మూడు మిస్సైళ్లు గాడాఫీ ఉన్న ఇంటిని ఢీ కొట్టాయని, ఆయనకూ ఆయన భార్యకూ. ఎటువంటి ముప్పు వాటిల్లలేదని వారి కుమారుడు లిబియా ప్రభుత్వ అధికార ప్రతినిధి మౌసా ఇబ్రహీం తెలిపారు. వైమానిక దాడుల్లో గడాఫీ కుటుంబ సభ్యులను చంపడాన్ని వెనిజులా అధ్యక్షుడు హ్యూగో చావేజ్ ఖండించారు.

## చైనా జనాభా 137 కోట్లు

చైనా జనాభా 137 కోట్లకు చేరుకుంది ప్రస్తుతం దేశ జనాభాలో 16.6 శాతం మంది యువకులు ఉన్నారు. వృద్ధుల శాతం 13.26కు పెరిగింది. ఇకపై ఒక జంటకు ఒక బిడ్డ విధానాన్ని కొనసాగిస్తామని చైనా అధ్యక్షుడు హు జింటావో ప్రకటించారు. జనాభాలో పురుషులు 51.27 శాతం ఉండగా, స్త్రీలు 68.73 శాతం ఉన్నారు.

## ఒసమా బిన్‌లాడెన్ మృతి

ఆపరేషన్ జెరోనిమో పేరుతో అమెరికా కమాండోలు పాకిస్తాన్ సైనిక పట్టణం అబ్బాబాద్‌లోని అల్‌కాయిదా వ్యవస్థాపకుడు బిన్ లాడెన్ స్థావరంపై దాడి చేసి చంపేశారు. ఈ దాడిలో అతని కుమారుడు, రక్షణగా ఉండే వాళ్లు కూడా చనిపోయారు. పాకిస్థాన్ ప్రభుత్వానికి సమాచారం కూడా ఇవ్వకుండానే ఈ దాడిని అమెరికన్ కమాండోలు అతి రహస్యంగా చేపట్టారు. లాడెన్‌ను చంపిన కొన్ని గంటల్లోనే అతని మృతదేహాన్ని ఉత్తర అరేబియా సముద్ర జలాల్లో ఖననం చేసినట్లు అమెరికా అధికారులు ప్రకటించారు. దీనిపై అరబ్ దేశాలంతటా, పాకిస్తాన్‌లోను నిరసనలు వెల్లువెత్తాయి.

## మాజీ సైన్యాధిపతికి 30 ఏళ్ల శిక్ష

లక్షలాది మంది ప్రజల ఊచకోత ఘాతుకానికి బాధ్యుడ్ని చేస్తూ ఐక్యరాజ్యసమితి న్యాయస్థానం మే 17 2011న రువాండా మాజీ సైన్యాధిపతి ఆగస్టిన్ బిజిమున్గుకు 30 ఏళ్ల కారాగార శిక్ష విధించింది. 1994 ఏప్రిల్ 6న మొదలైన ఈ నరమేధంలో సుమారు 8 లక్షల మంది ఆహుతైపోయారు.

## ప్రపంచ జనాభా 2100కి వెయ్యికోట్లు

ప్రస్తుతం ఉన్న సంతానోత్పత్తి రేటు ఇదే విధంగా కొనసాగితే 2050 నాటికి ప్రపంచ దేశాల జనాభా 9 బిలియన్లకు (900 కోట్లు) పైగా పెరిగే అవకాశం ఉంది. ఇక ఆ శతాబ్దం చివరికి అంటే 2100 నాటికి ప్రపంచ జనాభా 10.1 బిలియన్లకు (1010) చేరుకోగలదని ఐక్యరాజ్యసమితి గణాంకాలు వెల్లడించాయి. సంతాన రేటు అధికంగా ఉన్న సబ్ సహారా ఆఫ్రికా, ఆసియా, లాటిన్ అమెరికా దేశాల ద్వారా ఈ జనాభా పెరుగుతోందని గణాంకాలు తెలియజేస్తున్నాయని ఐక్యరాజ్య సమితి సమాచార కేంద్రం ఒక పత్రికా ప్రకటనలో పేర్కొంది.

## అమెరికాలో టోర్నడోల బీభత్సం

ఏప్రిల్ ఆఖరులో వచ్చిన టోర్నడోల వల్ల అలబామా, మిసిసిపి, టెన్నిసెలో, అర్కాన్సస్, జార్జియా, వర్జీనియా, తాసియానా రాష్ట్రాలు తీవ్రంగా దెబ్బతిన్నాయి. దాదాపు రెండు వందల యాభై మంది దాకా మరణించారు. మరికొంత మంది అచూకీ దొరకడం లేదని అధికార వర్గాలు తెలిపాయి. పెద్ద ఎత్తున ఆస్తి నష్టం జరిగింది.. పట్టణంలోని సమాచార వ్యవస్థలన్నీ దెబ్బతిన్నాయి. ఈ టోర్నిడోల దెబ్బకు గల్లంతైన వారికోసం సహాయక సిబ్బంది గాలింపును ముమ్మరం చేశారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 ఏప్రిల్ 2011 నుండి 20 మే 2011 వరకు జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 2310)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 2 | – | 26 | 24 | 2 | 2 | – | 2 | 2 | 1 | 1 | 2 | 2 | 20 | 30 | – | – | – | 2 | 4 |
| హైదరాబాద్ | – | – | – | 12 | 13 | – | – | – | 6 | 8 | 7 | 13 | – | – | 34 | 27 | – | – | – | 1 | – |
| కరీంనగర్ | 1 | 6 | 2 | 43 | 45 | 10 | 24 | 1 | 3 | 14 | 1 | 3 | 3 | 6 | 30 | 51 | – | – | – | 5 | 38 |
| ఖమ్మం | – | 1 | 1 | 10 | 16 | 3 | 7 | – | 1 | 4 | 8 | 8 | 4 | 4 | 47 | 22 | – | – | – | – | 48 |
| మహబూబ్‌నగర్ | – | 3 | – | 9 | 18 | 9 | 9 | – | 2 | 6 | 5 | 11 | 13 | 15 | 35 | 15 | – | – | – | 4 | 6 |
| మెదక్ | – | 3 | 1 | 19 | 8 | 4 | 4 | 1 | 3 | 1 | 8 | 5 | 1 | 6 | 46 | 26 | – | – | – | – | – |
| నల్గొండ | – | 1 | – | 32 | 15 | 2 | 5 | 2 | 1 | 7 | 2 | 4 | 3 | 8 | 56 | 36 | – | – | – | 1 | 31 |
| నిజామాబాద్ | – | – | – | 6 | 18 | – | 5 | 9 | – | 6 | – | – | 6 | 5 | 31 | 35 | – | – | – | – | – |
| రంగారెడ్డి | 1 | 7 | – | 11 | 20 | 2 | 12 | 3 | 3 | 6 | 4 | 3 | 6 | 8 | 70 | 14 | – | – | – | – | 4 |
| వరంగల్ | 1 | 1 | – | 12 | 8 | 2 | 5 | 3 | 1 | 1 | – | 1 | – | 2 | 22 | 5 | – | – | – | – | 19 |
| అనంతపూర్ | 1 | 10 | – | 12 | 5 | 1 | 1 | – | 2 | 5 | – | – | 4 | 5 | 39 | – | – | – | – | – | 2 |
| చిత్తూరు | – | – | – | 9 | 11 | 3 | 4 | – | 2 | 3 | 5 | 8 | 18 | – | 39 | 7 | – | – | – | – | 2 |
| కర్నూలు | – | 7 | – | 10 | 16 | 4 | 2 | 2 | 3 | 10 | 6 | 6 | 8 | 6 | 40 | 21 | – | – | – | 4 | 8 |
| గుంటూరు | – | – | – | 8 | 6 | 1 | 2 | – | – | 1 | 7 | 4 | – | 2 | 22 | 6 | – | – | – | – | 11 |
| నెల్లూరు | – | – | – | 3 | 4 | – | – | – | – | 6 | – | 1 | 3 | 5 | 24 | 18 | – | – | – | – | 33 |
| కడప | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| ప్రకాశం | – | 7 | 7 | – | – | 15 | 12 | – | 5 | 2 | – | – | 7 | 5 | 27 | – | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | 1 | 7 | 4 | 3 | 3 | 6 | 2 | 1 | 3 | 4 | 2 | 2 | 18 | 5 | – | – | – | – | – |
| విజయనగరం | – | – | – | 2 | 3 | 1 | 2 | 2 | 3 | – | – | 2 | 1 | 18 | 6 | – | – | – | – | – | 2 |
| తూర్పు గోదావరి | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| **మొత్తం** | **5** | **48** | **12** | **231** | **234** | **62** | **95** | **29** | **38** | **86** | **57** | **72** | **82** | **82** | **628** | **324** | **–** | **–** | **–** | **17** | **208** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – ఎస్. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; గుంటూరు – బి. అంజమ్మ ; నెల్లూరు – బాలగురువయ్య; శ్రీకాకుళం – జి. సుధీర్; ప్రకాశం – ఎల్. సాంబశివరావు, విజయనగరం – డి. సుధాకర్




## అభివృద్ధిని ఇలా చూద్దాం

వ్యాసాలు, సమీక్షలు

### ముదునూరి భారతి

పేజీలు 206

వెల రు. 80

## కొత్తచూపు

'అభివృద్ధి వెలుగునీడలు', ఇతర వ్యాసాలు

### ఆర్. ఎస్. రావు

పేజీలు 296

వెల రు. 100




ప్రతులకు, వివరాలకు :

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com




## ప్రతి అక్షరం ప్రజాద్రోహం

జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ నివేదిక
పొరపాట్లు - అబద్ధాలు - వక్రీకరణలు

### ఎన్. వేణుగోపాల్

పేజీలు 72 వెల రు. 20

ప్రచురణ : **తెలంగాణ ఆత్మగౌరవ వేదిక**

ప్రతులకు : **దిశ పుస్తక కేంద్రం,** చిక్కడపల్లి, హైదరాబాద్. ఫోన్ : 040-27640574

**VEEKSHANAM** Telugu Monthly Journal of Political Economy and Society - 119 - June 2011
• RNI Regn.No.APTEL/2003/11482• Published on 29/05/2011 • Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao